# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అప్పకవీయము, గిడుగు రామమూర్తిపంతుల విమర్శతో | ... | 3 | 0 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము | ... | 8 | 0 |
| „ ఉత్తమప్రతి, 2 సంపుటములు | ... | 10 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| „ టీక | ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గల సంపుటము | ... | 3 | 0 |
| ఆరణ్యపర్వము | ... | (అచ్చు) | |
| విరాటోద్యోగపర్వములు | ... | (అచ్చు) | |
| భీష్మద్రోణపర్వములు | ... | „ | |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | „ | |
| శాంతిపర్వము | ... | 3 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 3 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | (అచ్చు) | |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | „ | |
| శాంతిసప్తకము | ... | 5 | 4 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, అట్టబైండు | ... | 1 | 4 |
| డిటో క్యాలికోబైండు | ... | 1 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 12 |
| కవికర్ణరసాయనము, (మాంధాతృచరిత్ర) | ... | 1 | 8 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు ... | 10 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 1 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యము కేతనకవి ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 1 | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము ... | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 1 | 0 |
| „ క్యాలికోబైండు ... | 1 | 6 |
| „ వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| „ క్యాలికోబైండు ... | 1 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| „ సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి | 1 | 8 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి ... | 2 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 6 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 4 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 2 | 8 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు ... | 3 | 0 |
| „ II „ ... | 3 | 0 |
| „ III „ ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I „ ... | 3 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము | ... | 3 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము | ... | 5 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | ... | 1 | 4 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము | ... | 3 | 8 |
| వివేకసింధు, కొండనార్యప్రణీతము | ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 8 |
| వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము | ... | 1 | 4 |
| వీరభద్రవిజయము, పోతనకృతము | ... | 1 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 1 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 1 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 1 | 8 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి | ... | 1 | 0 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 1 | 8 |
| సమీరకుమారవిజయము, నూతనముద్రితము | ... | 1 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, తాత్పర్యము | ... | 4 | 8 |
| „ అట్టబైండు | ... | 2 | 8 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయకవి (క్రొత్తకూర్పు) | ... | 1 | 0 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రగడ | ... | 4 | 8 |
| హరవిలాసము, శ్రీనాథకవి | ... | 1 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి | ... | 1 | 0 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి | ... | 3 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

# నిర్వచనోత్తరరామాయణము

## శ్రీ తిక్కనామాత్య ప్రణీతము



K. Gopal Krishna Rao M. A.
Lecturer in Telugu,
Nizam College, Hyderabad-Dn.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1941

# పీఠిక

" వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా."

శ్రియఃపతియు నఖిలచరాచరంబులం బుట్టింపఁ బెంప గిట్టింపఁ గారణం బగు సర్వేశ్వరుండు నిఖిలలోకరక్షణార్థంబు రవికులాభరణం బగుదశరథునకుం బుత్త్రరత్నంబై రామరూపంబున నవతరించి సాధుబృందంబులం గాచె.

అట్టిపురుషోత్తమునిదివ్యచారిత్రంబు యథావస్థితంబుగ నాదికవి వాల్మీకిమహర్షి సకలవేదాంతరహస్యార్థప్రతిపాదకంబును, నైహికాముష్మికసుఖప్రదంబును నపర వేదం బనాఁ బరఁగు సప్తకాండపరిమితం బైనశ్రీరామాయణం బనుమహేతిహాసం బొనర్చి లోకంబునకు మహోపకారంబు నేసె.

అందుఁ దొలుత నాఱుకాండములలో శ్రీరామునిపట్టాభిషేకంబువఱకు జరిగినకథయు, సప్తమకాండమునం బట్టాభిషేకంబునకుం దరువాతిరామనిర్యాణపర్యంత మగుకథయు వర్ణింపఁబడి యున్నది. సప్తమకాండమునకే యుత్తరకాండ మనియుం బేరు. దీనికథావైభవముంబట్టి మనభరతఖండంబునందె కాక జర్మని మున్నగుద్వీపాంతరంబుల నుండుకవీంద్రు లనేకులు నానాభాషలలో నాటకములుగను, ప్రబంధములుగను వెండియుఁ బెక్కుతెఱంగులఁ దత్తదభిరుచి కనుగుణంబుగా వ్రాసికొని యున్నారు.

ఈ చరిత్రవోలె లోకవిదితం బగుచరిత్రంబు కొంతదనుక భారతం బొండు దక్క వేఱొం డెద్దియుఁ గానరాదు. పాతివ్రత్యము, క్షాంతి, దయ, సౌశీల్యము, మున్నగుసుగుణంబులచే విలసిల్లి సకలపతివ్రతాజనతాలంకారం బై యొప్పులోకమాత సీతం బోలుసతీరత్నంబును, పౌరుషము, పితృభక్తి, జనానురాగము, క్షాంతి, కారుణ్యము మున్నగులోకోత్తరంబు లగుకల్యాణగుణంబుల కాకరం బైన శ్రీరాముం బోలుపురుషోత్తముండును మఱియొక్కరు(ం) డెచ్చట నేని లేఁ డనుట సర్వజనవిదితము.

ఇట్టిమహాపురుషచరిత్రం బనర్గళకవితావిభాసితు లగుభాస్కరతిక్కనాదులకుఁ దెలుంగుబాసఁ బ్రబంధంబుగా రచియించుభాగ్యంబు లభించుట యాంధ్రభాషాభిమాను లగునస్మదాదులపుణ్యంబ కాని వేఱు గాదు. ఈచరిత్రంబును మొట్టమొదట మంత్రిభాస్కరుం డనుమహాకవి యాంధ్రీకరించె. ఇదియ భాస్కర

రామాయణ మనుపేర నెల్లెడల మిగులం బ్రఖ్యాతి వహించి యున్నది. ఈ భాస్కరుఁడు తిక్కనామాత్యునకుం దాత యని నిర్వచనోత్తర రామాయణమునం బ్రథమాశ్వాసములోని.—

"గీ. సారకవితాభిరాముఁగుంటూరువిభుని, మంత్రిభాస్కరు మత్పితామహునిఁ బలఁచి
యైన మన్ననమెయి లోక • మాదరించు, వేఱ నాకృతిగుణములు • వేయు నేల."

అనుపద్యమునం దనకావ్యము స్వగుణంబునఁ గాకున్నను దనతాత యగు భాస్కరుని దివ్యకవితాప్రాగల్భ్యంబున నైనను లోకాదరణంబు నొందు నని చెప్పికొని యుండుటం జెల్లం బగుచున్నది. మంత్రిభాస్కరుఁడు పూర్వరామాయణము రచింప దానిం బూర్తి సేయం గడంగి కాఁబోలు తిక్కన యుత్తరకాండమును నిర్వచనముగ నాంధ్రీకరించె. దీనినే యిప్పటికి నూటయిరువది యేండ్లకు మునుపు కంకంటి పాపరాజు తద్దయు విస్తరించి రామనిర్యాణపర్యంతము గొప్పప్రబంధముగ విరచించెను. తిక్కనమాత్రము దనకావ్యము విషాదాంతముగ నుండఁగూడ దని కాఁబోలు శ్రీరామనిర్యాణమును వచింపఁ డయ్యె. భారతమునఁ గృష్ణనిర్యాణముఁ జెప్పి యున్నను నప్పటికిఁ దనయభిప్రాయము మాఱియుండ వచ్చు నని యూహింప వచ్చును. ఇఁకఁ దిక్కనచరిత్ర యించుక వర్ణింప వలసియున్నది.

## తిక్కన

నియోగిబ్రాహ్మణుఁడు, గౌతమగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, గొమ్మమాంబకు మంత్రిభాస్కరునకుఁ బౌత్త్రుఁడు, కొమ్మనకు నన్నమకుఁ బుత్త్రుఁడు, మహేశ్వరభక్తుఁడు, కేతన, మల్లన, సిద్ధన అనువార లీతనిపెదతండ్రులు, ఈవిషయము విరాటపర్వములోని.—

సీ. మజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర, మహితుండు భాస్కర • మంత్రితనయుఁ
డన్నమాంబాపతి • యనఘులు కేతన, మల్లనసిద్ధనా • మాత్యవరుల
కూరిమితమ్ముండు • గుంటూరివిభుఁడు కొమ్మనదండనాథుఁడు • మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డా • పస్తంబసూత్రపవిత్రశీలుఁడు సాంగ • వేదవేది
తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య • మతిశయిల్ల, సన్నుతీయప్రణామంబు • లాదరించి
తుష్టి దీవించి కరుణార్ద్ర • దృష్టిఁ జూచి, యెలమి నిట్లని యానతి • యిచ్చె నాకు."

అను పద్యమువలనను, నిర్వచనోత్తరరామాయణములోని—

"మ. అమలోదాత్తమనీష నే నుభయకా • వ్యప్రౌఢిఁ బాటించుశి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నా • పస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమల • ధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడఁ ది • క్కాంకుండ సన్మాన్యుఁడన్."

అనుపద్యమువలనను దెలియుచున్నది.

. . ఇఁక నీకవిజీవించియుండుకాలముం గుఱించి పలువురు పలుతెఱంగులం దలాతలి వాదంబు సేయు చున్నను నిరర్థకాంశవిచారము పిష్టపేషణమ కాఁ దలంచి హేతువాదంబునం దిగక సంగ్రహముగఁ దెలుపు చున్నాఁడ.

నిర్వచనోత్తరరామాయణమునకుం గృతిపతి యగుమనుమసిద్ధినృపాలుఁడు శాలివాహనశకము 1179-1182 (క్రీస్తుశ· 1258-1261) సంవత్సరములలో భూదానముఁ జేసినట్లు కృష్ణామండలములోనిశిలాశాసనములవలనం దెలియు చున్నందునను, ఈమనుమరాజు రాజ్యముఁ గోలుపోఁగా [1254 సంవత్సరములో అక్కన బయ్యన యనుచోళులం జయించినట్లు కృష్ణామండలములో ఇనిమళ్లగ్రామములోని శాసనము మున్నగు పెక్కుశాసనములచే క్రీ॥ 1200-1258 సంవత్సరముల నడుమ రాజ్యముచేయుచున్నట్లు తెలియుచున్న] గణపతిదేవుఁడు తిక్కనసోమయాజిప్రార్థనమువలన దండయాత్ర వెడలి వెలనాటిరాజులం జయించి నెల్లూరి కేగి మనుమసిద్ధిరాజుకు మరల రాజ్యంబు నొసంగినట్లు సోమదేవరాజీయమునం జెప్పంబడియున్నందునను, వారికి సమకాలికుఁ డగుతిక్కనసోమయాజియు శాలివాహనశకము 1127-1171 (క్రీ. 1200-1258) సంవత్సరములనడుమఁ దప్పక సశరీరుఁ డైయుండెననుట నిర్వివాదాంశము.

ఈ తిక్కనతాత యగుమంత్రిభాస్కరుంగుఱించి పెక్కుకవులు స్తుతిపద్యంబులం జెప్పి యునికి నేతద్వంశజులు రాజకార్యనిర్వాహధూర్వహు లనియ కాక యితనివంశము పండితవంశ మనియుం గూడ తేటపడుచున్నది. ఈకవికిఁ బూర్వులు మహారాజాస్థానములం గొప్పయుద్యోగము లొనర్చి జగద్విఖ్యాతిఁ గన్న మహాభాగులు. వీరినివాసస్థలము కృష్ణామండలములోని వెలటూరను గ్రామము. ఉద్యోగధర్మమున మంత్రిభాస్కరునికాలములో గుంటూరున నుండుటం జేసి గుంటూరువా రని పేరు వచ్చినదే కాని వీరియింటిపేరు కొట్టరువు వారు. ఈవిషయమును గూర్చి అభినవదండి కేతన దశకుమారచరితలో.—

"గీ. మనుమసిద్ధిమహీశసమస్తరాజ్య, భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువుకొమ్మనామాత్యుకూర్మిసుతుఁడు, సుజనతానిధానంబు తిక్కశౌరి."

అని వచించియున్నాఁడు. తిక్కనతండ్రి కొమ్మనామాత్యుఁడు గుంటూరికి దండనాథుఁడుగా నుండెను.

ఈ కొమ్మనామాత్యుఁడు నెల్లూరిలో ధర్మపత్నిం గైకొని బంధుత్వమున నెల్లూరికి రాకపోకలు జరుగు చుండ మనుమసిద్ధినృపాలపరిచితి గలిగె ననియు, దానంజేసి మనుమరాజు కీకవికుటుంబము నాదరించి నెల్లూరికిం బిలిచికొని వచ్చి

పూర్వము హరిహరనాథాలయ ముండినయిప్పటిరంగనాథ దేవాలయముదగ్గఱ
నిల్లు గట్టించి తిక్కన నందుఁ గాపురం బుంపఁగా నారాజాస్థానంబున నమాత్యుండును,
విద్వత్కవీంద్రుండును నై దిగంతవిశ్రాంతకీర్తిం గైనేసి వైదికకర్మానుష్ఠానతత్పరుం
డగుటమిఁ బినాకినీతీరంబున జన్నంబు సేసి తిక్కనసోమయాజి నాఁ బరఁగి హరి
హరనాథున కంకితంబుగా విరాటపర్వంబుఁ దొడంగి మహాభారతంబు నాంధ్రీక
రించె ననియుఁ దరువాత మనుమసిద్ధిమరణముతో నాతనివంశ మంతరింపఁ దిక్కన
సోమయాజికుమారుఁ డగుకొమ్మన నెల్లూరికి రెండుక్రోసులదూరమున నున్న
పాటూరికరణీకమును సంపాదించికొని యచ్చటనె నివసించె ననియు, నాకారణమున
నీకవివంశమువారికిఁ బాటూరువా రనుపేరు వచ్చిన దనియు, నేతద్వంశ్యులు చెప్పు
చున్నారు. ఈపాటూరువారుపాటూరిలోఁ గొందఱు నిందుకూరిపేటలోఁ గొందఱు
నున్నారు.

తిక్కనామాత్యుఁడు నిర్వచనోత్తర రామాయణమును, పంచమవేదమనాఁ
బరఁగుభారతంబును (విరాటపర్వము మొదలు 15 పర్వములు) రచియించెను.
మఱియు నీతఁ డవసానకాలమున ముద్దులమూటఁ గట్టుగృష్ణశతకమును రచియించె
నఁట. నన్నయభట్టు భారతము నారణ్యపర్వముదనుక నాంధ్రీకరించి మృతిబొం
దఁగా నారణ్యపర్వముం దెలింగించుట నాతనికి మతిభ్రమణము గలిగి కీర్తిశేషుఁ
డయ్యె నని తలఁచి దానికి శంకించి యరణ్యపర్వశేషముం బూర్తిసేయఁ దొర
కొనక తక్కుంగల పదియేనుపర్వముల రచించెనని చెప్పుదురు

తిక్కన నిర్వచనోత్తరరామాయణ మొనర్చుతఱికి యజ్ఞము సేసి యుండలే
దని యాశ్వాసాంతగద్యమువలనం దెలియుచున్నది.

ఈగ్రంథములు నెల్లూరి కధిపతి యగుమనుమసిద్ధిరాజున కంకిత మొన
ర్చెను. మనుమరాజు తిక్కనపై మిక్కుటంపుమక్కువచే మామవరుసం బిలుచు
చున్నట్లీకావ్యము ప్రథమాశ్వాసములోని—

> "క. ఏ నిన్ను మామ యనియెడి, దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
> కీనర్హుఁడ వగు దనినను, భూనాయకుపల్కు చిత్తమున కిం పగుడున్."

అనుపద్యమువలనం దెలియు చున్నది.

ఇఁక నీతనిభాషాంతరీకరణముంగుఱించి యించుక విచారింప వలసియున్నది.
పూర్వకాలమున నాంధ్రకవులు, పురాణముల నితిహాసములం దెలిఁగించుతఱిఁ
గథాసందర్భము మాత్రము మాఱకుండునట్లు కొంతదనుక బాటించుచు వచ్చిర
కాని మూలములో నుండు ప్రతిపదమునకు సరి యైన తెలుఁగుపలుకుల నిఱికింప
వలయు ననియు, మూలములో లేనివర్ణనలను గల్పనలను జేయరా దనియు,

మూలములో నున్న విషయముల నన్నింటిని వరుసగానే చెప్పవలయు ననియు సంక ల్పించినవారు కారు. దీనికిఁ గారణము తమకావ్యములు స్వతంత్రములు గా నుండ వలయు ననియుఁ గవితాధార దడవుకొనిన ట్లుండక యవిచ్ఛిన్నము గా నుండ వలయు ననియుఁ దలంచుటయ. లోకములో ఒకభాషశైలి మఱియొకభాష శైలికిఁ గొన్నియెడలం బోలియునికియుఁ బెక్కు తెఱంగులం బోలకయునికియుం గలదు. గీర్వాణంబునం గర్మణిప్రయోగ మింపు నింపును. ఆంధ్రంబున నది యంతగా రుచింపదు. మఱియు దేవభాష వంశస్థము, ఉపేంద్రవజ్ర, ఇంద్రవజ్ర ఆర్య మున్నగు వృత్తములు రచన కనుకూలములుగను విన సొంపుగ నుండును. తెలుఁగున సీసము, గీతము, చంపకమాల, మత్తేభము లోనగువృత్తములు సొగ సుగ నుండుఁగాని వసంతతిలకాదు లంత రమణీయములుగ నుండవు. కొన్ని జాతీ యము లాంధ్రంబునం గొన్ని గీర్వాణంబునను సహృదయహృదయానందంబు నొందించు. ఇట్లొక్కొకచంద మొక్కొకభాష కందంబుఁ బొందించుటం జేసి యాయాభాష కనుగుణం బగుశైలిం గబ్బంబు రచించుటయ కమనీయంబు. మహా కవు లగునన్నయ, భాస్కరుఁడు, తిక్కన, శ్రీనాథుఁడు లోనగు వా రీఘంటాపథము నకు వెలి గాకయే కావ్యనిర్మాణమునకుం గడంగిరి. అట్లుగాక మూలమునకు నన్ని విషయంబుల సరిగ భాషాంతరీకరణము సేయునిర్బంధమునకు లోగిన నట్టి భాషోచితశైలి యలవడుట దుస్సాధము. కాఁబట్టియే తిక్కనామాత్యుఁడు నిర్వచ నోత్తరకాండకథ నూఁతగాఁ గైకొని వర్ణనాదులఁ దనయిచ్చవచ్చినట్లు స్వతంత్ర ముగ రచియించె. అయినం గొన్ని యుచితస్థలముల మూలము ననుసరించియు నాంధ్రీకరించి యున్నాఁడు.

ఉత్తరకాండలోని.—

"సువర్ణపృష్ఠే స బభౌ శ్యామః పీతాంబరో హరిః,
కాంచనస్య గిరే శ్శృంగే సతటి త్తోయదో యథా."

అనుశ్లోకమును.—

"క. గరుడునిపై శార్ఙ్గధనుర్ధరుఁ డగువిష్ణుండు మేరుతటిఁబోల్చుతటి
త్పరివృతజలదముఁ బోలుట, విరియ దనుజరాజమాంసవితతి యితనికిన్."

అనియు, నిట్లె కొన్ని కొన్ని యెడలం గొంచె మించుమించుగఁ దెలిఁగించి యున్నాఁడు. కథాభాగములో సంస్కృతంబున బహుళంబుగ నున్న యెడం బ్రధాన కథాంశమును మాత్రము వివరించుచు మిగుల సంక్షేపించి శ్రీరామ నిర్యాణమును వదలి 10 యాశ్వాసముల ప్రబంధమును వ్రాసెను. సంక్షిప్త భాగంబుల సూక్ష్మదృష్టిచే గ్రంథంబునం జూచుకొనునది.

ఇక్కవిసార్వభౌమునిసరసకవితానిర్మాణకౌశల మిట్టి దని వక్కాణింప నేరి
తరము. ప్రబంధపరమేశ్వరుం డనాఁ గవిపుంగవులనడుమ వన్నె కెక్కినయెఱ్ఱా
ప్రెగ్గడ తనహరివంశములో నీతని.—

"తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదు నా నేముఖం
బునఁ దా బల్కినపల్కు లాగమము లై పొల్పొందు నావాణిక
ర్తను నీతం డొకరుండు నాఁ జనుమహాత్త్వాప్తిం గవిబ్రహ్మ నా
వినుతింతుం గవితిక్కయజ్వ నిఖిలోర్వీదేవతాభ్యర్చితున్."

అని కవిబ్రహ్మ కాఁ గొండాడియున్నాఁడు.—

నిరవధికకోమలపదమధురసరసరస్వతీవిలాసవైభవంబునను వేదమార్గప్రవర్త
కత్వంబున నితని నపరకృష్ణద్వైపాయనుం డనియే చెప్ప నొప్పును. మహాభారతంబున
నాశ్వాసాంతపద్యంబులంజూడ నితం డద్వైతమతావలంబి యనియుఁ బూర్వోత్తర
మీమాంసాశాస్త్రములయందును వ్యాకరణమునందు నసమానపాండిత్యము గల
వాఁడనియు గోచరింపకమానదు. ఇతఁడు కాళిదాసాదులవోలె సకలశాస్త్ర
మర్యాదల సమగ్రముగ నెఱింగిన పండితకవీంద్రుఁడు. ఇయ్యది భారతంబున నాయా
ఘట్టంబుల భాషాంతరీకరించుతఱి నెఱుంగనగు. ఈతనికి గీర్వాణాంధ్రంబుల నెక్కుడు
వైశారద్యంబుకలిమి నుభయకవిమిత్త్రుం డనుబిరుదము గలిగె. సోమయాజియగుటఁ
బరమాస్తికాగ్రేసరుం డనియుఁ గర్మాచరణదీక్షాదక్షుం డనియుఁ దెలియుచున్నది.
ఇక్కవినాథురచన లాంధ్రభాషాభిమానుల కాగమములు. ఈరసికు సరసంపుఁ
బలుకు లాంధ్రభాషాయోషాభూషణములు. ఈతనికృతు లాంధ్రకవిపుంగవులకుఁ
గవితామార్గప్రదర్శకములు. ఆంధ్రభాషాతత్త్వము నెఱింగినకోవిదులలో నీతఁ
డపరశబ్దశాసనుఁడు. ఇక్కవీంద్రునకు గీర్వాణభాషావైశారద్య మెక్కుడయ్యును
గవనంబునం దెలుఁగుపలుకులే తఱచుగాఁ గాన్పించును. కవనంబున జల్లిపదంబుల
నిఱికింపక కాదాచిత్కముగ ననతిదీర్ఘసమాసములం బొందుపఱచుచుఁ జిన్నచిన్న
పదములంగూర్చి యతిప్రాసములకుఁ దడవుకొనక సరళముగా హృదయరంజకముగాఁ
గవన మల్లుటయ యీకవికి నైజము. సంస్కృతంబున బాణభట్టప్రథమకృతి యగు
హర్షచరిత్రమునంబోలెఁ దిక్కనబాల్యకృతి యగునుత్తరరామాయణంబున నవి
చ్ఛిన్నకవితాధారకుఁ గొన్నియెడల సంకోచంబుగలిగినను, కాదంబరింబోలె భార
తంబున నారితేరి సర్వాలంకారశోభిత యై నవరసోపేత యై సరసగుణసమేత యై
ప్రౌఢకవితాయువతి దద్దయు సహృదయహృదయాంబుజంబుల నలరించుచున్నది.
సమయోచితింబట్టి యేరసంబు వర్ణించుతఱి నెట్టిపదములంగూర్చిన రసము గృహీతా
కృతివోలె సహృదయహృదయదర్పణంబులఁ బ్రతిబింబించునో, యట్టిమధురపదం
బులం బొందించువిషయము నిక్కవిచంద్రుఁ డెఱింగిన ట్లొరు లెఱుంగరు. సర్వతో

ముఖపాండిత్యవిభూతి గలవాఁ డగుటమి బహుళార్థంబు గలభావంబు సంగ్ర హించి యొకటి రెండుపద్యంబులలో నిముడ్చుటకును నల్పాభిప్రాయంబునకుం జిన్నెలు వన్నెలు గల్పించి విపులంబుగా రమణీయంబుగా వ్రాయుటకును నేర్చినవలంతి. వేయేల? ఎఱ్ఱాప్రెగడ, శ్రీనాథుఁడు మున్నగుమహాకవులకే యీతనికవనమున నెఱుంగఁ దగినయంశము లనేకము లున్నవనఁ దక్కుంగలకవులఁ జెప్ప నేల? ఈతని కవిత్వంబున సందర్భోచితరీతిఁ బ్రయుక్తంబు లై చక్కనిలోకోక్తులు శ్రోతలం బఱితల నానందార్ణవతలనిమగ్నాంతరంగులం జేయు చున్నవి. ఉదాహరణములు—'చెవులు వట్టి యాడించు' పు. 37 ప. 22, 'ఒడల్ సిడిమినఁ బాలు వచ్చు' పు 102 ప. 22. 'నేతికుండపై యెలుక' పు. 107. ప. 22 ఇట్లు గనుంగొనఁ దగినది.

ఈకవి తనకవిత్వంబున పాదపూరణంబుగ వ్యర్థపదములం బ్రయోగింపక (నిర్వచనోత్తరరామాయణము 1 వ పుటలోఁ) దాఁజేసిన ప్రతిజ్ఞనుఁ జెల్లించుకొనెను. ఈతనికవనంబున శబ్దచిత్రంబులు నర్థాలంకారవములు విరళంబులు. కాలిదాసాదులకుఁ బోలె నీకవికి నుత్ప్రేక్షోల్లేఖాదులకంటె నుపమారూపకస్వభావోక్తులు గడుఁ బ్రియములు.

ఉదాహరణము.—

"ఉ. చారుబలాకమాలికల • చాడ్పున దంతము లొప్ప గర్జిత
స్ఫారరవంబులట్లుగ న•భంగురతం బటుబృంహితంబు లా
సారముమాడ్కి దానజల•సంతతి గ్రమ్మఁగఁ గాలమేఘమా
లారుచిరంబు లై మద చ•లద్ద్విపసంఘము లొప్పు నప్పురిన్." 1 ఆ. 53 ప.

"సీ. అనవద్యవేదవి•ద్యాలతావితతికి, నాలవాలములు జి•హ్వాంచలములు......" 1 ఆ. 57 ప.

"సీ. పడఁతుల నెఱివీఁగుఁ•బాలిండ్లు వెడదోఁప, లీలఁ బయ్యెదలు దూ•లించుటకును..." 1 ఆ. 59 ప.

శబ్దాలంకారంబులలో నీకవికిఁ బ్రియమైనది రెండురెండు గాని మూఁడు మూఁడుగాని పద్యములో నన్నియుఁగాని సమాసములయం దంత్యాక్షరవ్యావృత్తి నియమము. ఉదా.—

"మ. అతులౌదార్యుఁ డహీనశౌర్యుఁడు సము•ద్యద్ధైర్యుఁ డత్యంతవి
శ్రుతచారిత్రుఁడు సూరిమిత్రుఁడు జన•స్తోత్రవ్యగోత్రుండు సం
భృతసత్కీర్తి పవిత్రమూర్తి యసుహృ•ద్వృందార్తినిర్వర్తి పూ
జితధీమంతుఁడు పుణ్యవంతుఁడు జయ•శ్రీకాంతుఁ డిమ్మేదినిన్."

"చ. నిరుపమమూర్తి వైరిరథి•నీసమవర్తి వివేకవైభవ
స్ఫురితవిచారుఁ డుజ్జ్వలయ•శోమణిహారుఁడు ధర్మసంగ్రహా
దరపరతంత్రుఁ డార్యజన•తామతమంత్రుఁడు వంశవారిజా
కరనవసూర్యుఁ డస్ఖలిత•గౌరవవర్తనధుర్యుఁ డిమ్మహిన్." 3 ఆ. 119 ప.

"మ. కమలాధారుఁడు భీతిదూరుఁ డసమా ♦ కారుండు గంభీరుఁ డ
బ్జముఖీమారుఁ డపారసారుఁడు కళా ♦ స్ఫారుండు వీరుండు దు
ర్దమదోస్సారుఁ డధర్మభీరుఁడు మహో ♦ దారుండు దుర్వారుఁ డ
త్యమలాచారుఁడు నిర్వికారుఁడు యశో ♦ హారుండు ధీరుం డిలన్." 1 ఆ. 86 ప.

ఇట్టివి సూక్ష్మదృష్టిఁ గనుఁగొనినచో నీతనికృతులం బెక్కులు గన్పట్టును. అయినను గథాసందర్భమున దీనిని పరమార్థ మని తలంచి రసభావాదులం దిగనాడి క్లిష్టార్థకల్పనైకకారణంబు లగుచిత్రబంధయమకాదులకొఱకుఁ గష్టపడక యాశ్వాసాంతమున మాత్రమీ వ్యావృత్తినియమమును గైకొనినాఁడు. ఇట్టి లక్షణములు విశేషముగ నాంధ్రపంచమవేదంబునఁ జూపట్టును.

ఈకావ్య మీతని ప్రథమకవిత యగుటంజేసి దీనియందు భారతమందలి కవితాప్రౌఢిమ యంత గాఁ గానరా కున్నను మొత్తముమీఁద భారతశైలిం బోలియే యున్నది. కాఁబట్టియే యిందలిపద్యంబులయందుఁ దిక్కన కత్యంతగౌరవ ముండి యుండెను. దీనికిఁ దనభారతంబున నిందలికొన్నిపద్యంబులఁ గొంతవఱకు మార్చియు మార్పకయుఁ బొందుపఱిచి యుండుటయే ప్రమాణము.

విస్తరభీతిచే వాని నిట నుదాహరింపక విరమించితి. ఇక్కవీంద్రుఁడు నన్నయభట్టసంప్రదాయానుసారముగఁ గావ్యాదిని సంస్కృతశ్లోకరూపంబుగనే మంగళాచరణం బొనర్చెను. షష్ఠ్యంతముల మానెను. దీనింబట్టి యేతద్వైకల్పికత్వంబు గవి కిష్ట మని తోఁచుచున్నది. ఈకవివల్లభుంగుఱించి వ్రాయఁదగునంశము లనేకము లున్నను, విస్తరభయంబునను ముఖ్యముగా నవి భారతమునకు సంబంధించిన వగుటను విరమించుచు స్థాలీపులాకన్యాయంబుగ రెండుపద్యముల నిట నుదాహరించుచున్నాఁడ.

"మ. కుచముల్ వాఁడెడినీటిమీఁదివిలస ♦ త్కోకంబులం గ్రేణి సే
యుచు నుండన్ మెడ యెత్తి పాదయుగళం ♦ బూఁదంగ బాహాలతల్
పచరింపం గరమూలకాంతి నిగుడన్ ♦ భావంబు రంజిల్లఁ బొ
డుచుఁ గ్రీడించిరి పువ్వుఁబోఁడులు లతా ♦ డోలాకళాప్రౌఢులన్." 8 ఆ. 37 ప.

"శా. ఏమేమీ రఘురాముతమ్ముఁడవె మీ ♦ రేపారి పైనెత్తి మా
మామం బంక్తిముఖున్ వధించినను మీ ♦ మార్గ్యంబు సైరించి యే
నేమిం జేయక యున్నఁ గ్రొవ్వి యిట నీ ♦ వేతెంచితే మేలు మే
లీమై తోడన పోదు గాక యని దై ♦ త్యేశుండు దర్పంబునన్." 10 ఆ. 17 ప.

ఇట్లు సరసగుణమణిగణభూషణభూషితకవితావనితామణి మధురశృంగారవిలసితంబుల రసికవరేణ్యు లనురక్తి ననుభవించి యానందాంబునిధితరంగత్తరంగంబుల డోలాకర్మ నాచరింతురుగావుత మని ప్రార్థించుచున్నాఁడ.

ఉత్పల - వేంకటనరసింహాచార్యులు.

## ప్రథమాశ్వాసము.

విషయము. | పుట.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.

## పంచమాశ్వాసము.



## షష్ఠాశ్వాసము.

విషయము. | పుట.



## సప్తమాశ్వాసము.



## అష్టమాశ్వాసము.

విషయము. | పుట.

నవమాశ్వాసము.



దశమాశ్వాసము.

శ్రీరస్తు.

# నిర్వచనోత్తరరామాయణము

## ప్రథమాశ్వాసము.



రాస్తాం మనుమక్షితీశ్వరభుజా। స్తమ్భే జగన్మణ్డల
ప్రాసాదస్థిరభారభాజి దధతీ। సా సాలభఞ్జీశ్రియం
శుణ్డాలోత్తమగణ్డభిత్తిషు మద। వ్యాసజ్జవశ్యాత్మనాం
యాముత్తేజయతే తరాం మధులిహా। మానన్దసాన్ద్రీ స్థితిః. 1

### కృతిప్రశంస.

చ. హరిహరపద్మగర్భులను। నాదికవీంద్రుల నూత్నసత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి తగ। వారికృపం గవితావిలాసవి
స్తరమహనీయుఁ డైననను। సర్వగుణోత్తరమూర్తి మన్మభూ
వరుఁడు దగంగ రాఁ బనిచి। వారనిమన్నన నాదరించుచున్. 2

క. ఏ నిన్ను మామ యనియెడు, దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీ నప్పుఁడ వగు దనినను, భూనాయకుపల్కు చిత్తమున కింపగుడున్. 3

సీ. సకలలోకప్రదీపకుఁ డగుపద్మినీమిత్రవంశమున జన్మించె ననియుఁ
జూచిన మగ లైనఁ। జొక్కెడునట్టిసౌందర్యసంపదసొంపు। దాల్చె ననియు
జనహృదయానంద। జనక మై నెగడిన చతురతకల్మి నప్రతిముఁ డనియు
మెఱసి యొండొంటికి। మిగులు శౌర్యత్యాగవిఖ్యాతకీర్తుల। వెలసె ననియు
తే. వివిధవిద్యాపరిశ్రమ। వేది యనియు
సరసబహుమానవిరచనా। శాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న। మనుమనృపతి
సుభగుఁ గావించుటకు సముత్సుకుఁడ నైతి. 4

### కృతికర్తృనియమము.

ఉ. భూరివివేకచిత్తులకుఁ। బోలు ననం దలఁపన్ దళంబులన్
సౌరభ మిచ్చుగంధవహు। చందమునం బ్రకటంబుచేసి యిం

పారెడుపల్కులం బడయ । నప్పలుకుల్సరి గ్రుచ్చునట్లుగాఁ
జేసప నేరఁగా వలయుఁ । జేసెద నేఁ గృతి యన్నవారికిన్. 5

చ. పలుకులపొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాఁతవడ్డమా
టలఁ దమనేర్పు చూపి యొకకొంటఁ హృదయం బలరింపలేక యే
పొలమును గానియట్టి క్రమమున్ దమమెచ్చుగ లోక మెల్ల న
వ్వులఁ బొరయం జరించుకుకవుల్ ధరదుర్విటులట్ల చూడఁగాన్. 6

క. తెలుఁగుకవిత్వము చెప్పం, దలఁచినకవి యర్థమునకుఁ । దగియుండెడుమా
టలు గొని వళులుం బ్రాసం,బులు నిలుపక యొగిని బులిమి । పుచ్చుట చదురే. 7

క. అలవడ సంస్కృతశబ్దము, తెలుఁగుబడి విశేషణంబు । తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం,బులు భేదింపమికి మెచ్చు । బుధజనము కృతిన్. 8

తే. ఎట్టికవికైనఁ దనకృతి । యింపుఁ బెంపఁ, జాలుఁగావునఁ గావ్యంబు । సరసులైన
కవులచెవులకు నెక్కినఁ । గాని నమ్మఁ, డెందుఁ బరిణతి గలుగుకవీశ్వరుండు. 9

క. అని సత్కవీంద్రమార్గము, మనమున నెలకొల్పి సరస । మధురవచోగుం
భనసుప్రసాదసంబో,ధనగోచరబహువిధార్థ । తాత్పర్యముగాన్. 10

క. ఎత్తఱి నైనను ధీరో,దాత్తనృపోత్తముఁడు రామ । ధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మగుట, నుత్తరరామాయణోక్తి । యుక్తుఁడ నైతిన్.10

తే. సారకవితాభిరాముగుంటూరివిభుని, మంత్రిభాస్కరుమత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయిఁ లోక । మాదరించు, వేఱ నాకృతిగుణములు । వేయునేల.

మ. అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించుశి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్. 13

ఉ. జాత్యము గామి నొప్పయిన । సంస్కృత మెయ్యెడఁ జొన్ప వాక్యసాం
గత్యము సేయుచో నయిన । గద్యము తోడుగఁ జెప్పి పెట్ట దా
ర్గత్యము దోఁపఁ బ్రాసముప్రకారము వే ఱగునక్షరంబులన్
శ్రుత్యనురూప మంచు నిడ । సూరుల కివ్విధ మింపుఁ బెంపదే. 14

క. వచనము లేకయు వర్ణన, రచియింపఁగఁ గొంత వచ్చుఁ । బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం,దుచితంబుగఁ జెప్పు టారయ్య । లొప్పిద మనరే.

క. లలితపదహృద్యపద్యం,బులన కథార్థంబు ఘటిత । పూర్వాపర మై
యలఁతియలంతితునియలుగ, హాల సంధించినవిధంబు । నమరఁగ వలయున్. 16

### కృతినాయకవంశావతారము.

క. ఈకృతికిఁ దొడవుగా నమ్మ,రాకృతి యగుమనుమనరవరాగ్రేసరుస
త్యాకృతివంశము గాథ, స్వీకృతి దగఁ గీర్తనంబు । సేయుదు నెలమిన్. 17

ఉ. అంబుజనాభునాభి నుదయం బయి వేధ మరీచిఁ గాంచె లో
కంబుల కెల్లఁ బూజ్యుఁ డగుకశ్యపుఁ డాతనికిన్ జనించె వి
శ్వంబు వెలుంగఁ జేయఁగ దివాకరుఁ డమ్ముని కుద్భవించె వా
నిం బొగడం జతుశ్శ్రుతులు । నేరక యున్నవి నాకు శక్యమే. 18

క. ఆతనికి సకలలోక, ఖ్యాతుఁడు మను వుద్భవించి । యనవద్యమతిం
జాతుర్వర్ణ్యస్థితిర,క్షాతత్పరవృత్తిఁ బరఁగె । సర్వోత్తరుఁ డై. 19

శా. లోకాలోకతటీవిహారకలనాలోలద్యశస్సింహుఁ డ
స్తోకాపాదితపుణ్యమూర్తి మనుపుత్త్రుం డాక్రమక్రీడ మై
నేకచ్ఛత్రము గాఁగ భూమివలయం । బెల్లం బ్రశాసించె ని
క్ష్వాకుం డప్రతిమానదానమహిమా । కల్పోజ్జ్వలాకారుఁ డై. 20

క. ఆయిక్ష్వాకుకులంబున, సాయంతనసప్తజిహ్వ । సాదృశ్యశ్రీ
స్థాయత్ప్రతాపనిధి నా,రాయణనిభపుణ్యమూర్తి । రఘు వుదయించెన్. 21

మ. రఘువిద్యాప్రియుఁ డై దివౌకసుల సమ్మానించుఁ బ్రత్యర్థిబా
హుఘనాటోపము మాన్చు దిగ్విజయలీలోత్సాహి యై సజ్జనా
లఘుకార్యంబులఁ దీర్చు వైదికవిధి । శ్లాఘాదరస్వాంతుఁ డై
రఘుభూపాలకుఁ జెప్ప నొప్పదె జగత్త్రాణప్రవీణాత్మకున్. 22

క. ఆరఘువంశంబున వి,స్తారయశోధనుఁడు విమలచరితుఁడు బుధని
స్తారకుఁడు భూమిపాలన, సారనిపుణబుద్ధి రామ । జనపతి వుట్టెన్. 23

మ. మునిలోకంబు ప్రశంస సేయ జగముల్ । మోదంబు నొందంగ దు
ర్జనతానిగ్రహతత్పరాత్ముఁ డగుచున్ । సద్వృత్తిసంరక్షణం
బున రాగిల్లుచు నేలె రామనృపుఁ డీ । భూచక్రముం దత్కులం
బున రాజన్యు లనేకు లిద్ధరణిఁ బెంపుం బొంది పాలించినన్. 24

క. పిదపఁ గలికాలచోళుం, డుదయంబై జలధిపరివృతోర్వీవలయం
బు దనకు బంటుపాలమ్ముగ, నెదు రెందును లేక పేర్మి । యొసకం బెసఁగన్. 25

శా. చేసేతం బృథివీశు లందుకొనఁ గాశీసింధుతోయంబులం
జేసెన్ మజ్జన ముంగుటంబున హరించెం బల్లవోర్వీశు ను
ల్లాసం బొందఁగ ఫాలలోచనము లీలం గట్టెఁ గావేరి హే
లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కలికాలక్ష్మావిభుం డల్పుఁడే. 26

చ. అతనికులంబునం దవనతారి యుగాంతకృతాంతమూర్తి య
ప్రతిమవదాన్యతావిభవ । భాసి విలాసరతీశుఁ డప్రత
ర్కితవివిధావధానపరికీర్తితనిర్మలవర్తనుండు సం
శ్రితనిధి వుట్టె బిజ్జన యశేషధరిత్రియు నుల్లసిల్లఁగన్. 27

చ. పరుషపరాక్రముం డగుచుఁ బల్లవవీట నుదగ్రులైనప
న్నిరువుర నాతనిం గలయ నెన్ని యనర్గళమత్సరంబుమై
మురరిపుసన్నిభుండు పదుమువ్వుర గం డడఁగంగఁ బెట్టి దా
బిరుదు వెలుంగ బిజ్జఁ డరి భీకరభూరిభుజాబలంబునన్. 28

క. తద్వంశంబునఁ బోషిత, విద్వజ్జనుఁ డహితభుజగ విహగేంద్రుఁడు ధ
ర్మాద్వైతమూర్తి వరయోషిద్వర్గస్మరుఁడు మన్మసిద్ధి జనించెన్. 29

సీ. భూరిప్రతాపంబు వైరిమదాంధకారమున కఖండదీపముగఁ జేసి
చరితంబు నిఖలభూజననిత్యశోభనలతకును నాలవాలముగఁ జేసి
కరుణ దీనానాథ కవిబంధుజనచకోరములకుఁ జంద్రాతపముగఁ జేసి
కీర్తిజాలముఁ ద్రిలోకీశారికకు నభిరామరాజితపంజరముగఁ జేసి
ఆ. సుందరీజనంబు డెందంబునకుఁ దన, నిరుపమాన మైన నేర్పుకలిమి
నతిప్రసిద్ధి చేసి యసదృశలీల మైఁ, బరఁగె మనుమసిద్ధి ధరణివిభుఁడు. 30

క. ఆమన్మసిద్ధిసుతుఁ డాశామండలశాసనుండు సదయాకృతి సం
గ్రామశ్రీరాముఁడు రామామదనుఁడు తిక్కనృపతి మహిఁ బాలించెన్. 31

ఉ. కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోళతిక్కధా
త్రీశుఁడు కేవలుండె నృపు లెవ్వరి కాచరితంబు గల్గునే
శైశవలీలనాఁడు పటుశౌర్యధురంధరబాహుఁ డైనపృ
థ్వీశనరేంద్రుమస్తకము నేర్తెఱఁ గందుకకేళి సల్పఁడే. 32

సీ. లకుమయ గురుములూరికి నెత్తి వచ్చినఁ గొనఁడె యాహవమునఘోటకముల
దర్పదుర్జయు లగుదాయాదనృపతుల ననిలోనఁ బఱపఁడే యాగ్రహమున
శంభురాజాదిప్రశస్తారిమండలికముఁ జెర్చి యేలఁడె కంచిపురముఁ
జేకిమండలము గాసిగఁ జేసి కాళవపతి నియ్యకొలుపఁడే పలచమునకు
తే. రాయగండగోపాలు నరాతిభయద, రాయపెండారబిరుదాభిరాము నుభయ
రాయగండాంకు ఖండియరాయఁ దిక్క, ధరణివిభుఁ బోల రాజులకరిది కాదె.

మ. కమలాప్తప్రతిమానమూర్తి యగునా కర్ణాటసోమేశు దు
ర్దమదోర్గర్వము రూపుమాపి నిజదర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిఁ జోళుని భూమిపై నిలిపి చోళస్థాపనాచార్యనా
మము దక్కం గొని తిక్కభూవిభుఁడు సామర్థ్యంబు చెల్లింపఁడే. 34

సీ. భృత్యానురాగంబు పెంపుఁ జెప్పఁగ నేల పరివారసన్నాహ బిరుదు గలుగ
వందిప్రియత్వంబు వర్ణింపఁ గా నేల పాఠకపుత్రాఖ్య పరఁగు చుండ
సకలవిద్యాపరిశ్రమముఁ దెల్పఁగ నేల కవిసార్వభౌమాంక మవనిఁ జెల్ల
సుభగతామహిమఁ బ్రస్తుతి సేయఁగా నేల మన్మథనామంబు మహిమ నెగడ
తే. నుభయబలవీరుఁ డనుపేరు త్రిభువనములఁ

ప్రచురముగ ఘోరబహుసంగరముల విజయ
లక్ష్మిఁ జేకొను బాహుబలంబుసొంపు
పొగడ నేటికిఁ గలికాల భూవిభునకు. 35

క. అతనికి నుదయించెను గ,ల్పతరువునకుఁ బుట్టు రుచిర ఫల మన మనుమ
క్షితిపతి కవిహృదయశుక, ప్రతతిసమాస్వాదనీయ రసికత వెలయన్. 36

ఉ. అర్థిజనంబు లోభినృపులాసలు చూపినఁ బడ్డజాలి ప్ర
త్యర్థులు వైరిరాజులమరం బడఁగించుటఁ గన్న పెంపు నా
నార్థము లర్థి కిచ్చియు రణావని దోలియుఁ బాపు కామినీ
ప్రార్థితమూర్తి మన్మజనపాలుఁడు కేవలుఁడే తలంపఁగన్. 37

సీ. అడవులఁ గొండలఁ బడి యాలుబిడ్డప ట్టెలుఁగని వైరిధాత్రీశులందుఁ
గట్టంగఁ దొడఁ బూయఁ బెట్టఁ గొఱంత లే కానంద మందెదు నర్థులందుఁ
గని విని యించువిల్తునియలరమ్ముల బారికి నగపడ్డ భామలందుఁ
దమతమలో నద్భుతం బంది కొనియాడు నిఖిలకళాగమ నిపుణులందుఁ
తే. గానఁగావచ్చు వేఱ పొగడ్త లాస,పడక తనయంత జగములఁ బరఁగుచుండు
దినకరాన్వయతిలకంబు మనుమనృపతి, వీర్యవితరణరూపవివేకమహిమ. 38

మ. ద్రవిడోర్వీపతిగర్వముం దునిమి శౌర్యం బొప్పఁ గర్ణాటద
ర్పవిఘాతంబు నొనర్చి వైరిమనుజేంద్రశ్రేణికిన్ గొంగ నా
నవనిం బేర్కొని యున్న యట్టివిజయలక్ష్మాధీశ్వరుం గాసిగా
నెవిచెం జోళనమన్మసిద్ధి యనిప్రాయేటం బ్రగాఢోద్ధతిన్. 39

సీ. దండప్రణామంబు దగ నభ్యసించిరో నెఱిబోరగిలఁబడ నేర్చునాఁడ
వ్రేళ్లులు గఱవంగ వెర వల్వరించిరో నోరఁ జేతులు గ్రుక్కి నొల్లునాఁడ
కడుసంకటంపుఁ బేరడవులు దూఱంగఁ దరము నేసిరో యిలఁ దడవునాఁడ
పలుదెస విఱిగిపోఁ బరువు సాధించిరో క్రీడలుగాఁ బాఱి యాడునాఁడ
తే. బాలశిశులు గా కొండు భంగి నింత, యచ్చుపడియుండు నే వీరి కనఁగ నిన్ని
తెఱఁగులకు నేర్పు గలిగివర్తింతు రాజి,మనుమనృపుఁ దాఁకిపోయిన మనుజపతులు.

ఉ. రంగదుదారకీర్తి యగురక్కసగంగనఁ బెంజలంబుమై
భంగ మొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాఁచికొన్న రా
జ్యాంగము లెల్ల నిచ్చి తన యాశ్రితవత్సలవృత్తి యేర్పడన్
గంగయసాహిణిం బదము గైకొనఁ బంచెఁ బరాక్రమోన్నతిన్. 41

సీ. కొండలు నఱకునా ఖండలు కైవడి యొనయు నేనుంగులఁ దునుమునపుడు
బెబ్బులి వడి లేళ్లఁ బెండు హత్తినయొప్పు గలుగు రాహుతులకుఁ గడఁగునప్పు
డడవులఁ గార్చిచ్చు లడరుచందముగాన నగుఁ గాలుబలమున కలుగునపుడు
బలుగాలి మొగుళులపై వీచుక్రియ దోఁచుఁ దఱుచైన గొడుగులుఁ దఱుకునపుడు

తే. కసిమసంగినమృత్యువు ఽ కరణి యంత, కాలరుద్రునికైవడి ఽ కాలదండ
ధరునిబలువిడి యలవడు ఽ దరములోన,నసమశౌర్యుఁడుమనుమథఽరాధిపునకు.

శా. శృంగారంబు నలంగ దేమియును బ్రఽస్వేదాంకురశ్రేణి లే
దంగంబుల్ మెఱుఁ గేద వించుకయు మాఽహారాష్ట్రసామంతు సా
రంగుం దోలి తురంగముం గొనినసంఽగ్రామంబునం దృప్తస
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపం ఽ పై చన్న సైన్యంబునన్. 43

సీ. అనుపమబహురత్నఽహయవారణముల విద్విషులు గప్పములు పుఽత్తెంచుచోట
నెల్లికయ్యం బని ఽ యెద్ది యేనియు నొక్క కెలన శాత్రవదూతఽపలుకుచోటఁ
దలతలమని రెండు ఽ దడములవారేటు న కమానముగఁ జేర ఽ నడచుచోటఁ
బరసేన సచ్చియుంఽబాఱియు బయ లైన యనిలోన జయము నేఽకొనెడుచోట
ఆ. నొక్కరూప కాని ఽ యెక్కుడు డిగ్గును, గానరాదు ముఖవిఽకాసమునకు
నన్యరాజు లీడె ఽ యరిరాయవేశ్యాభు,జంగుఁ డైనమనుమ ఽ జనవిభునకు. 44

అయోధ్యావర్ణనము.

క. అమ్మనుమన్నృపతి కభ్యుద,యమ్ముగ నేఁ జెప్పఁ బూని ఽ నట్టి కథకు నా
ద్యమ్మయి యయోధ్య యనునా,మమ్మున నెగడినపురోత్తఽమము వర్ణింతున్

సీ. అఖిలభోగములకు ఽ నాస్పదం బగుట భోగీంద్రపట్టణమున ఽ కీడ యనియు
ధనసమృద్ధుల కెల్లఁ ఽ దల్లియి ల్లగుటఁ గుబేరునివీటికిఁ ఽ బెద్ద యనియు
వైభవంబులకు నా ఽ వాస మగుట నమరాధీశుపురమున ఽ కధిక మనియు
నిర్మలవృత్తికి ఽ నెర వగుటను భారతీశ్వరుప్రోలికి ఽ నెక్కు డనియు
ఆ. వినుతి సేయఁ జాలి ఽ వివిదోత్సవంబుల, నతిశయిల్లి సజ్జఽనాభిరామ
మై కరంబు వొలుచు ఽ నన్నగరంబు వి,స్ఫురితసకలవస్తు ఽ పూర్ణ మగుచు. 46

క. చనిచని యచ్చోటను జి,క్కనొకో తారకము లనఁ బ్రఽకీర్ణరుచులఁ ద
ద్ఘనవప్రప్రాగ్భాగం,బున ఖచితము లైనవజ్రఽములు చెలు వొందున్. 47

తే. ఇంతపొడ వని వాక్రువ్వ ఽ నేరి కైన, రా దనుట కోటవర్ణన ఽ గాదు నిజమ
యెగసి పఱపిన దృష్టులు ఽ నిగుడునంత, లెక్కలో నగ్రభాగంబు ఽ లేమిఁ జేసి.

క. మహనీయవప్రగోపుర, బహురత్నోత్కీర్ణసాల ఽ భంజిక లొప్పున్
విహరణతత్పరనిర్జర, మహిళాతతి వచ్చి యున్నఽమాడ్కి బెడం గై. 49

సీ. అవగాహనమునకు ఽ నరిగినగజములమదములు కూడిన ఽ నదులు గాఁగ
ఝషకకుళీరకఽచ్ఛపమకరాదిసత్త్వములమొత్తము పర్వఽతములు గాఁగఁ
బ్రాకారమణిగణప్రతిబింబనికరంబు విలసిల్లుబహురత్నఽవితతి గాఁగ
రంగత్తరంగపరంపరపైఁ దేలు, కలహంసములు శంఖఽకులము గాఁగఁ
ఆ. గరము పొలుపు మిగులుఁ ఽ బరిఖ విశాలగం,భీర మగుచుఁ బఱపుఁఽబేర్మిఁ జేసి
యఖిలభూమిచక్ర ఽ మనుతలంపునఁ బుర,వరముఁ జుట్టి యున్న ఽ శరధివోలె.

చ. తరుణులపోఁగుఁజన్నుఁగవ తాఁకున నున్మదచక్రవాకబం
ధురగతి లీలఁ గామినుల తోరపుటూరులఘట్టనంబునం
గరివరహస్తకాండపటుఘాతమునం బరిఖాతరంగముల్
దిరుగుడుపడ్డతీరములఁ దెట్టువగట్టు సరోజరేణువుల్. 51

సీ. ఉజ్జ్వలలక్ష్మికి నుద్భవస్థాన మై భువనసుందర మగు పొలుపు దాల్చి
యనుపమానంతభోగాస్పదం బనఁ జాలి హరినీలకాంతివిస్ఫురణ నొంది
సాంద్రచంద్రద్యుతిసమితి శోభిల్లి సుధాబహుల ప్రబోధమును గలిగి
బహుచిత్రసత్వసంపన్నత మెఱసి తుంగాచలాతిస్థితి నతిశయిల్లి
తే. యక్కజం బగుపెంపున నతుల మగుచుఁ
జూడ్కులకు వేడ్క సేయుచు సొంపు మిగిలి
తమకు రత్నాకరంబుచందము నెఱయఁగ
నప్పురంబున రమణించె హర్మ్యచయము. 52

ఉ. చారుబలాకమాలికల చాడ్పున దంతము లొప్ప గర్జిత
స్ఫారరవంబులట్లుగ నభంగురతం బటుబృంహితంబు లా
సారముమాడ్కి దానజలసంతతి గ్రమ్మఁగఁ గాలమేఘమా
లారుచిరంబు లైమద చోలద్విపసంఘము లొప్పు నప్పురిన్. 53

తే. మనముశిల్పియొ తనదువిన్ననువు మెఱసి
గాలి నశ్వరూపంబులు గాఁ దరించెఁ
గాక యీజవసత్త్వముల్ గలవె ఘోట
కముల కెందు నాఁ బురిఁ దురంగములు వొలుచు. 54

సీ. మవ్వంపుమేనుల జవ్వనంబుల కింపుమిగిలినచెయ్వుల మెఱుఁగు వెట్ట
నల్లనమధురంపు సల్లాపరచనకు లేఁతనవ్వున నునుఁబూఁత పూయ
నిడువాలుఁ గనుదోయి నిసుపారు కాంతికిఁ గలికిక్రేఁగన్నుల నలువుమిగుల
లలితంబు లగుచిత్తములచతురతలకు సరసంపునడవడిఁ దెరలుపుచ్చ
తే. వెరవు గల్గి మనోభవు వీరరసము, నిరతముగ నేర్పు వాటించి కరువు గట్టి
పోసి చేసినరూపులపోల్కి వార, వనిత లొప్పుదు రప్పురవరమునందు. 55

చ. విలుచునెడన్ మనంబులకు వెక్కస మంద ధనంబు లమ్ముచో
విలసదనేకవస్తువులు విస్మయ మందఁగఁ జూడ్కు లెల్ల సొం
పులసహజంబు లై యెలమిఁ బొందఁగ నుజ్జ్వల లక్ష్మి యొప్పుఁ ద
మ్ములవడఁ జెంద వైశ్యజను లప్పురి నొప్పుదు రప్రమేయు లై. 56

సీ. అనవద్యవేదవిద్యాలతావితతికి నాలవాలములు జిహ్వాంచలములు
రాజితబహుకళారాజహంసికలకు మానససరసులు మానసములు
చారుసత్యవ్రతసౌరభ్యలక్ష్మికి నుచితవాక్యములు పుష్పోద్గమములు

సాదరకారుణ్య । మేదురజ్యోత్స్నకు మధురాకృతులు శశిమండలములు
తే. గా సమస్తమహాధ్వర।కర్తృతావిభూతిఁ దనరి యఖిలలోక।పూజ్యు లగుచు
నిరుపమానసద్గుణగణ । నీతినిరతు, లై ధరామరు లొప్పుదు । రప్పురమున. 57

చ. అమరనగంబు నెచ్చెలులొ । హైమవతీశునసుంగుఁగొండవి
య్యము లొకొ రోహణాచలము । నన్నలుఁ దమ్ములు నొక్కొ నా సువ
ర్ణమునను జారుతారమున । రత్నచయంబునఁ దేజరిల్లు నం
దు మహిమ కున్కిపట్టగుచుఁ । దుంగసముజ్జ్వలదేవసద్మముల్. 58

సీ. పడఁతులనెఱివేఁగుఁ।బాలిండ్లు వెడదోఁప లీలఁ బయ్యెదలు దూ।లించుటకును
దెఱవలపూఁతలు । మెఱయఁగ నాటమై నడరిననునుఁ జెమ।టార్చుటకును
మెలఁతలచెక్కుల । మెఱుఁగు వింతఁగ నవతంసమంజరులు గ।దల్చుటకును
గొమ్మలయలికదే।శమ్ములఁ గ్రొత్తచె న్నొలయఁ గుంతలములఁ।దెలచుటకును
తే. విటకుమారులు తనరాక।వేచివేడ్క, నెదురుకొనియింపుసొంపువ।హించుచుండ
నడపు మెలపునజనుల కానంద మొదవ, గంధవహుఁడప్పురంబునఁ।గలయఁబొలయు.

చ. శుకపికసంకులత్వమున । సుందరసాంద్రలతాంతపల్లవ
ప్రకరబహుచ్ఛవిం బురవ।రంబువిహారవనంబు లొప్పు న
మ్మకరపతాకుసైన్యములు । మానవతీవిటకోటి కైనకే
లికలహవృత్తి సైఁపక సలీలగతిన్ బయినెత్తి వచ్చె నాన్. 60

సీ. మన్మథునాస్థాన।మండపంబులు మీనకేతునేపథ్య।నికేతనములు
రతివల్లభునివిహా।రప్రదేశములు సంకల్పసంభవునిభో।గస్థలములు
కందర్పునాయుధా।గారముల్ కుసుమశరాసనుసంగీత।శాలయములు
శంబరసూదను।జయభూము లింపి రానందనుసంకేత।మందిరములు
ఆ. రామణీయకంబు । రమియించునిక్కలు, సొంపుగనులు చైత్ర।సంపదలకు
ననుగలంపుటిరవు । లనఁగ రమ్యంబు లై, యొప్పు నుపవనంబు।లప్పురమున. 61

చ. వివిధగతిప్రకారముల । వీథులఁ బొలుసమీరణంబుచే
నవమకరందబిందుతతి । నల్గడలం దగ నింపుగూడి య
త్యవిరళలీలఁ బర్వ మధు।పావళి పుష్పలు రోయ కెందు నా
డ వనములోన విచ్చలవిడిన్ మదలీల వహించు నెప్పుడున్. 62

సీ. పద్మినీకల్లోల । పంక్తులపైఁ గ్రాలు రాజితరాజమ।రాళలీల
సహకారపల్లవ । సమితిఁ గదల్చు నున్మదకలకంఠకు । మారుమాడ్కిఁ
బుష్పితనవలతా।పుంజంబులోపల విహరించుమత్తాళి।విభునిభంగి
నుద్యానమునకు వేఱొకయొప్పుగావించుచారునవీనవ।సంతుభాతి
తే. నేను గలుగంగ మదనుని।కేల యొండు, పరికరము లని యన్నింటి।పనులఁ దాన
పూని చేయువిధమున మంద।దానిలుండు, పురమునందుండునుపవన।భూములందు,

క. ఆపురి కధిపతి రఘుకుల, దీపకుఁ డమరేంద్రవిభుఁడు తేజోనిధి వి
ద్యాపారగుండు దశరథ, భూపాలుఁడు సకలలోకపూజితుఁ డగుచున్. 64

సీ. అష్టదిగ్గజశోభితావనీచక్రంబు దమ్మి యై తనలక్ష్మి కిమ్ము గాఁగ
వివిధవర్ణాశ్రమవిహితవృత్తికిఁ దన యసదృశపరిరక్ష ముసుఁగు గాఁగఁ
బొలుచుచతుర్దశభువనముల్ దనకీర్తి యాడెడునెలవుల మేడ గాఁగ
నమ్మూఁడుమూర్తుల యలవు లెన్నఁగఁ బుట్టి ప్రేలెడితనమూర్తి వాలుగాఁగఁ
తే. దనకృపాణంబు రిపుల సద్గతికిఁ బుచ్చు, పుణ్యతీర్థంబు గాఁ దనభూరిదాన
మర్థులకు భూరివాన గా నతిశయిల్లి, జలధివలయితవసుమతీచక్ర మేలె. 65

ఉ. అత్తఱి లోకభీకరదురాచరణుం డగుపంక్తికంఠును
ద్వృత్తి నలంగునిర్జరుల విన్నపముల్ దయ నాదరించి దే
వోత్తముఁ డైనవిష్ణుఁడు సముత్సుకుఁ డయ్యె విశుద్ధవిశ్రుతో
దాత్తచరిత్రుఁ డౌదశరథక్షితినాథున కుద్భవింపఁగన్. 66

క. తనయులఁ బడయుకుతూహల,మున నిట నమ్మనుజపతియు మునికులవంద్యుం
డనఁ జాలుఋశ్యశృంగుని, యనుమతమునఁ బుత్రకామయజనము చేసెన్. 67

సీ. ఆసుకృతంబు మహానుభావంబున, నమ్మహీరమణుభార్యాత్రయమున
రాజన్యకుంజరురాముని గౌసల్య, కైకేయి గుణగణాకల్పు భరతు
మానితయశుని లక్ష్మణుని శత్రుఘ్ను సుమిత్రయుఁ గాంచిరి ధాత్రి యలర
విష్ణునంశమున నీవ్విధమునఁ బుట్టిన, రామదేవుం డభిరామలీల
తే. వెలసి వేదతదంగాదివిద్య లెల్ల, నభ్యసించి ధనుర్వేద మధిగమించి
సరససాహిత్యవేది యై సకలకళల, నెఱిఁగి యౌదార్యశౌర్యసమేతుఁ డగుచు.

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తముగా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగఁ జాలినసీతకు రుద్రచాపభం
జన మనునుంకు విచ్చి నృపసత్తమసూతిఁ బరిగ్రహించి పే
ర్చినయుభయానురాగమునఁ జిత్తభవుం జరితార్థుఁ జేయుచున్. 69
తే. మును సురాసురసంగ్రామమున రథంబు, గడపి విభుచేత వరములు గన్నకైక
యడుగ నరపతి పంపంగ నక్కుమారుఁ, డరిగెఁ గాననమునఁ దప మాచరింప.

శా. రాముం దాపసవృత్తి కంపఁ దను సామ్రాజ్యంబుపై నిల్ప జే
తోమోదంబునఁ గోరుతల్లికిఁ గులద్రోహంబు దక్కంగఁ ద
ద్భూమిం బ్రస్ఫుటరక్షమై నడపి సద్భోగాత్ముఁ డై సర్వలో
కామోదం బొనరించె నాభరతుఁ డార్యస్తుత్యవృత్తంబునన్. 71

చ. వనితయు లక్ష్మణుండు సహవాసము సేయఁగఁ బర్ణశాలలన్
మునిజనవర్తనంబునఁ బ్రమోదముఁ బొందుచు దండకావనం

బున రఘురాముఁ డున్నయెడఁ । బొల్తుక యొక్కతె యేగుదెంచి యా
తనిఁ గని కాముచే నలఁగి । ధైర్యవిహీనతఁ గోర్కెఁ జెప్పినన్. 72

తే. అతఁడు నగిత్రిప్పిపుచ్చిన । ననుజుకడకు, నరిగి యాతండు ద్రోచినఁ । బెరిఁగివికృత
వేషయైయెత్తికొనిపోవ । రోషమెత్తి, యక్కుమారుఁడు వెసఁగో । సెముక్కుచెవులు.

క. భంగపడి రాముకడ క, య్యంగన చనుదెంచి యిట్టు । లనియెఁ ద్రిలోకో
త్తుంగచరిత్రుఁడు శశ్వద, భంగుం డగుపంక్తివదను । భగినిం జుమ్మీ. 74

తే. శూర్పణఖ యనుదాన మీ । దర్పమడఁప, నసుర లిప్పుడ వచ్చెద । రనుచుఁగోప
మునఁ గడంగి జనస్థాన । మునకు నేగి, యనుజుఁ డగుఖరుతోడఁ । జెప్పిన నతండు.

క. దూషణునిఁ ద్రిశిరుఁ గూడి స, రోషంబుగ నెత్తి వచ్చి । రోగంబులు ది
వ్యౌషధముఁ దాఁకుపగిది మ, నీషమెయిం జాలు రాము । నెదిరి మహాజిన్. 76

చ. పొలిసినఁ జూచి శూర్పణఖ । పోయి దశాననుఁ గాంచి బన్నముం
దెలుపునెడం బ్రసంగమునఁ । దేటపడన్ వినిపించె సీతకో
మలతనులీల యద్దివిజ । మర్దనుఁడున్ హృదయంబునం గుతూ
హల మెలరార శీఘ్రగతి । నయ్యెడ కేగె వియత్పథంబునన్. 77

క. చని కౌటిల్యమున మహీ, తనయం గొని లంక కరిగె । దానవుఁ డపుఁడా
మనుజేంద్రనందనుఁడు దన, మనమునయెడ లనుఁగుఁదమ్ము । మాటల మలఁగన్.

సీ. ఎడసొచ్చి దైత్యుచేఁ । బడినజటాయువు వలన నంగనచన్న । వల నెఱింగి
శరణార్థి యగుదివా । కరసూతిఁ జేకొని కోలతోడనె వాలిఁ గూల నేసి
వనచరబలముల । వసుధ నెల్లను నొక్క వాయిగా నడపించి । వార్ధిఁ గడచి
లంకపై విడిసి చాలంబు బలంబును జూపి రాక్షసకోటి । రూపడంచి

తే. కుంభకర్ణునిఁ గుంభని । కుంభనాము, లైనతనయులతో నంత । కాలయమున
కనిచి దేవాంతకప్రహా । స్తాదిబంధు, వర్గసహితంబుగా దశవదనుఁ దునిమి. 79

తే. అఖిలదేవతాసన్నిధి । నగ్నిదత్త, యైనజానకి నానంద । మతిశయిల్లఁ
గైకొనియె రాముఁడీమూఁడు । లోకములకు, నద్భుతప్రీతులడరి పొం । గారుచుండ.

క. ఇంద్రజి ననిలోఁ జంపి మ, హేంద్రాదిత్రిదశనుతుల । కెక్కినయనుజున్
సాంద్రానుమోమున రఘు, చంద్రుఁడు మో మెలమిఁ బొంద । సంభావించెన్.

ఆ. అతని నపుడ దివ్య । యానరత్నం బగు, పుష్పకంబుఁ దేరఁ । బుచ్చి దాని
కెదురువోయి యర్చ । లిచ్చి సంప్రీతి నా, తండు జానకియును । దాను నెక్కె. 82

చ. శర ణని వచ్చి చొచ్చి యని । శంబును గొల్చుచు నున్నరావణా
వరజు విభీషణున్ సమర । వర్తనుఁ దైనపినేంద్రనందనున్
శరనిధి దాఁటి దేవిఁ గని । చయ్యన నుంగర మిచ్చి పేర్చి య
ప్పురవర మేర్చి లోకనుతిఁ । బొందినపావని నాదరించుచున్. 83

ఉ. వారలు వారిభూరిపరివారముతోన విమాన మెక్కి రాఁ
గా రఘునందనుం డరిగి కాంచనతోరణచిత్ర మైన నవ
ద్వారనికాయ మైననిజపట్టణ ముత్సుకవృత్తిఁ జొచ్చె నిం
డారుముదంబునన్ భరతుఁ డాదృతిఁ జేసి సలీలఁ గ్రాలఁగన్. 84

క. వినయము గైకొనఁగాఁ జేయను దగువా రెల్లఁ దన్ను నయ్యయిసంభా
వనమై నభినందింపఁగ, జననాథుఁడు పూజ్యరాజ్యసంపద నొందెన్. 85

ఆశ్వాసాంతము.

మ. కమలాధారుఁడు భీతిదూరుఁ డసమాకారుండు గంభీరుఁ డ
బ్జముఖీమారుఁ డపారసారుఁడు కళాస్ఫారుండు వీరుండు దు
ర్దమదోస్సారుఁ డధర్మభీరుఁడు మహోదారుండు దుర్వారుఁ డ
త్యమలాచారుఁడు నిర్వికారుఁడు యశోహారుండు ధీరుం డిలన్. 86

క. వికచకమలాయతాక్షుం, డకుటిలచిత్తప్రచారహారిమిత్రుం డ
ర్కకులప్రదీపుఁ డభినవ, మకరాంకుఁడు విజయమానమర్దనుఁ డెలమిన్. 87

మాలిని. నమదరినృపచూడానవ్యరత్నాంశువీచీ
సముదయసుభగోల్లాసస్ఫురత్పాదపద్మం
డమరతరునికాయత్యాగలీలాపహాసో
ద్యమనిపుణనిసర్గోదార్యహస్తాబ్జుఁ డుర్విన్. 88

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిధేయ తిక్కన నామధేయ ప్రణీతం బయినయుత్తరరామాయణం బనుమహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# నిర్వచనోత్తరరామాయణము.



## ద్వితీయాశ్వాసము.

మధ్యగిరథాన్వయ
తామరసాకరసహస్రధాముఁడు సూరి
స్తోమారామవసంతుఁడు
భూమండనయశుఁడు మన్మభూమీశుఁ డొగిన్. 1

### రామునికొల్వుకూటమునకు జనకాదులు వచ్చుట.

క. శ్రీరామచంద్రుఁ డిట్లు మ,హారాజపదస్థుఁ డైన నభినందింపన్
గారవమున జనకాది, క్ష్మారమణులు వచ్చి కాంచి సంప్రీతిమెయిన్. 2

క. అన్నరపతివినయాదిగు,ణోన్నతి కెద లలర మంజులోక్తుల సమయో
త్పన్నవిషయోపలాలన, నున్నయెడన్ హర్షరసముత్కర్షముతోన్. 3

సీ. కౌశిక బక దాల్భ్య కణ్వప్రభృతు లైనదురితవిదూరు లా తూర్పువారు
నాత్రేయ కుత్స దృఢాయు రగస్త్య లాదిగఁ గలదక్షిణదిక్కువారు
ఋషభ రైభ్యక యక్షవృషముఖ్యు లౌతపోమహనీయు లగుపశ్చిమంబువారు
గశ్యప జమదగ్ని గౌతమాత్రులు లోనుగా నుత్తరమ్మునఁ గల్గువారు
తే. శిష్యసంఘంబుతో రాముఁ బోష్యవర్గ, మగుట మునికులమెల్లను నరుగుదెంచె
నతనివిజయోత్సవముఁ గొనియాడు వేడ్కఁ, బ్రీతి మొగముల నెలకొనఁ బిండుగట్టి

ఉ. అందఱుఁ గూడి మోసలకు నర్థిమెయిం జనుదెంచి యెంతయుం
గ్రందుకొనంగ నున్నెడ నగస్త్యుఁడు వాకిటివానిఁ జూచి మా
యందఱ రాక దాశరథికి వెఱిఁగింపుము వేగ మన్న వాఁ
డుం దగఁ బోయి యల్లన నడుంకుచు భూవిభుఁ జేరి నమ్రుఁడై. 5

ఉ. దేవ మునీశ్వరుల్ సకలదిఙ్ముఖవాసు లగస్త్యముఖ్యు లా
శ్రావితనామధేయులు విశాలతపోవిభవు ల్సముజ్జ్వల
త్పావకమూర్తు లయ్యును గృపారసపూరితశీతలాకృతుల్
దేవరఁ గాన వేడ్కఁ జనుదెంచినవా రని విన్నవించినన్. 6

క. విని యెంతయు సమ్మదమున, జనపతి తోడ్తెమ్ము వారిఁ జయ్యన ననుడుం
జనెఁ బణిహారియుఁ దోడన, మును లత్యంత ప్రమోదమున వచ్చుటయున్. 7

చ. పతి యెదురేఁగి నమ్రుఁడయి । భక్తిమెయిం గొని వచ్చి యుజ్జ్వలో
న్నతకనకాసనంబుల మ । నఃప్రముదంబుగ నందఱిన్ యథో
చితగతి నుంచి మోమరల । నేమమె నావుడు బాధ లెల్లఁ దీ
ర్చితి భువనంబు లన్నిటికి । నేమమ యింకిట మాకు నేమమే. 8

మునులు రాముని నుతించుట.

చ. అరిఁ బరిమార్చి ప్రీతి జన । కాత్మజఁ దోఁకొని యేగుదెంచి రా
జ్యరమఁ బరిగ్రహించి యిటు । లద్భుతసంపద నొప్పి యున్ననిన్
గర మనురక్తి మై వినియుఁ । గన్నులు చల్లగఁ జూచియు న్ముదం
బరుదుగఁ గంటి మెంతయుఁ గృ । తార్థుల మైతిమి రాఘవేశ్వరా. 9

ఆ. అలుక వొడమి చాప । మందికొనిననుం ద్రిజగము లైనఁ గడఁక । సమయుననిన
సమరమందు రాక్షస । శ్రేణి నోర్చుట, నీకు నెంతపెద్ద । నృపవరేణ్య. 10

క. ఐనను రావణుఁ డఁట రిపుఁ, డానెలకువ చొచ్చి పొదివి । తఁట పోరను నీ
చే నెత్తురు గాకుండఁగ, వానిం జంపి తఁట తగదె । వర్ణన సేయన్. 11

మ. అనిఁ గుంభుండు నికుంభుఁడుం బడినఁ గ్రో । ధావిష్టుఁడై దర్పముల్
దనుజస్నేహముఁ బక్షయుగ్మకము గా । ధాత్రీధరాకారతం
జనుదేరం గని కుంభకర్ణుఁ బటువ । జ్రస్ఫారబాణాహతిం
దునుమం జాలుట నీదు లే దరయ నీ । కోర్విక్రమక్రీడకున్. 12

చ. ఇవి యరయంగ నెంతపను । లింద్రజిచావుఁ దలంప వాని నా
హవమున శూలి కైనఁ జెన । య న్నర మాతఁడు పిల్కుమారినన్
భువనము లెల్ల నిర్భయతఁ । బొంది మహాద్భుత మంది లక్ష్మణ
స్తవనకథావిధాచరణ । తాపరతంత్రము లయ్యె రాఘవా. 13

చ. అని మును లెల్లఁ బంక్తిముఖు । నాతనితమ్మునిఁ గుంభకర్ణునిం
దనయుని మేఘనాదుని సు । దగ్రబలాఢ్యులఁ గాఁ గడంగి పే
ర్కొన విని కౌతుకం బడరఁ । గుంభసముద్భవుమోముఁ జూచి యి
ట్లను ధరణీశ్వరుండు విన । యంబు నిజాస్య మలంకరింపఁగన్. 14

క. కడిఁదిమగ లని దశాస్యుం, గొడుకుం దమ్మునిఁ గరంబు । గురువుగ మీఁచె
ప్పెడుభంగిఁ జూడ వారల, నడుగంగా వలసియున్న । యది మునినాథా. 15

క. అమ్మనుజభోజనులజ, న్మమ్ములునుం దపము చేసిన । తెఱంగును శౌ
ర్యమ్ములును జెప్పు మనవుడు, నమ్ముని రఘుపతికి నిట్టు । లనియెం బ్రీతిన్. 16

విశ్రవసుజన్మప్రకారము.

ఆ. తొల్లి కృతయుగమునఁ । దోయజసంభవ, నందనుఁడు పులస్త్య । నామధేయుఁ
డైనమునివరుఁడు మ । హానుభావంబునఁ, దండ్రియట్ల యొన్న । దగినవాఁడు. 17

చ. అమరనగంబుచేరువ ని । యంత్రితనిర్మలచిత్తవృత్తి యై

శమదమసత్యశాలి యనఁ జాలి తపం బొనరించు చుండి కాం
చె మనుజదేవకింపురుషసిద్ధవియచ్చరకన్యకానికా
యముఁ దనయాశ్రమస్థలియుపాంతమున న్విహరింప వచ్చినన్. 18

క. పలుమఱుఁ గని కని యొకమఱి, మెలఁతలతో నిట్టు లనియె మీ రిచటికి రా
వల దింకిట ననుఁ జూచినఁ, గలుగుంజూఁడి తత్క్షణంబ గర్భము మీకున్. 19

క. అని నియతి సేయుటయు న,మ్మునిపలుకులు కన్యకాసమూహం బెల్లన్
విని యాయిరువునఁ జేరక, చన నం దొక్కర్తు విధివశంబున వినమిన్. 20

ఉ. ముందటియట్ల నెచ్చెలుల మొత్తములోపలఁ గూడి యాఁడువే
డ్కం దరలాడి వోయి యచట న్మునియాకృతితోడ దృగ్రుచుల్
వొందినమాత్ర మై నెలఁత పొక్కిటితో విరియ న్వళు ల్గరం
బందము గాఁగ నారను గుచాగ్రములు న్నునుఁగప్పుసొంపు నై. 21

ఉ. గర్భముఁ దాల్చి మై గలయఁ గన్గొని వెక్కసపాటు మున్నుగా
దుర్భర మైనసంభ్రమముతోడ విషాదభయానుతాపముల్
నిర్భరభంగిఁ బుట్టి తననెమ్మది దీఁటుకొనంగ జోటి యా
విర్భవదార్తి యై చనియె వేగమ యాత్మనివాసభూమికిన్. 22

క. అరుగుటయుఁ జూచి మది న,చ్చెరువడి తృణబిందుఁ డల్లఁ జేరఁ బిలిచి ని
ర్భరగర్భచిహ్నములుగా, నిరూపణముచేసి యవ్వనిత కి ట్లనియెన్. 23

ఉ. అక్కట కన్యకాత్వ మిటు లాఱడివోవ నకారణంబ నీ
కెక్కడిచూలు వచ్చె నిది యెయ్యెడ నెమ్మెయిఁ బుట్టె నన్నున్
వెక్కుచు మాట దొట్రుపడ వెల్వెలఁ బాఱుచుఁ గ్రమ్ముకన్నునీ
రక్కుపయిన్ వెసం దొరఁగ నామృగలోచన తండ్రి కి ట్లనున్. 24

క. చెలులకడ నాడువేడుకఁ, బులస్త్యమునియాశ్రమంబు పొంతకుఁ జని య
ప్పొలఁతులఁ గానక యెయ్యెడఁ, గలయం బరికించు చుండ గర్భము దోఁచెన్.

ఉ. నాయొడ లేన కన్గొని మనంబున బెగ్గల మంది యత్తఱిం
జేయునుపాయ మెయ్యదియుఁ జిత్తమునం దలపోయలేక నా
కీయకృతంబు వాటిలుట యేర్పడ నీ కెఱిఁగింపఁ గోరి వే
వే యిటు పాఱుతెంచితి వివేకనిధీ ననుఁ గావు నావుడున్. 26

క. ఆరాజర్షియు దీనికిఁ, గారణ మమ్మునియ కాఁ బ్రకాశజ్ఞానో
దారమతి నెఱిఁగి కన్నియ, గారవమునఁ గొని పులస్త్యుకడకుం జనియెన్. 27

చ. చని మునినాథ యుత్తరుణి సాధ్వి గుణాన్విత నాదుకూర్మినం
దని నిగృహీతచిత్తుఁడఁ గదా యని త్రోవక దీని నాదరం
బునఁ బరిచర్యఁ గొమ్మనినఁ బొల్తుక నర్థిఁ బరిగ్రహించి యా
తనిఁ జరితార్థుఁ జేసె నుచితమ్మున నమ్ముని ధర్మవేది యై. 28

చ. అది మొదలాలతాంగి వినయంబున వల్లభుచిత్తవృత్తి స
మ్మదము దలిర్ప భక్తిగరిమంబున బెంపు వహించి యుండఁ గొ
న్ని దినము లంతఁ బోయిన మునిప్రవరుండు ప్రసన్నుఁ డై దయా
స్పదసదపాంగవీక్షణము భామినిపైఁ బొలయంగ నిట్లనున్. 29

క. తరుణీ భక్తికి మెచ్చితి, వర మిచ్చెద నీకు విను భవద్గర్భము భా
స్కరతేజుం డగుకొడుకై, వెరవరి యయ్యెడును సకలవిద్యలయందున్. 30

క. ప్రశ్రయవతి వగునీచే, విశ్రుత మై గుణసమృద్ధి వెలయుట వాఁడున్
విశ్రవసుం డనఁగా భువనశ్రావ్యం బైనభవ్యనామము వడయున్. 31

క. మనరెండువంశములుఁ జేర్కొనఁ గను నీకొడుకువలనఁ గోమలి యనినన్
విని సంతసిల్లి యట్టుల, తనయుని జనకోపమానుఁ దడయక కాంచెన్. 32

శా. పౌలస్త్యుం డుదయించి నిర్మలకళాస్ఫారీభవన్మూర్తి యై
బాలేందుం బ్రహసించుచుం బెరిఁగి యల్పం బైనకాలంబునం
జాలం గీర్తన కెక్కి యుజ్జ్వలతపస్సంపత్తిఁ బెంపారి ధ
ర్మాలోకంబున లోకము ల్వెలుఁగ నార్యశ్లాఘ్యుఁడై యున్నెడన్. 33

క. తేజోధనుఁ డగునమ్ముని, రాజితగుణజాలములకు రాగిల్లి సుతం
బూజాపూర్వముగ భరద్వాజుం డాతనికి దేవవర్ణిని నిచ్చెన్. 34

ఉ. విశ్రవసుండు నమ్ముదిత వేడుకతోడ వివాహ మై గృహ
స్థాశ్రమధర్మ మొప్పెసఁగ యజ్ఞసమృద్ధి వహించుచుం గృపా
విశ్రుతబుద్ధిసంపద వివేకవిశుద్ధి ప్రసిద్ధి కెక్క భ
వ్యశ్రుతిచోదితాచరణమాభరణంబుగ నిత్యపుణ్యుఁ డై. 35

### వైశ్రవణుని వృత్తాంతము.

క. ఆరమణియందుఁ గులవిస్తారకుఁ డగుతనయుఁ బడసి తత్సంతాన
శ్రీరమ్యతఁ గోరెడుసరసీరుహసంభవుని సంతసిల్లఁగఁ జేసెన్. 36

ఉ. తత్సమయంబున న్మునివితానము గొల్వఁగ వచ్చి యెంతయున్
వత్సలతం గుమారునకు వైశ్రవణుం డనుపేరు వెట్టి య
త్యుత్సుకవృత్తి నెత్తికొనియుం గొనియాడియు నట్లు పుత్త్రపౌ
త్త్రోత్సవ మాచరించెఁ గమలోద్భవుఁ డుత్కటహర్షమూర్తి యై. 37

క. ఆవైశ్రవణుఁ డఖిలవిద్యావిదుఁ డై యౌవనమునఁ దప మొనరించెన్
దేవాసురసిద్ధమునీంద్రావళి తనధర్మనియతి కచ్చెరువందన్. 38

క. నీరాహారసమీరాహారంబులఁ జేసి చేసి యది గాక కడున్
ఘోరం బగుతపము నిరాహారుం డై చేసె బహుసహస్రాబ్దంబుల్. 39

క. నిష్ఠ మెయి నిట్లు వ్రతము లనుష్ఠింపఁగ సౌమ్యదర్శనుం డయి యమర
శ్రేష్ఠనివహమ్ముతోఁ బరమేష్ఠి యరుగుదెంచెఁ దత్సమీహిత మొసఁగన్. 40

చ. ముదమున నేగుదెంచి తనముందట నిల్చినశంభుఁ గాంచి త
త్పదసరసీరుహంబులయుపాంతమునన్ ధరఁ జాఁగి మ్రొక్కి నె
న్నుదుటను మోడ్పుఁగేలును దనుద్యుతియుం బులకాంకురంబులున్
హృదయముభక్తిపెంపుఁ బెరయించుచు వైశ్రవణుండు నిల్చినన్. 41

ఉ. వత్స భవత్తపోనవదివాకరుఁ గాంచి వికాస మొందె నా
హృత్సరసీరుహంబు వర మిచ్చెద నిష్టము గోరు నావుడున్
వత్సలుఁడైనపద్మభవు వైశ్రవణుండు సముజ్జ్వలార్థసం
పత్సముదాయనిత్యసుఖభవ్యదిగీశత వేఁడె వేఁడినన్. 42

ఉ. అక్కమలాసనుండు వరుణాంతకజిష్ణులఁ జూచి మీకుఁ దో
డొక్కని దిక్పతిత్వపదయోగ్యుని నే సృజియింప నున్నచో
గ్రక్కున నీతఁడుం దదభికాంక్షయ చేసెఁ దగంగ నింక మీ
రొక్కటి నై జగం బరయుచుండుఁడు నాలవవానిఁ జేసితిన్. 43

చ. అని వర మిచ్చి వైశ్రవణునాదరవిస్తృతనేత్రపద్ముఁ డై
కనుఁగొని నిర్జరత్వపదగౌరవనిత్యుఁడ వైతి గాన నీ
కనుగుణ మైనయీరుచిరయానముఁ గొమ్మని యిచ్చెఁ బుష్పకం
బనఁగఁ బ్రసిద్ధ మై మణిమయాకృతి నొప్పు విమానరత్నమున్. 44

ఆ. ఇవ్విధమున నిచ్చి యింద్రాదిసురులతో, నజుఁడు వోవుటయు ధనాధిపతియుఁ
దండ్రికడకు వచ్చి తత్పదాబ్జములకు, నెరఁగి భక్తియుక్తి నెదుర నిలిచి. 45

క. కోరినవరము విమానము, గారవమున నాకుఁ గమలగర్భుఁ డొసంగెన్
మీరలు నివాసదేశముఁ, గారుణ్యము సేయుఁ డనినఁ గడువేడుకతోన్. 46

క. ఆవిశ్రవసుఁడు తనదుప్ర, భావంబున నెల్లయెడలుఁ బరికించి తదీ
యావాసయోగ్యముగ మది, భావించి ముదమున నర్థపతి కిట్లనియెన్. 47

సీ. కమనీయముగ విశ్వకర్మ నిర్మించిన మున్ను దైత్యశ్రేష్ఠు లున్నపురము
జలనిధి పరిఖగాఁ గలిగినయది లంకయనఁగ లోకములఁ బేర్కొనిననెలవు
దనుజు లెల్లను జనార్దనుచేత మర్దితు లయి పోకఁ జేసి పాడయ్యె నయ్యు
రమ్యనికేతనాభిరామ మై యుల్లసిల్లెడు సుఖ ముండు మచట

ఆ. ననిన నట్ల కాక యని తండ్రి వీడ్కొని, బహువిధానురూపపరిజనములు
పొదివి కొలువ నతఁడు పుష్పకంబునఁ జని, యందు దివ్యసుఖము లనుభవించె.

క. జనకునకు మ్రొక్కఁ బోవుచు, ననిమిషవల్లభునికడకు నరుగుచుఁ గమలా
సనుఁ గొలువఁ జనుచు విహరిం,చె నిజేచ్ఛం బుష్పకమున సిద్ధపదమునన్. 49

చ. అన విని కుంభసంభవమహామునితో రఘువంశనాథుఁ డి
**ట్లనియె మునీంద్ర మున్ను నసురాధిపు లేలెడివీడె లంక త**

జ్జననతపోవిభూతిబలసత్త్వచరిత్రవిశేషము ల్జనా
ర్దనుదెస హాని పుట్టినవిధంబు వినం గడువేడు కయ్యెడున్. 50

క. ఆతనికి మనయెఱింగిన, యాతనికిని దారతమ్య మెట్టిదియో మీ
చేత నెఱుంగవలయు నఱ,చేత నిడినయట్లు దెలియఁ జెప్పు మునీంద్రా. 51

క. జనపతి తన్న ట్లడిగిన, మునినాథుం డధికహర్షమునఁ బలికె దశా
ననదర్పదళన యేర్పడ, విను చెప్పెద నంతయును సవిస్తారముగాన్. 52

సుకేశుని వృత్తాంతము.

క. హేతిప్రహేతు లనఁ బ్రఖ్యాతు లుదయ మైరి రాక్షసాన్వయమున నా
హేతి గృహస్థుం డయ్యెఁ బ్రహేతి తపంబునకుఁ జనియె నెంతయు శాంతిన్.

ఆ. అంబుజాక్షి కాలుఁ డనువానిచెలియలు, హేతిరమణి యైననాతి యొక్క
తనయుఁ గాంచె వీతవినయు విద్యుత్కేశు, నతులబలపరాక్రమైకరసికు. 54

చ. అతఁ డభిరాముఁ డై పెరిగి యౌవనసంపద నుల్లసిల్లుచుం
బ్రతి యిడరానిరూపమునఁ బ్రస్తుతి కెక్కి వివాహ మయ్యె వి
శ్రుతముగ సంధ్య నాఁ బరఁగు సుందరికూరిమిపుత్త్రి మన్మథా
స్త్రతులితగాత్రయష్టి యగు సాలకటంకటసమ్మదమ్మునన్. 55

క. ఆలలన యౌవనంబునఁ, జాలావై వగచి తుదిఁ బ్రసూతిక్రియకుం
గాలం బగుటయు మందర, శైలతటంబునకు నొంటి సని యచ్చోటన్. 56

ఆ. వరతనూజుఁ గాంచి కరుణావిహీన యై, విడిచి వైచి వచ్చి విభునితోడ
వివిధకేళిఁ దేలి విహరించు చుండె మన్మథవికారపూరమగ్న యగుచు. 57

క. అంత నట నక్కుమారుం, డెంతయుఁ గరుణమ్ము దోఁప నేడ్చుచు నుండం
గొంతవడికి భూతేశుఁడు, కాంతాసహితంబు వృషభగమనుం డగుచున్. 58

క. ఆచక్కటిఁ గ్రీడార్థం, బై చని యాయేడ్పు విని దయార్ద్రిత బాలుం
జూచి యకటకట యని గౌరిచారుముఖాంబుజము నిరీక్షించు చొగిన్. 59

మ. అతివా వీనికిఁ దండ్రితోడిసరిప్రాయం బాసురత్వంబు ను
ద్ధతబాహాబలగర్వనిర్వహణముల్ దైతేయవంశక్రమా
గతరాజ్యంబు నభశ్చరంపుఁబురముం గ్రామప్రచారంబు ని
చ్చితి నీచిత్త మెఱింగి నావుడుఁ గృపాశ్రీపారవశ్యంబునన్. 60

క. అప్పుడ గర్భం బగుటయు, నప్పుడ జన్మించుటయును నప్పుడ ప్రాయం
బొప్పెడిజవ్వన మగుటయు, నప్పుడు దనుజాన్వయమున కంబిక యిచ్చెన్. 61

క. కేశములు లెస్స యిప్పి,శితాశనునకు ననుచుఁ గౌతుకాన్వితమతి యై
యీశానుఁడు గావించె సుకేశుం డనుపేరు వానికిం బ్రకటముగన్. 62

చ. అతఁడు వరప్రసాదమహిమాతిశయంబునఁ జేసి విష్టప
త్రితయము గీడ్వడం జనదు తేజము చెల్లుచునుండ లీల న

ప్రతిహతవృత్తి నెల్లెడ నభశ్చర మైనపురంబుతోడ నం
చితగతులం జరించె విలసిల్లుచు నీశ్వరలాలనీయుఁ డై. 63

క. ఉన్నయెడ నాసుకేశుమ,హోన్నతి కెద నోటువడి వరయోరూపగుణో
త్పన్నానురూపమతిఁ దన, కన్నియ దేవమణి నిచ్చె గ్రామణి ప్రీతిన్. 64

మాల్యవదాదులు తపంబుచే బ్రహ్మవలన వరంబులు వడయుట.

తే. ఇట్లు గంధర్వవల్లభుఁ డెలమి గూఁతుఁ
దనకు నిచ్చిన వరియించి దానివలన
మాల్యవంతుఁ డనంగ సుమాలి యనఁగ
మాలి యనఁ గాంచెఁ గొడుకులమహితయశుల. 65

ఉ. ఇవ్విధిఁ బుట్టి తండ్రి పరమేశువరంబున నద్భుతస్థితిం
జవ్వన మాదిగా నఖిలసంపదలుం గను టెల్ల విన్కి నా
మువ్వురు నుత్సహించి తపముం బరమేష్ఠి గుఱించి చేయఁగా
నవ్విబుధాచలంబునకు నర్థి నెయిం జని సువ్రతస్థులై. 66

ఉ. ఆర్జవశాంతిదాంతినియమాదిగరిష్ఠగుణైకనిష్ఠమై
నిర్జితచిత్తవృత్తు లయి నిర్మలధర్మపరంపరాప్రభా
వార్జన మెల్లలోకములు నద్భుత మందుచు సంస్తుతింప నా
వర్జితబుద్ధిఁ జేసి రనవద్యతపంబునఁ బద్మసంభవున్. 67

శా. ప్రత్యక్షం బయి దేవబృందములతోఁ బద్మాసనుం డర్థి నా
దిత్యాద్రిస్థలి నిల్చి పొల్చుటయు దైతేయాత్మజు ల్సంభ్రమ
ప్రీత్యుత్కర్షము లంతరంగముల ఘూర్ణిల్లంగ సర్వాంగసాం
గత్యస్వీకృతభూతలం బగునమస్కారంబునం బుణ్యులై. 68

క. కరకమలయుగళపుటశే,ఖరులును భక్తిభరనమ్రగాత్రులు నై ని
ల్చిరి వరదానౌత్సుక్య, స్ఫురితాధరుఁ డైనపద్మజునికట్టెదురన్. 69

ఉ. అత్తఱి వారిఁ జూచి కరుణార్ద్రిత నిట్లనియె న్విరించి దై
త్యోత్తములార మీతపము సుగ్రత కచ్చెరు వంది వచ్చితిం
జిత్తములందు మీ రభిలషించినయట్టివరంబు లెల్ల నే
నిత్తుఁ గడంగి కోరికొనుఁ డిప్పుడ దేవమునీంద్రసన్నిధిన్. 70

ఉ. నావుడుఁ బొంగి యద్దనుజనందను లిట్లని రేకవాక్యులై
దైవతయక్షకింపురుషదానవమానవకిన్నరాదినా
నావిధభూతకోటుల రణంబున గెల్వఁ బరస్పరప్రమో
దావహ మైననెయ్యముఁ జిరాయురవాప్తియు మాకభీష్టముల్. 71

తే. ఇవ్విధంబునఁ గోరిన నెలమిఁ బొంది
యట్ల కావుత మని కమలాసనుండు

వాసవాదులు వెఱఁ గంద వరము లొసఁగి
మునులు గొలువ నిజావాసమునకుఁ జనియె. 72

మాల్యవంతుఁడు లంకయందు నివసించుట.

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగుమాల్యవంతుఁ డ
చ్చెరు వగువిక్రమంబునఁ బ్రసిద్ధి వహించి నిజానుజన్ములం
గర మనురక్తి మన్ననఁ దగం గొనియాడుచు సర్వలోకభీ
కరుఁ డయి దేవతామునినికాయము దల్లడ మందుచుండఁగన్. 73

క. దానవలక్ష్మీవిభవ మ,నూనంబై నెగడ సదృశోద్ధతగతి నెం
దేనిం జని విహరించుచుఁ, దా నొక్కెడ విశ్వకర్మఁ దద్దయుఁ బ్రీతిన్. 74

క. రావించి యిట్టు లనియెను, దేవతలకు నెల్ల నీ వతిస్థిరమతి వై
కావింతు నివాసము లొక, యావాసము మా కొనర్పు మభిరామముగాన్.

తే. అదియు రజతాద్రి నొండె హిమాచలమున
నొండె మందరనగమున నొండె బాగు
చూచి నీశిల్ప మేర్పడ సుభగరత్న
సంపదుజ్జ్వలముగ రచియింపవలయు. 76

క. అని తనతోఁ జెప్పినయ, ద్దనుజపతికి విశ్వకర్మ తాఁ దొల్లి సురేం
ద్రునియనుమతమున దక్షిణ, వననిధిలో నొక్కపురము వర్ణన కెక్కన్. 77

క. ఒనరించుటయుఁ ద్రికూటం, బనునున్నతభూధరంబునం దది శతయో
జనవిస్తీర్ణం బగుటయుఁ, గనకప్రాకారసప్తకము గల్గుటయున్. 78

సీ. అఖిలదిక్కులును సమ్ముఖములయగుటయు మందిరమ్ములు రత్నమయము లగుట
గోపురావళి నభోవ్యాపిని యగుటయు మార్గముల్ మృదుకుట్టిమమ్ము లగుట
తోరణోత్కరము రత్నారూఢ మగుటయు నంగణంబులు మనోహరములగుట
దేవాలయంబులు దివ్యంబు లగుటయు నాపణవ్రాతంబు హైమ మగుట

ఆ. పేరు లంక యగుట యారామకేదార, కమలషండదీర్ఘికావిభూతి
పాత్ర మగుట ప్రబలశత్రుపరాక్రమా, గమ్య మగుట చాలరమ్య మగుట.

క. ఎఱిఁగించి మీకు నునికికి, నొప్పు సకలదైత్యకోటియును మీరలు నే
ర్తెఱఁ జని యం దుండుఁడు గడు, నుఱవని నెయ్యంపుసముచితోక్తులఁ దెలుపన్.

క. దనుజపతి లంక కందువ, గని నిధి నిఱుపేదవాఁడు గన్నట్లు మనం
బునఁ బొంగి యనుజసహితము, చని యప్పురి దైత్యవంశసామ్రాజ్యముగాన్.

మాల్యవదాదులు పెండిలియై పుత్త్రులం గాంచుట.

ఆ. నెగడి యున్నయెడ ననింద్యచరిత్ర గం,ధర్వి నర్మదాభిధాన ప్రీతిఁ
గోరి యిచ్చెఁ దనదు కూఁతుల ముగ్వుర, దానవేశ్వరునకుఁ దమ్ములకును.

క. క్రమమున సుందరియును గేతుమతియు వరదయు నన న్వధూటీత్రయముం
దమముప్పురఁ బూర్వజపూర్వముగఁ బ్రమోదములతో వివాహం బైనన్.

సీ. అందు సుందరి యను నరవిందనయన యున్మత్తు సుప్తఘ్ను నిమత్తు యజ్ఞ
కోపు దుర్ముఖుని విరూపాక్షు వజ్రముష్టిని గని పుత్రిక ననలఁ గనియె
నా కేతుమతియు ధూమ్రాక్షుఁ బ్రహస్తుఁ గంపనుఁ గాలకార్ముకు భద్రదత్తు
భాసకర్ణాంకు సుపార్శ్వసంహ్రాదిని గాంచెను వరదయుఁ గైకసియును
తే. నోలిఁ గుంభీనసయును బుష్పోత్కటయును
ననఁగ నలువురు వామలోచనలఁ గనియె
ననలు నీలుని సంపాతిహరునిఁ బడసె
వరద పదపడి దానవాన్వయము వెలిఁగె. 84

మాల్యవంతుఁడు లోకంబుల బాధించుట.

శా. సంతానం బభివృద్ధి నొందిన బలోత్సాహం బెలర్పం బలా
క్రాంతాశేషదిగంతుఁ డై బలువిడిన్ రక్షోగణేశుండు దు
ర్దాంతుం డై శ్రుతిబాధ సేయుచుఁ గ్రతుధ్వంసంబుఁ గావించుచుం
గాంతాగాంతరవాసు లైనమునులం గారించుచుం గ్రూరుఁ డై. 85

మ. పరనారీహరణం బొనర్చు వివిధోపాయంబుల న్మేదినీ
సురవర్గంబుల నొంచు దేవగృహసంశోభాభిఘాతంబు సే
యు రవీందుద్యుతిజాలము ల్మలుపు మాయోపాయకేళీకృతా
దరుఁ డై నిర్జరకోటిఁ గష్టపఱుచున్ ధర్మంబు నష్టంబుగాన్. 86

ఇంద్రాదులు హరుననుజ్ఞచే విష్ణువు వేఁడుట.

చ. ఋషులును దేవతాగణము లెంతయు బెగ్గల మంది యార్తు లై
వృషగమనుండు దీర్చు మనవేదన యంచు మహేశుఁ గాంచి దు
ర్విషహము లైనయాపరిభవించుట లెల్ల నెఱుంగఁ జెప్పి ని
స్తుషముగ దైత్యవర్గములఁ ద్రుంపఁగఁ గోరిరి దైన్య మేర్పడన్. 87

చ. హరుఁడు సుకేశుమీఁదికృప నాతనిసంతతి కల్గ కుండియున్
సురమునివృత్తభంగములు చూడఁగఁ జాలక యేను నేర నా
హరికడ కేగుఁ డాతఁ డభయం బొసఁగున్ దయ మీకు నన్నఁ జె
చ్చెరఁ జని శౌరి కంతయును జెప్పి రరాతులజన్మ మాదిగాన్. 88

శా. గోవిందుండు దయామతిం బలికె నాకుం జెప్పఁగా నేల రు
ద్రావిర్భావితశక్తి నే నెఱుఁగనే యాదైత్యుఁ దత్పుత్రకుల్
భావారూఢులు గారె పద్మజవరప్రాప్తానుభావు ల్తదీ
యావాసం బగులంక వింతయె త్రిలోకాక్రోశ మాలింపనే. 89

ఉ. వినను మీమతం బెఱుఁగు | నంతకు నేమియుఁ జేయ నైతి న
ద్దానవులన్ సముజ్జ్వలసు|వర్ణనిర్దళితాఖిలాంగులం
గా నొనరించి లోకముల | కల్మష మంతయుఁ బాచి యుత్సవ
శ్రీనినుపారఁ జేసెద వి|రించిమహేశులు సమ్మతింపఁగన్. 90

మాల్యవదాదు లమరావతిపై దండెత్తుట.

క. అని వీడ్కొల్పిన మోదం,బునఁ బొందుచు నిజనివాసములకు శతమఖా
ద్యనిమిషులుబుషులుఁబోయిన,యనంతరము మాల్యవంతుఁడంతయువినియెన్.

క. విని యెక్కింత వగచి య, ద్దనుజేంద్రుఁడు విక్రమైకతత్పరుఁ డగుచున్
మనమున గర్వము గదురఁగ, దనుజుల రావించి యిట్టులనియెఁ గుపితుఁ డై.

మ. మనలన్ ధూర్జటితోడ గోసడిచి కామధ్వంసి పట్టక పొం
డని చక్రాంకునిఁ జూపి పోవిడ సురేంద్రాదు ల్సరోజాక్షునిం
గని యెగ్గు ల్ప్రకటించినం గినిసి లోకంబు ల్వినంగా సతం
డనుమానింపక పూనె దైత్యకులసంహారంబుఁ గావింపఁగాన్. 93

ఉ. పూర్వమునన్ హిరణ్యకశిపుప్రభృతుల్ దనచేతఁ జచ్చినన్
గర్వము మీఱి యున్కి మురఘస్మరుఁ డెట్లుఁ గడంగు నాతనిన్
సర్వజగంబులున్ బెదర | సంగరరంగమునన్ జయించి హృ
త్పర్వ మొనర్పఁగావలయు | దైత్యులకు న్మన మెల్లభంగులన్. 94

క. అనిన సుమాలియు మాలియు, నని రతఁ డిట వచ్చె నేని | నదె యయ్యెడు న
య్యనిమిషు లెగ్గులు మనపైఁ, బొనరించినదాన నింత | పుట్టెను గంటే. 95

క. కావున నమరావతిపైఁ, బోవలయుం జుట్టుముట్టి | పోరిగొని పిదపన్
దేవతలపక్షమై యని, కేవీరుఁడుఁ గడఁగె నేని | నెఱుఁగుద మతనిన్. 96

ఆ. అనిన మాల్యవంతుఁ డగుఁ బోలు నిదియని,నయన మపుడ చాటఁబంచి కదలి
యమితవివిధవాహనారూఢయోధవీ, రోద్ధతముగ నడిచె | నుద్దవిడిని. 97

ఉ. అత్తఱిఁ గెంపు మీఱినఘనావళి యాకస మెల్లఁ గప్పి క్రొ
న్నెత్తురు నెమ్ములుం గురిసె | నీరధి యెంతయు ఘూర్ణమాన మై
యుత్తల మొందెఁ బర్వతము | లొక్కమొగిం గదలెన్మహోల్కముల్
మొత్తముగట్టి రాలె బలము ల్వెఱఁ గందఁగ జేటు దెల్పుచున్. 98

ఉ. అంతయుఁ జూచియున్ దితిసుతాధిపుఁ డప్డు మనంబులోన నా
వంతయుఁ గొంకు లేక దివిజావలికిన్ మనచేయుహానికై
యెంతలు పుట్టెఁ జూడుఁ డని | యే డ్తెఱఁ జూపుచుఁ దమ్ములన్ బలం
బంతటికిం బురస్సరుల | రై చనుఁ డంచుఁ బరాక్రమోన్నతిన్. 99

క. చెలఁగుచు నమరావతి కిం, పలరంగ నడచు టెఱిఁగి భ | యభ్రాంతి మెయిం
గలఁగఁగఁ బాఱి మహేంద్రాదులు వచ్చి రుపేంద్రుకడకు | దూతం గడఁకన్.

ఆశ్వాసాంతము.

ఉ. కాయికవాచికాత్మికవికారవిసర్జనవిస్ఫురత్తనూ
దాయకు నానతారివసుధావరహర్షరసప్రకర్షసం
ధాయకు సూరిశోభనవిధాయకు నుద్భటరాజదుర్దశా
దాయకుఁ గీర్తివస్త్రపరిధాయకు దీనజనార్థదాయకున్. 101

క. పాండిత్యసుభగుఁ ద్రిభువన, పెండేరు నరాతిభూపభీషణబాహా
దండాభిరాము రామా, మండలచిత్తాపహారిమకరపతాకున్. 102

మాలినీవృత్తము. సకలజనమనోజ్ఞుం ౯ జండభాషానభిజ్ఞుం
బ్రకృతిఘటితరాగుం ౯ బ్రస్ఫురత్త్యాగభోగుం
జకితనృపశరణ్యుం ౯ జారులావణ్యగణ్యుం
బ్రకటసుగుణసంగుఁ ౯ రాయవేశ్యాభుజంగున్. 103

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిధేయ తిక్కననామధేయప్రణీతం బయినయుత్తరరామాయణం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# నిర్వచనోత్తర రామాయణము

## తృతీయాశ్వాసము.



రమ్యతానిరూఢమ
హారస్కుం బుణ్యసంపదుదితయశస్కుం
గారుణ్యార్ద్రమనస్కుఁ బ్ర
జారంజనశీలు మనుమజగతీపాలున్. 1

విష్ణువు దేవతలకుఁ దోడై రాక్షసులతో యుద్ధము సేయుట.

చ. హరిఁ గని దేవదూత చరణానతుఁడై యసురేంద్ర సేన ని
ర్జరనగరంబుపైఁ బెలుచ రాకయు నాకము బెగ్గలంబునం
దిర్దుగుడుపాటుఁ జెప్పిన నతిత్వరితంబునఁ గౌతుకంబుమై
గరుడుని నెక్కి శార్ఙ్గగుణగాఢరవంబు నభంబు నిండఁగాన్. 2

క. రక్షోవధయును సుమనో, రక్షయు మదిఁ గోరి యాదరంబున రాజీ
వాక్షుఁడు సిద్ధులజయశ, బ్దాక్షరములుఁ గిన్నరీచయముగానంబున్. 3

క. కొంచెపునగవుల సంభా, వించుచు వివిధాయుధాంశువితతుల్ దిశలన్
నించుచు దనుజతమముఁ దూ, లించుచు రణకేళిలోలలీలం జనుచోన్. 4

క. గరుడునిపై శార్ఙ్గధను, ర్ధరుఁ డగువిష్ణుండు మేరుతటిఁ బొల్చుతటి
త్పరివృతజలదముఁ బోలుట, విరియ దనుజరాజహంసవితతి యితనికిన్. 5

మ. అని బృందారకవందిబృందము లమందానందముం బొంది కీ
ర్తన సేయం ద్రిదివంబు ముట్టికొన నుద్దామప్రతాపంబున
న్దనుజానీకము చేర కుండ నడుమ న్వారింపఁగాఁ బూని చ
య్యన నేగెం బతగేంద్రపక్షపవనవ్యాధూతదిగ్భిత్తి యై. 6

మ. చని నాకంబున కడ్డపడ్డ హరియుత్సాహంబు వీక్షించి య
ద్దనుజాధీశుఁడు చేయి వీచుటయు మాద్యద్దంతివర్గంబు న
శ్వనికాయంబుఁ బదాతిలోకము రథవ్రాతంబు నొక్కుమ్మడిన్
ఘనమార్గం బఖిలంబు గప్పి పడగల్ గ్రాలన్ వడిం దాఁకినన్. 7

తే. మందహాసంబు చేసి యమందరవము, మిగిలి రిపుతూర్యరవముల మ్రేఁగికొనఁగఁ

పాంచజన్యంబుఁబెలుచఁ బూరించిశార్ఙ్గ,గుణముసారించిదానవగణముఁజూచి. 8

క. కడఁకఁ దలమీఱి యల వేర్పడ మును దలపడఁ దలంచి పఱతేరంగా
విడుచుచు నొక్కొకయమ్మునఁ, బడ నేయుచు వచ్చె వీరభటులం గడిమిన్. 9

చ. తొలితొలి పడ్డపీనుఁగులఁ ద్రొక్కుచు నొండొరు మీఱఁ జూచున
గ్గలికఁ గడంగి బాహుబలగర్వము చూపఱు మెచ్చ నుగ్రదై
త్యులు దలపడ్డ వారిసమరోద్ధతి కుత్సన మంది శార్ఙ్గమం
దలవున నిల్వరించె నిశితాస్త్రము లూఁ తయి వ్రాలునట్లుగన్. 10

ఉ. కూలినవారిఁ జూచి వెడఁగొంకిన మెచ్చక ముచ్చు వెచ్చుగా
నేలకుఁ జొచ్చువారుఁ దమనెయ్యుర కడ్డము వచ్చువారు ను
క్కిలయి నేర్పులేక తమకించి పయింబడి నొచ్చువారు ముఁ
వాలినమచ్చరం బగుటవారణసేయక వచ్చువారు నై. 11

క. దానవు లేయుచు వైచుచు, సేనలఁ బురికొల్పుకొనుచుఁ జేరిన శార్ఙ్గ
జ్యానాదభరితరోదసి, యై నారాయణుఁడు మార్గణాంబుధి ముంచెన్. 12

చ. మురుమును వీఁకఁ దాఁకి యొకమోహర మచ్యుతుచేత మ్రగ్గుటన్
మొనలు గలంగినం గని సముద్ధతవృత్తి నదల్చి వెన్నుద
న్ని నిలిచె దానవేశ్వరుఁడు నెక్కొనఁగాఁ దనముద్దుఁదమ్ములున్
దనయులు దండనాథులు సుదగ్రత సేనకు దర్ప మెక్కఁగన్. 13

క. బరవసమునఁ గొల్తలచే, సిరి పురికొని కడఁగి దైత్యసేనలు మగుడన్
హరిఁ బొదిసెఁ జపలజలదో,త్కర మతిసాంద్రముగ నభముఁగప్పినభంగిన్.

ఆ. ఓరలేక దొరలు పోరికిఁ జొచ్చిరి, కడిఁదిమగలుఁ బేరు కలుగువారు
నడరి ముట్టఁ గవిసి రరవాయిగొనక కో,లాహలముగఁ గాల్బలమ్ము గదిసి.

క. శరములఁ జక్రంబులఁ దో,మరములఁ గుంతముల గుప్పి మానుగ ఖడ్గ
క్షురికా హల పరిఘాము,ద్గర ముసల పరశ్వధములఁగప్పిరి కడిమిన్. 16

శా. సర్వారాతిపయి న్నిజాంగముల పైఁ జంచద్భుజాభీలతన్
దర్పం బేర్పడ నొక్కపెట్ట యటు లా దైతేయవీరు ల్దిశా
సర్వద్దీప్తిసటాజటాలపటుశస్త్రవ్రాతముల్ సాంద్రమై
యూర్పోకుండఁగ నించిరన్ మురహరుం దుద్దామకోపాగ్ని యై. 17

చ గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దారభీ
షణముగ నుప్పతిల్లి రభసంబుగ రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట సురాతిబలంబులఁ గప్ప శార్ఙ్గని
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్. 18

క. అరదములు రథికవరులును, హరిసారథికేతుసహితమై పొడిపొడి గాఁ
గరులును జోదులు డొల్లఁగఁ, దురగంబులు రావుతులును దుత్తునియలు గాన్.

క. ఏయుచుఁ గౌమోదకిఁ గొని, వ్రేయుచు నందకమునను వివిధగతిఁ దునియల్
సేయుచు మధుమథనుఁడు దై, తేయతతిం గూల్చె నుద్ధతిం బడలుపడన్. 20

చ. అడరినమేఘపంక్తి విరియం బటువేగమహానిలంబు బ
ల్విడి భయదప్రకారముగ వీచు తెఱంగున దైత్యసైన్యముల్
సెడి నలుదిక్కులం బఱవఁ జేసి యమందవిజృంభణంబునం
బిడుగులపిండు బిట్టులియు పెల్లున విష్ణుఁడు శంఖ మొత్తినన్. 21

ఆ. పాఱలేక చాలుపడ డొల్లె భటకోటి, కరులు గిరులు గూలుకరణి మ్రొగ్గె
ఘోటకంబు లెల్లగుండియ లవిసి శో, ణితముఁ గ్రక్కె శంఖనిస్వనమున. 22

చ. తదవసరంబునం బెలుచఁ దాఁకి సుమాలి యుపేంద్రుపైఁ బటు
ప్రదరము లభ్రమద్రిశిఖరంబును వారిని ముంచినట్లు పె
ల్లిదముగ నేసె దైత్యులు చలింపక సంగరకాంక్షఁ గ్రమ్మఱం
బొదువ సహోదరు ల్ప్రియమదపూరితచిత్తులు గా సుదగ్రుఁడై. 23

క. వనజాక్షుఁడు దరహాసం, బునఁ బొదివినకినుక వక్త్రమున మునుఁగువడం
దునిమెను లీల మెఱుఁగ్ర, క్కున నాతనిసూతుశిరముఁ గ్రూరాస్త్రమునన్. 24

ఉ. సారథి వడ్డ నశ్వములు సంచలతం బెనఁగాడి యీడ్చినం
దేరను వేది యగ్రజుఁడు ద్రిప్పికొనం గని మాలి యడ్డమై
బోరన వచ్చి యవ్విహగపుంగవకేతను నేసె నెంతయుం
గ్రూరము లైనయమ్ములను గుర్వుగ దానవు లుత్సహింపఁగన్. 25

ఉ. మాలిశరంబు లొక్క మొగిమించుక గప్పినమాడ్కిఁ గప్పుడుం
గూలఁగ నేసె వానిరథఘోటములన్ హరి వాఁడు గ్రక్కున
న్శైలతటంబు డిగ్గుమృగనాథుక్రియన్ గద పుచ్చికొంచు నా
భీలగతిన్ రథంబు డిగి భీమజవంబున నంట నార్చుచున్. 26

క. పఱతెంచి కదియఁబడి యే, త్తెఱ వ్రేసిన మోము దాఁకి తిరిగె గరుడి య
త్తఱిఁ జక్రంబున హరి పెడ, మఱి వైచెను దనుజానుజమస్తకము దెగన్. 27

మాల్యవంతుఁడు విష్ణువున కోడి పాతాళముఁ జొచ్చుట.

శా. మాలిం జంపిన మాల్యవంతుఁ డుదితామర్షప్రకర్షంబునం
గాలాగ్నిప్రతిమానుఁడై నిజభుజాగర్వంబు మై లీల నున్
మీలజ్జ్వాలకరాళశక్తిఁ గొని మే మే తాఁకి వక్షస్స్థలిం
గీలించెం జలదంబుపై మెఱుఁగుమాడ్కిన్ శౌరికిం జెన్నుగాన్. 28

క. ఆశక్తియె కొని క్రమ్మఱఁ, గేశవుఁ డసురేంద్రు వైవ గిరిపైఁ బడుతీ
వ్రాశనిచాడ్పున వక్షో, దేశంబునఁ బడిన నొచ్చి ధృతి వాటించెన్. 29

ఆ. మూర్ఛవోక నిలిచి మూఁడుమొగంబుల, శూల మెత్తికొని కరాళవృత్తి
నడచి నెమ్మొగమునఁ బొడిచె నింద్రానుజు, దేవతలమనంబు దిగ్గనంగ. 30

క. పొడిచి పిఱిఁది దెసకయి పో,యెడిదానవు ప్రేసె గద మహీధరుఁడు గడున్
వడిఁ బక్షంబులఁ బొరిఁబొరి, నడిచెను విహగాధిపతియు నత్యుగ్రముగాన్. 31

సీ. గద దాఁకి మూర్ఛిల్లి గరుడునియెఱకలగాలిచే దవ్వుగఁ దూలిపోయి
తెప్పిఱి లేచి నల్దిక్కులు గనుఁగొని పాఱియుఁ జచ్చియు బయలుపడ్డ
బలములోపలఁ జేయఁ గలవారి బంధుల దొరలను గానక బరవసంబు
దక్కి తమ్ముండును దాను నొండొరువులఁ జూచుచున్నంతనె వీచె గరుడి

ఆ. పక్షమారుతమునఁ బరిపరి యైనయా, సేనతోడఁ గూడి దానవేంద్రుఁ
డాకులముగఁ జొరుపుటాకులచాడ్పునఁ, ద్రిప్పికొనుచు నెగసి తెరలి పఱవ 32

క. అమ్మెయిని నోడి తానుం, దమ్ముఁడు హతశేష మైనదానవబలముం
గ్రమ్మఱ తమవచ్చినమా,ర్గమ్మునఁ బాఱెను విహంగగమనుం డెగవన్. 33

మ. కడువేగంబున లంక కేఁగి తనుదోర్గర్వంబు దైత్యారిచేఁ
బడి భంగంబునఁ బొందినన్ భయభరభ్రాంతాత్ము లై యందునుం
దడయన్ బెగ్గిలి బృంద మెల్లఁ గొని పాతాళంబు క్రింవం జొరం
బడి రా దేవమునీంద్రకోటికి ననల్పప్రీతి సంధిల్లఁగాన్. 34

అగస్త్యుఁడు రామునకు రావణాదులకథ దెల్పుట.

క. వనజాక్షుఁ డొకఁడు వెలిగా, దనుజుల నెవ్వరికి గెలువఁ దలఁపఁగ నగు నిం
ద్రుని కప్పుడు తమ్ముఁడ వై, తనయుఁడ వైతిపుడు నీవు దశరథపతికిన్. 35

ఉ. సత్త్వరజస్తమోగుణవశస్థితిఁ గైకొని నీవ లీల బ్ర
హ్మత్త్వము దాల్చి లోకముల కన్నిటికిన్ జననం బొనర్తు వి
ష్ణుత్త్వము దాల్చి వానికి మహోజ్ఞతమస్థితి వృత్తిఁ జేర్తు రు
ద్రత్త్వము దాల్చి వాని కుచితంబుగ సంహృతిఁ గూర్తు రాఘవా. 36

ఉ. సాధులఁ గావ దుష్టజనసంహరణం బొనరింప ధర్మముల్
బాధలఁ బొందకుండఁ బరిపాలనసేయఁ దలంచి యాత్మమా
యాధృతిఁ బుట్టువుం బనుల నాదర మొప్పఁగఁ దాల్చి పొల్పుటన్
మాధవ మర్త్యుఁ డండ్రు నిను మందమతుల్ భవభావరూఢు లై. 37

తే. అధిపతి సాలకటంకటులనఁగఁ జనిన,నాఁటివారుఁ బౌలస్త్యులనాఁగఁ బరఁగు
నేఁటివారు సమానులు నిక్కమరయ,బాహుబలమున నాహవదోహలమున.

మ. అనినన్ రాఘవకుంజరుండు మునినాథాగ్రేసరుం జూచి యి
ట్లనియెన్ మాల్యవదాదివృత్తము ప్రసంగాధీన మై పుట్టె నే
మును మీచే విను రావణాదులకథల్ముట్టం బ్రశంసింపఁ డా
తనిఁ దత్సోదరులం దనూజు వినఁ జిత్తం బుత్సుకం బయ్యెడిన్. 39

ఆ. రాముఁ డిట్టు లడుగ నాముని సెప్పెఁ బా, తాళభువనమున మదం బడంగి
యున్న యాసుమాలి యొకనాఁడు సౌందర్య, వినయమహితదనదుతనయఁ జూచి.

ఉ. రూపగుణంబులందు ననురూపత గల్గువరుండు దీనికిం
జేపడు నొక్కొ పుత్త్రులఁ బ్రసిద్ధులఁ బల్వురఁ గాంచు నొక్కొ ల
క్ష్మీపరిణామహృద్య మగుజీవన మక్కట గల్గు నొక్కొ యి
ప్పాప మదన్వయక్రమముఁ బాత్రముఁ జేయు నొకో పొగడ్తకున్. 41

క. ఈలోకంబున నరసితి, మే లెల్లెడ వరునిఁ గాన మేదిని కరుగం
జాలక యున్నను బోవదు, బాలికఁ గొని పోవ వలయుఁ బరిణయమునకున్.

మ. అని యుల్లంబున నిశ్చయించి సుకుమారాకార నాకైకసిం
గొని వేడ్కన్ మహి నెల్లెడం దిరిగి రక్షోనాథుఁ డెం దైన న
ల్లునిఁ గల్యాణగుణోత్తరుం బడయ కెట్లుం బోవఁ బో మ్మంచు న
ల్లనఁ జేరెం దపుపోతకాంత మగుపౌలస్త్యాశ్రమోపాంతమున్. 43

ఆ. అచటఁ గనియెఁ దండ్రి నతిభక్తి వీడ్కొని, ఘనవిమాన మెక్కి యనుపమాన
మహిమ వెలయఁ బురికి మగుడఁ బోవఁగ ధనా, ధ్యక్షు రుచిరహారధవళవక్షు.

క. కనుఁగొని సుమాలి యితనిం, గనుమునిచంద్రునకు నిత్తుఁ గన్నియ నని సం
జనితకుతూహలుఁ డై య, వ్వనితకు ని ట్లనియె గారవంపుఁబలుకులన్. 45

చ. తగినవరుండు నీకు వనితా విను విశ్రవసుండ యాతఁ డా
ర్యగుణవిభాసి యమ్మునిజనాధిపుపాలికి నీవు వోయి యిం
పుగ వరియింపు నీకనిన పుత్త్రులచేత మదన్వయంబు రూ
పగు నిదె చూచితే ఘనుఁ దదాత్మజు నుజ్జ్వలవైభవోన్నతున్! 46

ఉ. నా విని తాను మున్ మనమునం దలపోయువిధంబ తండ్రి సం
భావనఁ జెప్పినన్ వికచపద్మవిలోచన సంతసిల్లి యేఁ
బోవుట యుక్త మేని మునిపుంగవు నాశ్రమ మెద్ది పోదునే
నావుడుఁ జూపి సమ్మదమునన్ సుత వీడ్కొలిపెన్ సుమాలియున్. 47

క. చని కైకసి పౌలస్త్యుం, గని వినయవిలాసభయవికాసవ్రీడా
జనితవికారసుభగనిజ, తనులత వెడ వ్రాలఁ జతురతం బ్రణమిల్లెన్. 48

ఆ. మ్రొక్కి నిలిచి యతని ముందట మేదిని, నంగుటమున నొరయుచున్నఁ జూచి
యెచటనుండి రాక యెవ్వనిసుత వేమి, పనికి నిందు వచ్చి తనిన నదియు. 49

ఉ. ఏను సుమాలికూఁతుర మునీశ్వర మిమ్మిటఁ దండ్రి పంపునం
గానఁగ రాక యంచు ననుఁ గాంతి దలిర్చెడిమోము వాంచుచుం
దా నటఁ జెప్ప లేమి విదితంబుగఁ జెప్పుట యైన నంకుర
శ్రీనినుపారె విశ్రవసుచిత్తలతం గరుణాస్వరూప మై. 50

క. ముని యమ్మానినియింగిత,మును నెఱిఁగియు దివ్యబోధమున నేర్పడ నె
ల్ల నరసి యల్లనినగవున, మునింగి మృదుమధురవాక్యముల ని ట్లనియెన్. 51

చ. జనకుఁడు గోరి నిర్మలవిచారమునం దగ నిశ్చయించి ని
న్ననుమతిసేయ నీవును బ్రియంబున నియ్యెడ కేగుదెంచు టె
ల్లను నగు నాదెసం దనయలాభముఁ గోరితి వియ్యకొంటి నే
ను నకట వేళ క్రూరము తనూజులఁ గ్రూరులఁ గాంతు కామినీ. 52

చ అనవుడు మీకృపం బడయు ౹ నాత్మజు లుగ్రులు గాఁగఁ బాడి గా
దనవుడు నీదుసంతతికి ౹ నంతకుఁ గొండొకవాఁడు శాంతుఁ డై
వినయవివేకధర్మముల ౹ విశ్రుతబుద్ధి వహించు మత్కులం
బును భవదీయవంశమును ౹ బూతము సేయు సరోజలోచనా. 53

క. అని యూఱడించి ముని య,వ్వనితం గైకొనియె నదియువల్లభుచిత్తం
బునకుఁ దగుచరిత మున్నన, గని సంతస మంది కొంతకాలంబునకున్. 54

క. పదితలలుం గోఱలు నిరు,వదిచేతులు నిరులు గవియు ౹ బలుమేనును గెం
పాదవినయనంబులు న్మ,న్మద మగుహృదయంబుఁ గలతనయునిం గాంచెన్.

ఆ కనినయప్పు డచటఁ ౹ గడు నుగ్ర మగురక్త,వృష్టి గురిసె నుల్కలష్టదిశలఁ
బడియెవఱళులఱచెఁ ౹ బిడుగులుర్వినిబడి,మ్రోసెగాడ్పుసుడిసమానెనినుఁడు.

క. మునివరుఁడు వికటుఁ డగుతన,తనయుకడకు వచ్చి వదనదశకంబు గనుం
గొని వానికి దశవదనుం,డనియెడునామం బొనర్చె ౹ నాసుతుపిదపన్. 57

సీ. అధికప్రమాణసర్వాంగఘోరాకారుఁ గుంభకర్ణుం డనుకొడుకుఁ గాంచె
దంష్ట్రాపరస్పరతాడనరచితసంకుల శూర్పణఖ యనుకూఁతుఁ గనియె
నిట్టిసంతతిఁ గన్న ౹ యిమ్మహాపాతకంబునకుఁ బ్రాయశ్చిత్త ౹ మనఁగఁ బ్రీతిఁ
బడసె విభీషణుఁ ౹ బావనోజ్జ్వలమూర్తిఁ గైకసి మునికృపాగౌరవమున

ఆ. నిట్లు పుట్టి పెరుఁగునెడఁ బంక్తిముఖకుంభ,కర్ణు లెందుఁ గ్రూరకర్ము లగుచుఁ
దిరిగి జంతువుల వధింతురు ధర్మసం,ప్రీతిఁ బరఁగు నవ్విభీషణుండు. 58

ఆ. అంత నొక్కనాఁ డనంతవైభవముతో, ధనదుఁ డేగుదెంచి ౹ తండ్రిపాల
గారవమున నున్నఁ ౹ గైకసి గనుఁగొని, చిన్నవోయి కొడుకుఁ ౹ జేరఁ బిలిచి.

క. ఇతనిమహాసంపద చూ,చితె మీ రొక్కనిక పుట్టి ౹ శ్రీతేజములం
దితఁ డిట్లుండఁగ నీ వి, ట్లతిహీనత నున్నఁ బురుషుఁ ౹ డండ్రే నిన్నున్. 60

మ. తను నిట్లాడినతల్లిమాటలకు మాత్సర్యంబు చిత్తంబునం
దనరంగా దశకంధరుం డనియె నుత్సాహంబు వాటించి యీ
తనితో సాటి యనంగ మే లన నమందశ్రీవిలాసంబు నే
కొని యీలోకము లెల్ల నేలుదును నీకుం జింత యింతేటికిన్. 61

# తృతీయాశ్వాసము.

### రావణాదులు తపం బొనరించుట.

క. అని గోకర్ణమునకుఁ జని, యనుజన్ములుఁ దాను నెదలనజు నిలిపి తపం
బొనరించి రత్తెఱం గొనరను జెప్పెద నీవు వినుము । రఘుకులతిలకా. 62

సీ. వేసవి గనగనవేఁగుచట్రాతిపై నగ్గి నల్గడ నుండ । నర్కుఁ జూచి
వానకండువను దివారాత్రములు జలధారల బయళులఁ । దడియు చుండి
సీతునఁ బెనుమంచు । శిరముపైఁ గురియంగ నిష్ఠఁ గుత్తుకబంటినీర నిలిచి
ఫలముల వేళలఁబత్రంబులను నీళ్లలను గాలిఁ గాలంబు । దనరఁ గడపి
ఆ. కుంభకర్ణుఁ డిట్లు । ఘోరంబుగాఁ బది,వేలవత్సరములు । సాల నియతి
మునిగణంబు సిద్ధజనమును నెఱఁగంది,తన్నుఁ దగిలి పొగడఁ । దపము సేసె 63

తే. ఏకపదమున నైదువే లేఁడు లుండి,యూర్ధ్వబాహుఁడై మోమెత్తియుండెఁ బిదప
నైదువేలేండ్లు లిట్లు మహాతపంబు, ప్రియము గుందక చేసె విభీషణుండు. 64

చ. అనుజులనిష్ఠ మెచ్చక దశాననుఁ డుగ్రతపఃకుతూహలం
బునఁ ద్రిజగంబులం బొగడు । పొంపిరివోవ సహస్రవర్షముల్
సన నొకమస్తకంబుగ నశంకతఁ దొమ్మిదివేలఁ దొమ్మిదిం
దునిమి హుతాశనుం దలలఁ । దృప్తునిఁ జేసె నజుండు మెచ్చఁగన్. 65

క. క్రమమున దశముఖుఁ డొగినొ,క్కముఖము చిక్కంగఁ బెఱముఖము లన్నియు న
గ్నిముఖంబున వేల్చియుఁ జి,త్తమునం దొకకొంకు లేక । తద్దయు నెమ్మిన్. 66

### రావణునకు బ్రహ్మ వరంబు లిచ్చుట.

చ పది యగువేయి నిండుటయుఁ । బంక్తిముఖుండు మనంబునన్ ముదం
బొదవఁగ నిర్వికారమున । నున్న శిరంబును గోయఁ జూచినన్
వదనచతుష్టయం బలర । వారిజసంభవుఁ డేగుదెంచి క
ట్టెదుర వరంబు వేఁడు మిదె । యిచ్చెద మెచ్చితి నంచు నిల్చినన్. 67

క. ధరఁ జాఁగి మ్రొక్కి దశకం,ధరుఁడు వినయ మొప్ప నిలిచి । తఱుగనితలపై
వెరవునఁ దనకరపద్మము, లిరువదియును మొగిచి యల్ల । నిట్లని పలికెన్. 68

శా. దేవా విన్నప మాదరింపుము భయోద్రేకంబునన్ మృత్యువుం
గావం గోరు బహుప్రకారముల లోకం బంతయుం గావునన్
దేవవ్రాతవియచ్చరప్రకరదైతేయవ్రజాదిక్రియన్
జా వేరూపున నాకు లే కునికి యిష్టం బాశ్రితశ్రీకరా. 69

క. ఏ నాబలవిరహితు లగు, మానవులను సరకుసేయ । మది నెన్నఁడు నీ
యానయె జగతిం దక్కటి, హీనపుజాతులకు వెఱతునే పరమేష్ఠీ. 70

చ. అని తను వేఁడినన్ సరసిజాసనుఁ డవ్వర మిచ్చి యొక్కమో
మున వినయావనమ్రుఁ డయి । ముందట నిల్చినపంక్తికంధరుం

గనుఁగొని క్రమ్మఱం దలలు గ్రక్కునఁ గల్గ ననుగ్రహించి ప్రీ
తి నొసఁగె నుజ్జ్వలంబు లగుదివ్యశరంబులుఁ గామరూపమున్. 71

క. వెల్లువ ముంచి పిదప నీ, రెల్లను వెస డొంకఁ గొలన నెసఁగెడుచంచ
త్ఫుల్లారవిందముల క్రియ, నల్లన వదనములు దోఁచె నాశ్చర్యముగాన్. 72

విభీషణునకు బ్రహ్మ వరంబు లిచ్చుట.

మ. అజుఁ డిట్లద్భుతభంగిఁ బంక్తిముఖు నన్వర్థాభిధానోజ్జ్వలుం
ద్రిజగద్వీరునిఁ జేసి దుష్కరతపోవీక్షాప్రవృత్తిప్రకా
రజితాత్ముం దగునవ్విభీషణు వరప్రాప్త్యున్నతుం జేయఁగా
నిజబుద్ధిం దలపోసి వానిఁ గరుణాస్నిగ్ధాత్ముఁడై చూచుచున్. 73

తే. ధర్మనియతికి మెచ్చితిఁ దపముపండె, వత్స నీమది వలసినవరముఁ గోరు
మనిన భయభక్తిసంభ్రమహర్షభరిత,హృదయుఁడై యతఁడాతని కిట్టులనియె.

ఉ. ప్రీతుఁడ నంటి నాతపము పెంపున నీవల దీని కగ్గలం
బై తగుకోర్కియుం గలదె యైనను గోరెద నామనంబు ధ
ర్మేతరవృత్తికిం జనమి యిష్టవరం బగుధర్మవర్తులై
పూతగుణాభిరాము లగుపుణ్యులకుం సులభంబు లెవ్వియున్. 75

క. అనుపలుకుల కచ్చెరువడి, దనుజులలోఁ బుట్టి నీవు ధర్మంబు మనం
బునఁ గోరుట యరు దిచ్చితి, నని యజుఁ డమరత్వమును నిజాస్త్రము నిచ్చెన్.

కుంభకర్ణుని తపఃఫలము.

ఆ. ఇవ్విధమున శంభుఁ డవ్విభీషణుఁ బ్రీతుఁ, జేసి కుంభకర్ణుఁ జేరఁ బిలువఁ
దలఁచు టెఱిఁగి దేవతలు దేవ విన్నప, మవధరింపుఁ డనుచు నజునిఁ జేరి. 77

సీ. అప్సరోగణము విహారంబు సలుపంగఁ దునిమెఁ బెక్కండ్ర నందనమునందుఁ
దపములు సేయ మందరకుధరంబులో నురవడి మునులఁ బల్వుర వధించె
నిల నెల్లయెడల ననేకభూసురులు యాగము లొనరింపఁ బ్రాణములు గొనియెఁ
దెరువుల నరుగంగ నరికట్టి చంపె నాబాలవృద్ధంబుగా బహుజనముల
తే. వేచి యాహారమున కనివేడ్క కనియు, నఖిలజీవుల నిట్లు నిత్యంబు సమయఁ
జేయు నీవరమున నిప్డు సిద్ధుఁడయిన, నితఁడు సైరించునే లోకహితవిచార.

క. కావున నీతని మోహితుఁ, గావించుట జగము లెల్లఁ గాచుట సుమ్మీ
నావుడుఁ దలఁపున భారతి, రావించిన వచ్చుడును సురజ్యేష్ఠుండున్. 79

ఆ. అసురమోమునందు వసియించి నను నిద్ర, యడుగు మనిన వాణి యట్ల చేయు
దాన ననుచుఁ జనియె దానవుఁ బిలిచి నీ, కాంక్ష సెప్పు మనియెఁ గమలభవుఁడు.

క. నిద్ర దయసేయు మనియె సు,రద్రోహియు నమరవరులు రదనాంకురచం
చద్రుచులు నిగుడ నవ్వుచు,భద్రము మా కదియె యనఁగఁ బద్మజుఁ డిచ్చెన్.

క. ఆనేర్పుతోన వెసఁ జతు,రాననుఁడును సురలు సరిగి రవ్వాణియు దై
త్యాననముఁ బాసి పోయెను,దానవుఁడుఁ దలంచుకొని వృథాచింతనుఁ డై. 82

క. ఏరూపున నే ని ట్లని, కోరితి నిది యేమి యొక్కొ కుత్సిత మయ్యెన్
ఘోరతప మెల్ల దీనికిఁ, గారణమా సురలవలని కపటము సుమ్మీ. 83

క. అని వగచుచున్న నాతనిఁ, గనుఁగొని ఖేదమునఁ బంక్తికంఠుఁడు నేరం
జనుదెంచి తానుఁ దమ్ముఁడు, ననునయ మొనరించి సముచితాలాపములన్. 84

క. కొనియాడిన నాఅవనెల,కును నొకదినమందు లేచుఁ గుడుపును గమనం
బును గల్గు నాఁడు పగతుర, కనిలోనన్ విజయుఁ డీతఁ డని యజుఁ డరగెన్.

క. వనజభవుచేత నివ్విధ,మున వరములు వడసి పంక్తిముఖుఁ డుద్ధతుఁ డై
యనుజులతో శ్లేష్మాతక,వనమున సుఖ ముండె దనుజవర్గము గొలువన్. 86

సుమాలిబోధనచే రావణుఁడు లంకను వశపఱచుకొనుట.

తే. ఇంతయును జెప్పవిని రాఘవేశ్వరుండు, మిగుల నచ్చెరువడి యటమీఁదవారి
చరిత మెట్లొకొ నావుఁడు ధరణిపతికి,నయ్యగస్త్యమునీంద్రుఁడి ట్లనియెఁ బ్రీతి.

సీ. కైకసి దీనికిఁ గడుసంతసంబునఁ దేలుచు నుండ సుమాలి తనదు
దౌహిత్రుఁ జూడఁ బాతాళలోకంబున నుండి మారీచమహోదరులును
నవ్విరూపాక్ష ప్రహస్తులు నాదిగా సచివులుఁ దక్కటిసైన్యపతులుఁ
గొలిచి రాఁ జనుదెంచెఁ గుంభకర్ణవిభీషణులు దోన చన దైత్యకులవిభుండు

ఆ. నెదురువోయి భక్తి నెరఁగి సమాలింగి,తాంగుఁ డై విభూతి యతిశయిల్లఁ
దననివాసమునకుఁ గొనిపోయి సముచితా,చారవిరచితోపచారుఁ డయ్యె. 88

క. వినయము దగఁ బాటించుచుఁ, దనపార్శ్వమునందు సముచితం బగురుచిరా
సనమున నాసీనుం డగు,మనుమనితో నిట్టు లను సుమాలి ప్రియమునన్. 89

శా. మావంశంబు ప్రసిద్ధిఁ బొందు హరి పల్లాఱున్ సురేంద్రాదులం
గావన్ దానవమర్దనంబు గడఁకం గావించుటల్ మాను నా
దేవానీకముత్రుళ్లడంగు విభవోద్రేకంబు శోభిల్ల దై
త్యావాసత్వముఁ గాంచు లంక భవదీయస్ఫారశౌర్యోద్ధతిన్. 90

శా. లంకాపట్టణ మేలి యే నసమలీలం గ్రాలి దేవేంద్రుసైఁ
గింకన్ దాడిగఁ బోయినన్ సురల రక్షింపంగ వేగంబ చ
క్రాంకుం డడ్డము వచ్చినం బెరలి దైన్యం బొంది పాతాళ మా
తంకం బేర్పడఁ జొచ్చి యం దడఁగి యుంటిదాఁకన్ వగం గుందుచున్. 91

క. ఉన్నంత నీవు గలిగితి, బన్నంబులు దలఁగ నింక బగఱ నొడుతు మీ
కిన్నరుఁడు రిత్త గాఁడిటు, గొన్న పురము మున్ను మగుడఁ గొనఁగావలయున్.

క. మాతామహుఁ డిటు దనకుం, జేతో ముద మంద నీతి సెప్పిన మదిలోఁ
బ్రీతుం డయ్యెను దశముఖుఁ, డాతనిచిత్తంబుచందమారయుబుద్ధిన్. 93

ఆ. ధనదుఁ డగ్రజుండు । తదధీన మగులంక, యాసపడుట యుచిత మగునె యనిన
నధికవినయమున మహామతి యైనప్ర,హస్తుఁ డిట్టు లనియె । నసురపతికి. 94

చ. తనయుఁడు తండ్రి యగ్రజుఁడు । తమ్ముఁ డనం జనునయ్య రాజ్యముల్
గొనునెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
యను వగునంతకున్ రిపు సుదగ్రత సైఁచిన నింక నూరకుం
డ నగునె వేగ పోరికిఁ గడంగుము నీభుజదర్ప మేర్పడన్. 95

క. విను మున్నదితియు దితియును, ననఁ గశ్యపుభార్య లిరువు । రప్పాచెల్లెం
డ్రనిమిషుల నసురగణముం, గని రయ్యిరుదెఱఁగుఁ బగలు । గారే తమలోన్.

ఉ. దైత్యులు దర్ప మెక్కి వసుధాతల మంతయుఁ దారవిక్రమా
ద్ధత్యమునం గొనం గని మదం బడఁగించి రసాతలైకసాం
గత్య మొనర్చె విష్ణుఁ డటు । గావున వారలతోడివైర మా
చిత్యవిహీనమే తడవు । సేయకు దాయకు నల్గు మిత్తఱిన్. 97

తే. ఇట్లు పలికినపలుకుల । కియ్యకొని సు,మాలి సంధియ మేటికి । మాకు నెల్లఁ
బ్రభువ వీవ లంకాపురపతివి నీవ,పనుపు మొకదూత నాతనిపాలి కనిన. 98

చ. ధనదునియొద్ద కేగి యుచితంబుగఁ బల్కి పురంబుఁ బాసి పొ
మ్మని మును చెప్పు కోఱడము । లాడిన మద్భుజశక్తి యంబుజా
సనవరశక్తిమూలబలశక్తియెఱుంగఁగఁ జాటి చెప్పి ర
మ్మని చతురాభిభాషణుఁ బ్రహస్తునిఁ బుచ్చె సురారి లంకకున్. 99

చ. చని యతఁ డాతనిం గని యసంభ్రముఁ డై సమయోచితంబుగా
వినయము సేసి దేవ యొకవిన్నప మిప్పుడు తొల్లి దైత్యవం
శనిజనివాస మానదుమ । శార్ఙ్గికతంబునఁ బాసి పోయి రా
దనుజుల దిప్డు నీయనుఁగుఁదమ్ముఁడు గ్రమ్మఱ నిన్ను వేఁడెడున్. 100

క. దశవదనుం డనుజుం డను,యశ మల్పమె నీకుఁ గిన్నరాధిప రక్షో
వశముగ లంక విడిచి యస,దృశబంధుప్రీతి సేయు । దృఢముగ ననినన్. 101

తే. పురమునకఁ గాదు నాదగుసిరికిఁ బరిజ,నమున కొరులెవ్వరొడయులు నాకు నేఁడు
గడయు నాకూర్మితమ్ముఁడ కాక దీని, కడుగ నేటికి రమ్మను । తడయ కిపుడ.

క. అని యతనికి సాదరభో,జనవిధి యొనరించి వస్త్రచామీకరవా
హనభూషణాదివస్తువు, లనేకములు ప్రీతి నొసఁగి । యానన మలరన్. 103

క. తగ వీడుకొలిపి ధనదుఁడు, వగ మనమునఁ గూర విశ్రవసుపాలికి శీ
ఘ్రగతిం జని యమ్మునిపద,యుగళంబున కెరఁగి సవినయోక్తిపరుం డై. 104

చ. అమరవిరోధిపంపునఁ బ్రహస్తుఁడు లంకకు వచ్చి నాకుఁ గా
ర్యముఁ దగఁ జెప్పినట్లు పుర । మాతని కిమ్మని యాడె నాడినన్

సముచితమైనచందమునఁ జక్కనిమాటల బాంధవంబుతో
నమగుడ వానిఁ బుచ్చి మునినాయక మీ కెఱిఁగింప వచ్చితిన్. 105

తే. ఏమిపురుషార్థములుఁ జేయునెడలనెపుడు, మీయనుజ్ఞయనాకుసహాయమగుట
నరసి మీదివ్యచిత్తాన నవధరించి, చేయఁగలపని యెయ్యది చెప్పుఁ డనిన.

శా. మున్నీకార్యము వాఁడు నన్నడిగినన్ మో మీక కోపించి మీ
యన్నం బుణ్యచరిత్రు నేన మును లంకాధీశ్వరుం జేసితిం
జన్నే వానిపరాభవంబునకు నుత్సాహంబు సేయంగ నీ
కన్నన్ మోములు గంటువెట్టుకొని రోషాయత్తుఁ డై యత్తఱిన్. 107

ఉ. దిగ్గన లేచి పోయి గణుతింపక వాఁడు విరోధలబ్ధికై
యగ్గలికంబునన్ మనలనందఱఁ జీరికిఁ జేకొనండు స
మ్యగ్గురుభక్తిధర్మరుచిమాన్యవివేకము లెంతదవ్వు నీ
కెగ్గొనరింప కుండఁ బుర మిచ్చి తొలంగుము చాటి చెప్పితిన్. 108

సీ. ఇంద్రాయుధద్యుతు లెసఁగఁ జూడ్కికి రమణీయంబు లైనమణిస్థలములు
సిద్ధగంధర్వాదిసేవ్యంబు లైనయచ్ఛోదకంబులఁ జెలువొందునదులుఁ
బల్లవపుష్పసంపద లుల్లసిల్లంగ రమ్యంబు లైనయారామములును
నంబుజమధుమత్తహంసికావితతుల రుచిరంబు లయినసరోవరములుఁ

ఆ. గలిగి యొప్పు మిగులఁ గైలాసశైలత, టంబునందుఁ బురవరంబుఁ జేసి
కొని వసింపు మచట ననుచరసహితమై, దివ్యభోగలీల దేజరిల్ల. 109

క. అని విశ్రవసుఁడు చెప్పిన, విని వైశ్రవణుండు లంక విడిచి పరిజనం
బును దాను రజతగిరికిం,జని యొకపుర మలక యనఁగ సంపాదించెన్. 110

### రావణుఁడు లంకం బ్రవేశించుట.

తే. అంత నక్కడ మగుడఁ బ్రహస్తుఁ డరుగు
దెంచి విత్తేశుఁ గాంచినతెఱఁగు నచటఁ
దాను బల్కినక్రమమును దాని కాతఁ
డన్నచందంబుఁ జెప్పె దశాననునకు. 111

క. విని యయ్యవిచారంబులు, దన కేటికి వెడలుఁ గాక దాడిమెయిం బో
యిన గాసిఁగాఁడె యింతక, చనుఁ జూ వెఱచునఁట నిలువ సందియ మేలా.

మ. అని బాహాబలగర్వనిర్వహణవిద్యాపారగుం డైనయా
దనుజాధీశుఁడు వైర మెత్తి బలముం దానున్ వెసం బోయి పో
యి నిజావాసముఁ బాసి విత్తపతి పోయెం బోయె నా వించుఁ బే
ర్చినయాద్ధత్యము నిత్య మైన విజయశ్రీవిభ్రమోద్భాసి యై. 113

ఉ. లంకకు నేగి రాజ్యసుఖలంపటుఁ డై యభిషేకమంగళా
లంకృతమూర్తిఁ జేకొని చలంబు బలంబును నుల్లసిల్ల ని

శ్శంకత రాక్షసాన్వయభుజావిభవం బలరఁ జగద్భయం
బంకురితంబు చేసెఁ దొలఁ గాడెడువీరరసంబు పెంపునన్. 114

తే. ఇట్లు లంకాపురము వేడ్కఁ నేలె సకల
దనుజలోకంబు సేవింప ననుజసహిత
ముజ్జ్వలశ్రీసమేతుఁడై యుల్లసిల్లు
చుండె యాదశకంధరుఁ డొక్కనాఁడు. 115

శూర్పణఖకుఁ బెండ్లి సేయుట.

క. దర్పోన్ముఖయౌవనకం, దర్పాస్త్రసముజ్జ్వలాంగిఁ దనచెలియలి నా
శూర్పణఖఁ జూచి యోగ్యవ, రార్పణసమయ మని తలఁచి యనుజన్ములతోన్.

ఆ. కాలకేయవంశకరుఁడు విద్యుజ్జిహ్వుఁ, డతులబలుఁడు సుందరాంగుఁ డతని
కిత్త మెల్లభంగి నిత్తన్వి నని తగ, నాడి కార్యనిశ్చయంబు సేసి. 117

క. దనుజపతి యున్ననగరం, బునకుం దగువారినపుడ పుచ్చి యతని రాఁ
బనిచి సబహుమానంబుగ, నొనరించెం బరిణయము మహోత్సవలీలన్. 118

ఆశ్వాసాంతము.

చ. నిరుపమమూర్తి వైరిరథినీసమవర్తి వివేకవైభవ
స్ఫురితవిచారుఁ డుజ్జ్వలయశోమణిహారుఁడు ధర్మసంగ్రహా
దరపరతంత్రుఁ డార్యజనతామతమంత్రుఁడు వంశవారిజా
కరనవసూర్యుఁ డస్ఖలితగౌరవవర్తనధుర్యుఁ డిమ్మహిన్. 119

క. కవిలోకవనవసంతుఁడు, యువతీనూతనజయంతుఁ డుదయానంతుం
డు వినయధనవంతుఁడు దా, నవినోదైకాంతుఁ డమలమనస్స్వాంతుఁ డిలన్. 120

మాలిని. అమరశిఖరిహేలాహారిధైర్యుం డవార్యా
క్రమభుజబలదృప్తారాతిసంహారుఁ డంహ
శ్శమనవినుతిపాత్రాచారగణ్యుండు పుణ్యో
ద్యమవిరచితలోకాత్యంతహృత్పర్వుఁ డుర్విన్. 121

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిధేయ
తిక్కననామధేయప్రణీతం బయిన యుత్తరరామాయణం బనుమహాకావ్యంబు
నందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# నిర్వచనోత్తర రామాయణము



## చతుర్థాశ్వాసము.

రమణీయుఁ డుపాసక
నారాయణుఁ డాదిధరణినాయకసామ్యో
దారచరిత్రుఁడు కులని
స్తారకసంభవుఁడు మనుమజనపతి యెలమిన్. 1

### రావణకుంభకర్ణవిభీషణులు పెండ్లాడుట.

క. ఆదశకంధరుఁ డఖిలవినోదంబులఁ దగిలి నిత్యనూత్నవిహారా
మోదితుఁ డగు చుండి మృగవ్యాదరమున నేగి కాననాంతరభూమిన్. 2

క. ఒకమార్గంబున రా మయుఁ, డొకకన్నియఁ దాను నచట నొయ్యన చనుదే
నకుటిలశాంతోదాత్త, ప్రకృతి యగుట చూచి యెఱిఁగి రాక్షసపతియున్. 3

ఉ. గౌరవశాంతమూర్తిఁ దగఁ గైకొని మార్గము క్రేవ నిల్చి య
చ్చేరువఁ బోవ నద్దనుజుఁ జేరఁగఁ బోయి మహాత్మ యిట్లు కాం
తారములోనఁ బోకకుఁ గతంబును నీ లలితాంగిపేరు నీ
పేరును దీనిజన్మమును బ్రీతిఁ దగంగ నెఱుంగఁ జెప్పవే. 4

చ. అనవుడు నాతఁ డిట్లను మహాపురుషా! మయనామధేయుఁడన్
దనుజుఁడ హేమ నాఁ బరఁగుదానిఁ బయోరుహవక్త్ర నప్సరో
వనిత సమర్త్యు లిచ్చిన వివాహవిభూతివహించి నెమ్మి మైఁ
దనయుల నిద్దఱం గని పదంపడి కాంచితి నీతలోదరిన్. 5

తే. అగ్రతనయుండు మాయావి యనఁగ వాని
యనుఁగుఁదమ్ముఁడు దుందుభి యనఁగఁ బరఁగు
దీనిపేరు మందోదరి దేవ యిమ్మృ
గాయతాక్షికిఁ దగువరు నరయఁ దలఁచి. 6

మ. జగతిం గ్రుమ్మరువాఁడ నై కడఁగి యీచంద్రాస్యఁ దోకొంచు నే
ను గరం బుత్సుకవృత్తిఁ బోక యిది హృన్మోదంబు సంధిల్లె నీ
దగుసల్లాపరసంబు పెంపునఁ బ్రియం బంతంతకుం బేర్చున
ట్లుగ నీయన్వయనామధేయములు విండుం జెప్పు నా కేర్పడన్. 7

క. నావుడు ముద మంది యితం, డీవారిజనయన నాకు నీ నెదఁ గోరెం
గావలయు నని తలంచి మ,హావినయపరుండువోలె నతఁ డిట్లనియెన్. 8

క. నాకుం బ్రపితామహుఁ డా, లోకపితామహుఁడు తండ్రులుం బౌలస్త్యుల్
మీకె ననఁ బూన నేర గు,ణాకల్పా వేదములు చిరాభ్యస్తంబుల్. 9

ఉ. పేరు దశాననుండు కృప పెంపున నాదుతపంబుసొంపునన్
వారిజసంభవుం డొసఁగె వావిరి గ్గైనవరంబు లిప్పు డిం
పారెడులంక నాకు నెలవై మహనీయవిభూతి నుండుదున్
దారపరిగ్రహంబు నకృతం బిటముందట నన్నుఁ బ్రీతుఁ డై. 10

తే. క్రూరుఁ డగుట యెఱుంగక కోరి యిచ్చెఁ, గన్యనప్పుడమయుఁడుదకప్రదాన
సహితముగ వీటి కరిగి యుత్సవముతో వి,వాహమయ్యె నద్దానవవల్లభుండు.

క. తనసుతు లని యమ్మయు చె,ప్పినమాయావియును దుందుభియు సమరముఖం
బున వాలిచేత నీల్గుట, లినతనయుఁడు సెప్పె రఘుకులేశ్వర నీకున్ 12

క. ఒకయోధముఖ్యు నని నం,తకు నైనను గీటడంచు దాని నమోఘ
ప్రకృతి యగుశక్తి నిచ్చెను, వికసిల్లుచు మయుఁడు దనుజవీరాగ్రణికిన్. 13

క. కోరి వివాహం బయ్యెను,గారవ మెసఁగంగఁ గుంభకర్ణుఁడు దళదం
భోరుహలోచన యగున, వైరోచనికూఁతుకూఁతు వజ్రజ్వాలన్. 14

ఆ. సరమ యనులతాంగి శైలూషతనయఁ గ,పోలచంద్రబింబఁ బులినజఘన
హరిణశాబనయనఁ బరమోత్సవంబునఁ, బెండ్లియయ్యె నవ్విభీషణుండు. 15

మేఘనాదుని జననము.

క. పదపడి మందోదరి సమ్మదమున సుతుఁ గాంచె నాకౌకసులకు నెలుఁగున్
మదదిగ్దంతావళములు, బెదరఁ జెలఁగె మేఘనాద భీకరభంగిన్. 16

క. దనుజేంద్రుండును జిత్తం,బున నెంతయు సంతసిల్లి పుత్త్రకునిఁ గనుం
గొని మేఘనాదుఁ డనఁగా, ననురూపం బయిననామ మప్పుడు వెట్టెన్. 17

తే. పిదప నింద్రజి యనుపేరుఁ బెంపుఁ బడసె, నద్దశాననసందనుఁ డభిమతముగ
దానిఁ బదపడి చెప్పెద మానవేంద్ర,వినుము తరువాతికథలు సువిస్తరముగ.

ఉ. ఆసమయంబునన్ సరసిజాసను పెట్టినచొక్కు కుంభక
ర్ణాసురుమోమునం గదిరె నాతఁడు నగ్రజు వేఁడె గాఢని
ద్రాసుఖయోగ్యమందిరము రాక్షసవంశవరుండు నిచ్చెఁ గై
లాసమువోలెఁ బ్రాంశుధవళం బగునూత్ననికేతరత్నమున్. 19

క. అందు నివాసస్థానము,నం దల్ప మనల్పముగ నొనర్చిన నిద్రం
బొంది బహువత్సరంబులు, నిందితదురితాబ్ధిలో మునిఁగి యుండంగన్. 20

# చతుర్థాశ్వాసము.

## రావణుఁడు దేవతలు మొదలగువారిని బాధించుట.

శా. దేవోద్యానము లీల మైనఱకు బాధించు మ్మునిశ్రేణి నా
నావిప్రావలిఁ బట్టి తెచ్చి తిను జన్నంబుల్ సురస్త్రీలకుం
గావించుం గ్రతువైభవంబులకు విఘ్నం బాచరించుం దశ
గ్రీవుం డప్రతిమప్రతాపపరుషక్రీడాకలాకల్పుఁ డై. 21

సీ. మదమున నలిరేఁగి నదులు సొచ్చి కలంచి యాడు సుద్ధతగంధహస్తిలీల
బలమునఁ జెలఁగి కానల రేగి రూపఱ విఱచు మహావాతవిభ్రమమున
బెడిదంపుఁదనమునఁ గడఁగి శైలమ్ములు పొడిపొడి సేయు దంభోళిభంగి
నొడలి పెంపున వీచి జడనిధు లెక్కడెక్కడ వైచు మంథనగంబుకరణి
తే. గరుడగంధర్వయక్షకిన్నరులఁ గన్న, జెవులు వట్టి యాడించు నశేషలోక
భీకరము లగువిధములు పెక్కు సేయు, గర్వ మెదుగంగ నాదశకంధరుండు.

## కుబేరుఁడు దూతను బంపి రావణునకు బుద్ధి చెప్పించుట.

క. అత్తఱి నత్తెఱఁ గెల్లను, విత్తేశుఁడు గలయఁ గనియు వినియుం గరుణా
యత్తమతి యగుట దూతం, బుత్తెంచె దశాననునకు బుద్ధులు సెప్పన్. 23

క. చను దెంచి దూత ముందఱ, గనియె విభీషణు నతండుఁ గడు వేడుక న
ద్ధనపతి సేమ మడిగి పరి, జనముల వేర్వేఱ యడిగి సంభావించెన్. 24

ఉ. వచ్చినకార్య మారసి యవక్రచరిత్రుఁడు దానవేశ్వరుం
జెచ్చెరఁ గానిపించె నెడసేయక దూత వినీతవేషుఁ డై
చొచ్చి ధరాతలం బురము సోఁకఁగ నానతుఁ డై యుపాయనం
బిచ్చి కరప్రదర్శితమహిం దగ సంకుచితోపవిష్టుఁ డై. 25

శా. దేవా దేవరతోడఁ బుట్టువు కృతార్థీభూతచేతస్కుఁ డై
నీవిఖ్యాతికి సంతసిల్లు సహజస్నేహుండు నీయందు నీ
శ్రీ వెంపారుటఁ గోరు నీమహిమఁ బ్రార్థించు న్మదిం గావునన్
దేవేంద్రాదులచంద మొప్ప దని యుద్దేశించి నీయొద్దకున్. 26

తే. నన్నుఁ బుత్తెంచెఁ దనవచనములు గాఁగఁ, జెప్పుమని కొన్ని బుద్ధులు సెప్పి వాని
నవధరింపు మొకించుక యవసరంబు, నాకు దయ సేసి కార్యవివేకచతుర. 27

చ. జగములకుం బ్రతాపము ప్రశస్తముగాఁ బ్రకటించుమాత్రకుం
దగ వగు నిప్డు సేసినవిధం బిటమీఁద నిజాన్వయోచితం
బుగ నొనరింపు ధర్మము దపోవిభవంబునఁ గాదె యింత పెం
పు గనుట లంకకై మనకుఁ బుట్టినముందటిహాని సాలదే. 23

చ. మునిజన మెల్ల దుర్దశల ముచ్చిరి యుండుటఁ జూచి యప్సరో
వనితలయార్తిఁ జూచి క్రతువర్గముదైన్యముఁ జూచి నామనం

బనయముఁ దల్లడిల్లెడు ద।శానన దుష్టచరిత్ర మింక నై
నను నిది మాని సత్పథము।నం జను దూఱు లడంగు నంతతోన్.   29

తే. ఇంతకాలంబు నేఁ బోయి।హిమనగమున, శాంకరం బగుధర్మంబు।సలుపు చునికి
నెఱుఁగనైతిమగుడివచ్చి।యెల్లనెఱిఁగి, యెఱుఁగఁజెప్పితిహితము నా।యెఱిఁగినంత.

క. ఇది నా కానతియిచ్చిన, పదకము గలరూపు విన్న।పము సేసితి నీ
హృదయంబునఁ గైకొను మొం, డుదలంపులు దక్కు మనవు।డుం గుపితుం డై.

క. ఆతఁడు నీకుం దగు నీ, వాతనికిం దగుదు మీర।లక్కట దొరయుం
దూతయు నఁట వచ్చుటయుభ, యాతురతం గలిపి పోవ।నఁట యిది పోలున్.

ఉ. బుద్ధులు సెప్ప నెల్ల నటు।వోవఁగనిమ్ము ధనాధిపుం దప
స్సిద్ధికిఁ బోయి వచ్చె నని।చెప్పితి వత్తెఱఁ గెట్టి దంతయున్
శుద్ధిగఁ జెప్పు మన్న సుర।సూదనుపల్కులు చూడ నిట్లసం
బద్ధము లైనదూత యెడఁ।బాసియు దిట్టఁడు గాన నిట్లనున్.   33

ఉ. అర్థవిభుండు వోయి తుహి।నాద్రిఁ దపం బొనరింపఁగా విహా
రార్థము వచ్చినన్ గిరిసు।తాన్వితు నీశ్వరుఁ గాంచియున్ వర
ప్రార్థన సేయఁ డయ్యె నతఁ।డాతఁడు దానికి మెచ్చి యిచ్చె స
ర్వార్థవిధాయకం బయిన।యాత్మసఖత్వము నిశ్చలంబుగన్.   34

తే. వామపార్శ్వాభిగతు లగు।వారి తేజ, మడరి యద్దెసలోచన।మతని కపుడు
పింగళం బైనవారేక।పింగళుండ, వనఁగఁ బరఁగుము జగము।లనిరి ధనదు.

ఉ. అత్తెఱఁ గెల్ల నిట్టిద మ।హాత్మ శుభంబు సధర్మవృత్తి కా
యత్తము సూవె యిమ్మెయి న।హంకృతి సత్త్వము గాఁ దలంతురే
యుత్తము లక్కటా చెడుట।కోపక చుట్టము బుద్ధి సెప్పసం
జిత్తమునందు నీసరకు।సేయమి గర్వము గాక కర్జమే.   36

తే. అనిన నిరువదికన్నుల।నడరుకెంపు, పద్మవనగతబాలాత।పంబుఁ బోల
భ్రుకుటివికటలలాటవి।స్ఫూర్జదుగ్ర, కోపభీకరుఁ డగుచు ర।క్షోవిభుండు.   37

క. ఏమేమీ ననుఁ జెడు దని, నాముందటఁ గొంకులేక।నాలుకతుద కీ
వీమాట దెచ్చి తజువర, మేమిగఁ దలఁచితొకొ నీకు।నిది విధి యనుచున్.   38

క. కేసరము లదరుహరిక్రియ, మీస లదర లేచి దూత।మెడ దునియఁగ సిం
హాసనము కెలన నున్నమ, హాసి వెఱికి ప్రేసెఁ దమ్ముఁ।డడ్డము సొరఁగన్.   39

ఆ. ఆవులించుతలయు।నడరెడునట్టయుఁ, జూచి ప్రీతుఁ డగుచు।సురవిరోధి
యచటిడింభతతికి।నాఁకలిమడుపుగా, నిచ్చి యాగ్రహమున।నిట్టు లనియె.   40

శా. రక్షోవంశహితోపదేశ మనుపేరన్ వీనిఁ బుత్తెంచె శా
యక్షాధీశ్వరుఁ డీశుతోఁ దనకు సఖ్యం బైనతేజంబు రా

జ్యక్షోభంబుగ లంకఁ గొన్న మనయన్యాయంబు సెప్పక సురా
దిక్షుద్రవ్యవసాయహేతు వగుభీతిం జూపి జంకింపఁగన్. 41

ఉ. నిక్కము నట్ల కాన తగునీతిపరుల్పర లుక్కివంబునన్
మిక్కిలి యైనవారి నియమింపక తక్కుదురే ధనేశ్వరుం
డక్కట లెస్స సేసె నడియాస సెడన్ దిగధీశుఁ డొక్కఁడుం
ద్రిక్కక యుండఁ ద్రుళ్లడఁపఁ ద్రిమ్మరఁ బోవలసెం గ్రమంబునన్. 42

రావణుఁడు కుబేరునిపై దాడెత్తి పోవుట.

ఉ. కావున ముచ్చుముచ్చయలకాపుర మేర్చి ధనేశు నోర్చి య
క్షావలిపే రడంత మని యప్పుడ యుద్ధవిధిన్ సమగ్రనా
నావిధసైన్యభూరిభరనమ్రవసుంధరుఁడై పురీసరి
ద్గ్రావమహాటవు ల్గడచి రాజతశైలముఁ జేరఁ బోయినన్. 43

తే. యక్షులంతంతఁ జూచి ధనాధిపునకు, రాక్షసేశ్వరుసైన్యంబు రాక చెప్ప
నతఁడు గ్రక్కున సేన లాయితము చేసి, బరవసంబునదలపడఁబంచటయును.

క. ధనదుబలము దనుజబలము, ననువునఁ దలపడఁ గడంగి యార్చుచుఁ దాఁకెన్
ఘనఘోషభీషణము లగు,వననిధు లొండొంటితోడ వడిఁ దాఁకుగతిన్. 45

యక్షరాక్షసులయుద్ధము.

శా. జ్యానాదంబు నిశాతహేతిపటలీసంఘట్టరావంబు ఘుం
టానిక్వాణసమేతబృంహితము గాఢస్ఫారహేషాసము
త్థానోపేతఖురాహతధ్వనియు సాంద్రంబైన భేరీపటు
ధ్వానం బేర్పడ దయ్యె నయ్యెడ బలద్వంద్వంబునం దేమియున్. 46

ఉ. అందును నిందుఁ జేయఁగల యట్టిభటుల్ దలపడ్డ సైన్యముల్
గ్రందుగ నొక్కపెట్ట తమకంబునఁ బోరుట చూచి కైకసీ
నందనుఁ డిమ్మెయిన్ సరి పెనంగుట సైఁపక వచ్చి వీఁకఁ దాఁ
కెం దనమోములన్ వఱలఁ గీల లుదగ్రత వజ్రదంష్ట్రలై. 47

క. ఏటున వాటున వ్రేటునఁ, బోటున దశముఖుఁడు రౌద్రముగ నఱుముటయున్
లేటమొగముపడి యక్షులు, కోట సొరంబాఱె రసురకోటి యెగవఁగన్. 48

క. తోలుకొనిపోయి దనుజులు, కైలాసతటంబుబయలు గైకొనఁ జన నా
భీలశరనిహతి వారలు, గూలఁగ సంయోధకంటకుఁడు వడిఁ దాఁకెన్. 49

ఉ. ఏచినదైత్యసైన్యముల నెల్లను ద్రుళ్లడఁగించి యిట్లు శౌ
ర్యోచితలీలఁ గ్రాలి సమరోద్ధతి మైఁ దమసేనఁ జూచి చే
పీచుచు వచ్చుయక్షుఁ గని పీతభయుండు దశాస్యమంత్రి మా
రీచుఁ డుదగ్రుఁడై గిరి గిరిం దగ మార్కొనుమాడ్కిఁ దాఁకినన్. 50

క. ఇరువురశరజాలము లొం, డొరువురతురగములు సూతు లురుకేతనముల్
గరువలిక్రియఁ బడఁ గూల్చుచు, నెరగలిచిచ్చుగతిఁ గప్పె నిరువాఁగుపయిన్.

ఉ. యక్షుఁడు దానవుం గదిసి యార్చి దగం గద బిట్టు ప్రేసినన్
రాక్షసుఁ డీడఁబోక భిదురప్రతిమానమహాసి ప్రేసె ధూ
మ్రాక్షుఁడు నంతఁ గూడుకొని యాసురవృత్తిఁ దగంగఁ జేసె ను
గ్రక్షురికాక్షతిం బ్రతిముఖంబున రక్తనదీప్రవాహముల్. 52

ఉ. దానవవీరు లిట్లు ధనదప్రియభృత్యులఁ గిట్టి నొంచినన్
మానము డిగ్గఁ ద్రావి గరిమంబు దలంప కతండు వాఱినన్
సేనలు పెల్లగిల్లి పఱచెన్ దశకంఠుఁడు కోట డగ్గఱం
గా నడచెన్ మణిస్ఫురితకాంచనతోరణకాంతిఁ జూచుచున్. 53

ఉ. అట్టియెడన్ సురారిసుభటావళి వాకిట లగ్గ సేసినం
గట్టుపకారి దీర్ఘదృఢకాయుఁడు తత్ప్రతిహారపాలకుం
డొట్టినమంటవోలెఁ గడునుగ్రతఁ బేర్చిన సూర్యభానుఁ డ
ప్పట్టునఁ దాఁకి దానవులు పాఱుటయుం గదిసెన్ దశాననున్. 54

ఆ. వీఁకఁ గొండతోడఁ దాఁకెడుతగరును, బోలె గగనచరులు భుజబలంబు
వొగడఁ బరిఘు ద్రిప్పి యెగసి దశానను, వెడఁదయురము పెలుచ నడిచి యార్చె.

క. ఆసూర్యభానుఁ డీక్రియ, ప్రేసినయప్పరిఘు దనుజవిభుఁ డధికబలో
ల్లాసమునఁ బుచ్చుకొని పొడి, సేసె నసురు లార్వ నతనిశిర మొకప్రేటన్. 56

క. నుగ్గయినయతనిఁ గనుఁగొని, బెగ్గలమున నచటిభటులు పికపిక లైనన్
డగ్గఱి పిశితాశను లొక, మొగ్గర మై కోట సొర సముద్ధతు లయినన్. 57

మ. సమరక్రీడకు వచ్చె వైశ్రవణుఁ డుత్సాహోగ్రుఁ డై మాణిభ
ద్రముఖం బైనబలంబు మున్ వెడలఁ దుర్వారశ్రేణి గర్జిల్ల దు
ర్దమదోర్గకాండవిమర్దితోద్ధతగదాదండోద్భటుం డై పరా
క్రమలీలం బటువంకివాగ్విభవసంరంభంబు రంజిల్లఁగాన్. 58

క. ప్రకటబలు లమ్మహోదర, శుకసారణు లాదిగా నసురవీరులునున్
భ్రుకుటిముఖు లగుచు యక్షప్రకరముఁ దలపడిరి తూర్యరవములు సెలఁగన్.

ఆ. దొరలు వెన్నుదన్ని పురికొల్పి యిరువురుఁ జేరి చూచుచుండఁ జెలఁగి యుభయ
బలముఁ బోటులాడెఁ జలమున నొక్కింత, యోలమూసగొనక యోలి నార్చె.

సీ. కీలాలజలముపైఁ దేలుచు నవ్విన ట్లున్నశిరంబు లొక్కొక్కచోట
నంగుళీయకరుచు లడరంగ నెఱిఁ, బాసియున్నహస్తంబు లొక్కొక్కచోట
గుత్తులకోలఁదిఁ గృత్తంబులై పడి యున్నపాదంబు లొక్కొక్కచోట
నవయవభేదంబు లమరక తునియ లై, యున్నగాత్రంబు లొక్కొక్కచోటఁ

తే. గమలషండంబు నాగలోకంబుఁ దలిరుఁ, బాన్పుఁగల్పాంతమునజముబానసంబు
నింటిలోపలఁబోలె నొప్పెసఁగెఁజూడ, నప్పుడుయక్షనిశాటయుద్ధాంగణమున.

ఉ. అయ్యెడ మాణిభద్రుఁడుఁ బ్రహస్తుఁడు నొండొరుఁ దాఁకి వ్రేసియున్
వ్రయ్యఁగ మోదియుం జదియవైచియు నొచ్చి చనంగ నిమ్మెయిన్
డయ్యఁగఁ బోరి రంత వికటప్రముఖాసురు లంటఁ దాఁకినం
గయ్యము దక్కి యక్షుఁ డధికం బగునొవ్వునఁ బెల్లగిల్లినన్. 62

ఆ. బలము పాయ యిచ్చి తొలఁగిన నలుకక, బరవసమున నర్థపతి గడంగి
రథముఁ బఱపఁ బనిచె రాక్షసభటకోటి, యఱుమలేక పాఱి తెఱపి యిచ్చె.

కుబేరుఁడు రావణుని దూరనాడుట.

క. ధనదుఁడు గట్టెదురం దమ్ముని గనుగొని సూతుఁ దురగముల నిలుపంగాఁ
బనిచి పులస్త్యతనయనం, దనుఁ డగుటకు సముచితముగఁ దా నిట్లనియెన్. 64

ఉ. ఏను హితంబు సెప్ప నిటు లేచి దురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోగి చేఁ దయినమం దఱువుం దెవ్వు లంటఁ దాఁకినం
గాని యెఱుంగఁ డప్పు ప్రతీకారము గల్గునె యట్లపోలె నీ
దైననికృష్టవృత్తిఫల మంది తలంచెదుగాక పిమ్మటన్. 65

ఉ. కార్యము లెందుఁ దార యవుఁ గా దన నోపుదురే సహాయులై
యార్యులు ద్రోచి చెప్ప నుభయప్రతిపన్నము లైనఁ గాక యీ
శౌర్యము వట్టి దుర్ణయవిచారమునన్ వినయంబు దక్కట
స్థైర్యముఁ దేక యున్నె తుది దాఁకునె లోకవిరుద్ధవృత్తముల్. 66

తే. మేలు రెండులోకంబుల మేల తెచ్చు, కీడు సేసినఁ దప్పదు కీడ యగుట
దీని నాబాలగోపాలమైనజనము, సకలమును మది నెఱుఁగు నీవొకఁడు దక్క 67

చ ఒకరునిమాటఁ బోక కడునుగ్రత నీవు సధర్ము లైనవా
రి కలుగుచున్ సముద్ధతిఁ జరింపఁగఁ జూచుట దేవతాగణం
బకట మనంబులోన ముదమందుఁ జుమీ వెడమాట లింక నే
టికి రణకౌశలంబుఁ బ్రకటింపుము వచ్చితి సారెసారెకున్. 68

కుబేరుఁడు రావణునితో యుద్ధముచేసి యోడిపోవుట.

క. అనిన మఱుమాట వలుకక, దనుజేంద్రుఁడు ధనదు నస్త్రతతిఁ గప్పె నతం
డును బాణవృష్టి గురిసి య,శనిక్రియ సుగ్ర మగు ననలశర మేసె వడిన్. 69

ఆ. అదరు లెగయ వచ్చునాగ్నేయబాణంబు, రాక కంబుపతిశరంబుఁ దొడిగి
లాఘవమున నిజబలం బార్ప దశముఖుఁ, డనతిదూరమునన యాఱనేసె. 70

శా. శ్రావ్యం బై చెలఁగన్ గభీరమధురజ్యానాద ముద్దామవీ
రవ్యాపారనిరూఢతం బ్రతిశరాసంభంబు మర్దించుచున్

సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్. 71

ఆ. ఏటు లాడి యాడి యేడ్తెఱఁ గలిసి గ,దాప్రవీణబాహుదండుఁ డయిన
ధనవిభుండు వ్రేసె దశముఖుశిరము లం,దంద యక్షు లార్వ నచల మద్రువ.

క. సురవైరి గినిసి యొక్కట, నిరువదిగద లెత్తుకొని ధనేశ్వరు సురమున్
శిరమును బరులం గరములఁ,జరణంబులు జదియ మోదె సరభసవృత్తిన్ 73

చ. కలయఁగ మేన శోణితము గ్రమ్మఁగ లావఱి యొల్లఁబోయి కెం
దలిరుల నొప్పుచూతము మొదల్ నఱకన్ ధర వ్రాలునట్లు వి
హ్వలుఁ డయి తేరిపై నొఱగు వైశ్రవణుం గని సూతుఁ డెంతయుం
దలరి రథంబు దోలుకొని దవ్వుల కెక్కడి కేనిఁ బోయినన్. 74

క. వెల్లుగ నార్చుచు విజయస,ముల్లాసముతోడఁ బంక్తిముఖుబల మెగవం
జెల్లాచెదరై యక్షులు, వెల్లగిలం బఱచి రద్రిబిట్టులియంగన్. 75

సీ. కాలుకొన్నంతయుఁ గడువేగమునఁ బాఱి కనుకని దెసలందుఁ గాడుపడియుఁ
బాఱఁ జాలక ముట్టఁబడి జాడ దప్పంగఁ దొలఁగి పెన్గొందులఁ దూఱఁబడియుఁ
వలబుఁ జీరలును గంపలు వట్టికొని గాసి గా మ్రగ్గుటడవులఁ గాటువడియుఁ
గాళులఁ జేతులఁ గా నెట్టకేలకుఁ జఱు లెక్కి లోయలఁ జాఁగఁబడియు

ఆ. బయలిమొనలు గోట వట్టినవెల్లువ,నీటిప్రజయు నొక్కమాట యురలఁ
దెరలి యిద్ద ఱొక్క తెరువునఁ బోవక,యాకులితను గాందిశీకు లయిరి. 76

రావణుఁడు కుబేరు నోడించి పుష్పకవిమానము గొనుట.

తే. అసురపతి గెల్పుగైకొని యలకఁ జొచ్చి,యొందు సేయంగ నొల్లక యుచితపురుఁడ
పోలెఁ దనప్రజ వారించి కేలిఁ గామ,గమనరమణీయ మగుపుష్పకంబు గొనుచు 77

క. చనియె నట ధనదుసూతుఁ డ,తని నొకపద్మాకరంబు తటమునను బె
ట్టిన నచటఁ బొలయు నల్లని,తనుగాలిం దేఱి లజ్జితస్వాంతుం డై. 78

ఆ. అంత నంత విరళ మగుపరివారంబు, గూడి చిన్నవోయి కొలిచి రాఁగ
వాడి యున్నమోము వాంచినభంగిన, యలక కేగు దెంచె యక్షవిభుఁడు. 79

ఉ. అక్కడ దానవేంద్రుఁడు జయంబునఁ గ్రొవ్వెలరారఁ బుష్పకం
బెక్కి గిరీంద్రవైభవనిరీక్షణకౌతుకలగ్నచిత్తుఁ డై
యిక్కడ నక్కడం గలయ నిచ్చమెయిం జరియించు చుండఁగా
నొక్కెడ నెద్దెసం గదలకుండె విమానము విస్మయంబుగన్. 80

చ. అమరవిరోధి దాని కెద నచ్చెరు వంది యమాత్యభృత్యవ
ర్గములును దానుఁ గూడి వడిఁ గామగ మై చనునట్టి దివ్యమా
న మిచట నిట్లు దీనిగమనం బెడలం గత మేమి యక్షస
త్తముఁ డొకరుండు దక్క నొరుఁ దాల్పదొకో హృదయానువర్తి యై. 81

# చతుర్థాశ్వాసము.

నందికేశ్వరుఁడు రావణుని శపించుట.

చ. అనుసమయంబునం ద్రినయనానుచరుం డగునంది వాకలం
గని యనియెం దొలంగుఁ డెడగా నిది యీశనివాసదేశ మిం
దనిమిషయక్షకింపురుషు లాదిగ నెవ్వరు రా రనంగ న
ద్దనుజవిభుండు వెండియు నుదగ్రతఁ బోవక యున్న నల్కతోన్. 82

క. ఈతతి నీశ్వరుఁ డిత్తరు, పోతంబుల కెలన శైలపుత్త్రియుఁ దానుం
బ్రీతిఁ గుసుమాపచయకే, లీతత్పరుఁ డైనవాఁడు లీలానుగతిన్. 83

క. అడిబీర ముడిగి రాక్షస, చెడక మరలి పొమ్ము నీకుఁ జేయలఁతియె యీ
యెడ యింక నీవు నిలిచినఁ, బడ నడుతురు గన్న నిన్నుఁ బ్రమథగణంబుల్.

తే. అనినఁ గోపించి యీశ్వరుఁ డనఁగ నెవ్వఁ, డతనికిచ్చోటు దక్కనకతముఁ జెప్పు
మనుచు వానరవదనంబునట్టు లున్న, నంది మొగ మప్డు దేరకొనంగఁ జూచి. 85

క. కడుఁ బెల్చ నవ్వ యగు నీ, వడువునఁ జెలువంబు గలుగు వారలచేతం
జెడఁడే యీతఁడు నుడువక యుడుగు మనుచుఁ బంక్తివదనుఁ డుల్లస మాడెన్.

చ. తెగడినఁ గెంపుసొం పడరు దృష్టులు గాడఁగఁ జూచి నంది యి
ట్లగు నిది నిక్క మివ్విధముననాననముల్ గలవార యేపున
న్నిగిలినరాక్షసాన్వయము నిన్నుఁ బురంబును సాగరంబు గా
సిగ మసి గాఁగఁ జిక్క వడఁ జేద్పడఁ జేయుట యెట్లుఁ దప్పునే. 87

ఆ. నిన్నుఁ బట్టి యిపుడ నీఱుగఁ దలలు దు,న్మాడ నాకు శక్యమగున గ్గైన
జగముచేతినిందఁ జచ్చినవాఁడవు, మున్న కాన శవము ముట్ట నరిన. 88

మ. అతిరౌద్రాకృతి దైత్యుఁ డిట్లనియె మీ రాక్రోశముం జేయఁ బ
ర్వత మే నిప్డ చలంబునం బెకలెదన్ వారింపుఁడా నీవు మీ
యతఁడున్ వచ్చి విమాన మాఁగినఫలం బంనంగ నీశాను ని
ర్జితుఁ గావింపక మిమ్ముఁ ద్రుంపక దశగ్రీవుండునుం బోవునే. 89

రావణుఁడు కైలాసమును పెల్లగించి యెత్తుట.

ఆ. అనుచు శైలమూలమున కేగి చేతుల, గ్రుచ్చి యమరఁ బట్టి కూలఁ ద్రోవ
నప్పళించి యెత్తె నల్లాడె నమ్మహా,నగము జీవరాశి బెగడుపడఁగ. 90

క. తదవసరంబునఁ బ్రమథులు, బెదరిరి గిరిరాజతనయ బిట్టులికి వెసం
బొదివి పయి వ్రాలి కౌఁగిటఁ, గదియించెను శంభుమేను గరుపారంగన్.

ఆ. దనుజుచంద మంతఁ దనదుచిత్తంబున, నెఱిఁగి శంకరుండు చిఱుతనగవు
కాంతి మోముచెన్ను నింత గావింపంగ, నంగుటమున నల్లనూఁదుఁటయును.

శివుఁడు రావణునిచేతులు కైలాసము క్రింద నడఁగఁ ద్రొక్కి వాఁడు ప్రార్థింపఁగా ననుగ్రహించుట.

చ. కరములు చాఁపకట్టువడఁగా గిరి యెప్పటియట్ల క్రుంగినన్
విరవిరఁ ద్రెల్లి నొవ్వడరి విహ్వలుఁ డై దశకంధరుండు ఘో

రరవము లోకసంభ్రమకరం బగునట్లుగఁ బెల్చఁ గూసె న
చ్చెరువును బెగ్గలంబుఁ గవిసెన్ వెస దైత్యునమాత్యకోటికిన్. 93

క వెల్లువ ముట్టినపగిదిం, దల్లడమునఁ గూడఁ బాఱి తనుఁ దనసైన్యం
బెల్లను ముసరఁగ దానవ, వల్లభుఁ డట్లఱచుచుండె వా విడిచి వడిన్. 94

తే. తా నెఱుంగనియట్టుల తడవు గాఁగ, నిల్చి కరుణించి పదపడి నీలగళుఁడు
నగము డీలించి బాహులు వెగిచికొనఁగ, నిచ్చి యానతియిచ్చె దైత్యేశ్వరునకు.

శా. కేలీకందుక మల్ల నెత్తుకొనుమాడ్కిం బట్టి నాయున్న యీ
కైలాసాచల మిట్లు నీవు నెగయంగా నెత్తినం జోద్య మై
నీలా వేఁ గొనియాడు రెల్లరును వర్ణింపంగ నీ కొక్కపే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ బెంపెక్కంగ నే నిచ్చెదన్. 96

క. ఏ వినఁగ నిపుడు నీదగు, రావంబు త్రిలోకభీకరం బయి చెలఁగెం
గావున విన్న భయం బగు, రావణుఁ డనునామమునఁ బరఁగు త్రిజగములన్.

ఉ. పుష్పక మర్థి నెక్కి మెటఁ బోయెదొ పొమ్మని వీడుకొల్పె వా
స్తోష్పతి సంతసం బెడల ధూర్జటి నిర్భరహర్షనిర్గళ
ద్బాష్పవిలోచనుం డగుచు దానవనాథుఁడు రత్నమాలికా
నిష్పతదంశుజాలరమణీయవిమానము నెక్కె మ్రొక్కుచున్. 98

ఆశ్వాసాంతము.

మ బుధసంరక్షణశీలుచేత వినయాంభోరాశిచే శత్రుగ
ర్వధనాదానవిదగ్ధుచేత రమణీప్రద్యుమ్నుచే నవ్వయాం
బుధిసంపూర్ణసుధాంశుచేతఁ సుహృదంభోజార్కుచే భారతీ
మధునిష్యందముఖాబ్జుచేతఁ ద్రిజగన్మాన్యస్ఫురత్కీర్తిచేన్. 99

క ఖండియరాయని పే సు,ద్దండద్విషదవనిపతిమదావళహరిచేఁ
ఖండితవిధుచే విభవా,ఖండలుచే నృపనయప్రకారునిచేతన్. 100

మాలిని. నిరుపమకరకేళీనిర్దళద్వైరిధాత్రీ
వరతనుగళితాసృగ్వారిపూరావగాహో
దరభరపరిఖేలద్యాతుధానాంగనాని
ర్భరమదమధురస్తోత్రప్రసన్నాత్ముచేతన్. 101

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిధేయ
తిక్కననామధేయప్రణీతం బయినయుత్తరరామాయణం బను మహాకావ్యంబు
నందుఁ జతుర్థాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# నిర్వచనోత్తర రామాయణము

## పంచమాశ్వాసము



రమణచరణశరదం
భోరుహభృంగపతిచేఁ ద్రిభువనప్రథితా
చారునిచేఁ గనకాచల
ధీరునిచే మనుమవసుమతీవల్లభుచేన్. 1

క. శంభునిచే నిర్విధమున, సంభావితుఁ డై తదీయశైలము డిగి సం
రంభమున రావణుఁడు దాఁ, గుంభిని నలుఁగడలఁ గలయఁ గ్రుమ్మరు చుండెన్.

క. ఒక్కొకమరి సేనలతో, నొక్కొకమరి వీరపరిజనోపేతుం డై
యొక్కొకమరి దనయంతన, యెక్కడ నేనిని జరించు నిచ్ఛాగతులన్. 3

వేదవతి రావణునిచే నవమానిత యై యగ్నిప్రవేశము చేయుట.

మ. హిమవంతంబున కేగి యొక్కయెడ నంగదేకాంత యొక్కర్తు చీ
రముఁ గృష్ణాజినముం గమండలువు నై రాగంబు వర్జించి సం
యమముం గైకొనిఁ యున్నఁ జేరఁ జని హృద్యాకారముగా యౌవనో
ద్యమముం గాంతియుఁ జూచి రావణుఁడు గామాయత్తుఁ డై యిట్లనున్. 4

క. ఎవ్వనితనయవు నీపతి, యెవ్వఁడు పే రేమి నీకు నీరూపంబుగా
జవ్వనముఁ బాయ నీతప, మెవ్విధిఁ బాటిల్లె నకట యింతయుఁ జెపుమా. 5

క. అనుపలుకులు వినియుం దా, విననియదియుఁ బోలె సువితతవిధి నాతిథ్యం
బొనరించినయక్కన్యక, ననిమిషరిపుఁ డట్ల మఱియు నడిగిన నదియున్. 6

సీ. అనఘ కుశధ్వజుఁ డనుమునీశ్వరుఁడు వేదాభ్యాస మనిశంబు నాచరించి
యాసుకృతంబునఁ జేసి నన్ గని వేదవతి యనుపేరిడి వంశమహిమ
వెలయంగ నిక్కన్య విష్ణున కిచ్చెద నని చాలఁ బ్రీతి సేయంగ నెల్ల
వారును మాయయ్య కోరిక యెఱుఁగక యర్థింప నర్థింప నతఁడు ద్రోచి

తే. పుచ్చ నసురేంద్రుఁ డై నజంభుండు నడిగి, తనకు నీకున్న నలిగి మాతండ్రిఁ జంపెఁ
దల్లి సొదఁ జొచ్చె సత్యవ్రతంబు నడపు, జనకుపూనికి నే దీర్తు నని తలంచి.

క. అది మొదలు గాఁగ విష్ణుని, మది నిల్పి యతండ నాకు మగఁ డగు నని యి
ట్లు దపంబు సేయు చుండుదు, నిది నాతెఱఁ గనిన దానవేశ్వరుఁ డనియెన్. 8

ఉ. కాంతి దొలంగ మే నిటులు గాఱియఁ బెట్టుచు జవ్వనంబుచె
న్నింతయు రిత్తవో సుఖము లెల్లను డిగ్గఁగఁ ద్రావి నెమ్మదిం
జింత వశంబుగా నడరఁ జేడ్పడి యొంటి చరించుచుండ్ జర
త్కాంతయుఁబోలె నియ్యెడుమఁ గైకొనఁ బాడియె చారులోచనా. 9

మ. లలనా విష్ణుఁ డనంగ నెవ్వఁ డతఁ డేలా శుద్ధవంశంబు ని
ర్మలసంపూర్ణతపోమహత్త్వము వరప్రాప్తానుభావంబు దో
ర్బలసంపత్తియు నాకుఁ బోలెఁ ద్రిజగత్ప్రఖ్యాతిపాత్రంబులే
కలదే లంక పరాక్రమం బఖిలలోకశ్లాఘ్యమే వానికిన్. 10

ఆ. అనినఁ జెవులు మూసికొని యిట్టులను లోక, వంద్యు వేదవేద్యు వరదుఁ బరము
ననుపమాను నచలు నవ్యయు హరిఁ జెడ, నాడఁ గూడ దని మృగాక్షి మఱియు.

చ. తపముల కెల్లఁ దాన ఫలదాత కులంబున కాదికర్త యై
యపరిమితప్రభావుఁ డగు నాచతురాస్యుఁడు నాభిఁ బుట్టె వి
శ్వపతి యహీనబాహుబలసారఘను ల్మధుకైటభాదిదై
త్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె నారయ విష్ణుఁ డమాననీయుఁడే. 12

క. అనిన నసుర యమ్మాటలు, విన నొల్లక కదియ వచ్చి వెండియు సతి కి
ట్లనియె మరునంపవెల్లువఁ, దనువు నిలువ దింకఁ గోర్కి దఱిమెడుఁ ఖేర్మిన్.13

చ. ఎఱుఁగవు గాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనం బయి
త్తఱి నుడివోవ కుండ నుచితంబుగ జక్కవదోయివోని క్రి
క్కిఱిసినచిన్నిచన్నుఁగవ యింపెసలారఁగ నాదువక్షమం
పఱలుసరోవరంబున నవారణఁ గేలి యొనర్పు కోమలీ. 14

ఆ. అనుచుఁ దగిలి చూచు నద్దానవేశ్వరు, నలిగి చూచి నిన్ను నధముఁ డగుట
మును తపఃప్రభావమున నెఱింగియుఁ దగ, నాపులస్త్యుమనుమఁడని తలంచి.

క. అతిథిసపర్యయు సమయోచిత మగుసంభాషణంబు నేసితిఁ బోపో
మతి లేదు నీకుఁ జొప్పడు, నతివలలో నన్నుఁ దలఁప నగునె దురాత్మా. 16

చ. అని కలుషించి వేదవతి యచ్చటు వాసి చనం దలంచినం
గని దశకంధరుం డడరి గ్రక్కున వేనలి పట్టికొన్న నం
గన యొకప్రేల ప్రేయ నడికత్తివిధంబునఁ దాఁకి కత్తిరిం
చినక్రియఁ ద్రెంచె వెండ్రుకలు చేతఁ దెమల్చినయంత కివ్వలన్. 17

తే. వెండ్రుకలు చేతవచ్చుడు వెఱఁగుపడుచుఁ, దషమువేర్మికి నలికి యద్దనుజవిభుఁడు
నిశిచరోషమహానలజ్వాలనమూర్తి యగుచుఁ బిఱిఁదికి బాసి యిట్లనియె సతియు.

ఉ. బన్నము లిట్లు నీవు పఱుపం బడి మేను దొఱంగు చుండి యే
నిన్ను శపించినట్లయిన నిర్మలనిత్యమహాతపఃప్రభా

వోన్నతిచేటుగాదె పునరుద్భవ మయ్యెద నీకు మృత్యువై
సన్నుతపుణ్యజాత యనఁ । జాలి యయోనిజమూర్తిఁ దాల్చెదన్. 19

క. ఈపరిభవంబుఁ బడియుం, దీపే ప్రాణంబు లనుచు । దిగ్గన ననలం
బాపాదించి దశానను, నే పడఁగన్ విష్ణు నాత్మ । నిడి సొదఁ జొచ్చెన్. 20

ఆ. కృతయుగమున వేదవతి యనఁగాఁ జన్న, నాతి త్రేత నిపుడు । సీత యనఁగ
జనకుయజ్ఞవేది । జన్మించి నీసతి, యయ్యె నీవు విష్ణుఁ । డగుటఁ జేసి 21

చ అని ముని సెప్ప విస్మయము । నార్తియుఁ గోపముఁ బ్రీతియుం బెనం
గొనఁ దప మిట్టిదిం గలదె । కోమలి దొల్లియు నన్నె కోరెనే
దనుజుఁడు నాఁడు నియ్యనుచితం బొనరించెనె తత్ఫలంబు మె
ల్లన యిటు వొందెనే యని తలంచుచు రాముఁడు గౌతుకంబునన్. 22

క. ఇవ్విధమున సొదఁ జొచ్చిన, యవ్వనితం జూచి పిదప । నసురాధీశుం
డెవ్వలని కరిగె నెవ్వరి, కెవ్విధిఁ గావించె ననిన । నిట్లనె మునియున్. 23

రావణుఁడు దిగ్విజయము చేయుట.

శా. వీరుం డెవ్వఁడు నెందు లేఁ డనుచు నుర్విం ద్రిమ్మరున్ దర్పదు
ర్వారస్ఫారపరాక్రమక్రమకళావైదగ్ధ్యవిస్తార మే
పారంగా ధరణీశులన్ వెదకి వీరావేశి యై దుర్దమ
ప్రారంభం బొనరించుచున్ సమరసంరంభంబు శోభిల్లఁగాన్. 24

సీ. ఒక్కచోఁ దా మరుత్తోర్వీశుజన్నంబునకుఁ జని యతని రణంబు సేయ
నడిగినఁ గ్రతుకాలమని సేయఁ దగవు గాదనుచు శాంతత నున్నయానృపాలు
నోడితి వని యార్చి । యుడుగక యజ్ఞోపకరణంబు లన్నియు । గాసి చేసి
ప్రాగ్వంశ మంతయు । వ్రచ్చి వేదిక ద్రొచ్చి ఋత్విగ్గణంబులసత్త్వ మడఁచి
తే. యజ్ఞభాగంబులకు వచ్చి హరికృతాంత,వరుణధనదులు బర్హియువాయసంబు
హంసమునుగృకలాసంబునై భయమున,నడఁగియుండిన నెఱుఁగక యసురవోయె.

ఉ. అంతకవిక్రమున్ సురధునాద్యుఁ బురూరవు బాహుశాలి దు
ష్యంతు నజేయు గాధినృపసత్తమునిం గని కూడ ముట్టి మీ
రింతకు మున్ను నన్నెఱుఁగ । రెన్నఁడుఁ గావునఁ గయ్య మిందు మీ
కెంతబలంబు గూడు నది యెల్లను గూర్పుఁడు దర్ప మేర్పడన్. 26

ఉ. చాలక తక్కినన్ వినుఁడు । శౌర్యము లజ్జయు నుజ్జగించి మీ
రోలిన నిల్చి నాయెదుర । నోడితి మే మనుఁ డన్న మేదినీ
పాలురు పోరిలో మనకుఁ । బంక్తిముఖుం డెనయంగ వచ్చునే
మే లిది యంచు నోటమిక । మేకొని యట్టుల చేసి రుక్కఱన్. 27

మ. దనుజుం డీపురి కేగుదెంచి మహిమోద్దామప్రతాపాగ్నిసం
జనితాశావలయప్రకాశబహుశస్త్రప్రౌఢిసంరూఢిచే

ననరణ్యక్షితిపాలు ముట్టిన నతం । డత్యుద్భటాకారుఁ డై
యని కేగెం బృథివీపరాగపటలం । బాకాశముం గప్పఁగన్. 28

ఉ. సైన్యయుగంబులుం బెనఁగి । సంగరరంగమునందు వ్యగ్ర రా
జన్యవరుండు రావణుఁడు । సమ్ముఖ మై మహి సంచలింప న
న్యోన్యవధాభిలాషమున । నార్చి వడిం దలపడ్డఁ జూడ సా
మాన్యము లయ్యె నప్పు డొక । మాత్ర జయాపజయప్రకారముల్. 29

చ వికటము లైనహస్తములు । వ్రేయుచు నోలిన తాఁకి యున్న మ
స్తకములు నుగ్గు సేయుచు ని । శాతకృపాణకళావిదగ్ధుఁ డై
యొకవడిఁ బోరి డస్సి బలి । మియుం డగుదానవుచేత నొచ్చి నే
ల కొరగునప్డు భూపతి చ । లంబున నాతనితోడ నిట్లనున్. 30

మ. అని నీ కోపక పడ్డ నేమి యిఁక దై । త్యాధీశ యే ధర్మవ
ర్తిని యేనిన్ శుచి నేని నాకులమునన్ । దివ్యావతారుం డొకం
డనపాయుం డుదయంబు సేసి భువనం । బానందముం బొంద నెం
దు నవధ్యం బగునీశిరోదశకముం । దున్మాడువాఁ డుద్ధతిన్. 31

ఆ. అనిన నసుర నగుచు నగు నగు నీయందుఁ బొంకు గలుగు నెట్లు పోలుఁ బోలుఁ
బిదపఁ జూచికొంద । మిది నీవు గొమ్మని, పరిఘ నతనిశిరము । పగుల వ్రేసె.

క. ఆర్చి విజయోత్సవమునం, బేర్చినచలమున వరంబు పెంపున సొంపుం
దీర్చి దిగులు రాజులయెదఁ, గూర్చి విడిసె మగుడ దైత్య । కోటి మదింపన్. 33

క. ఇమ్మెయి నచట నచట య, జ్ఞమ్ములుఁ దపములును ధర్మ । చర్యలు బహువి
ఘ్నమ్ములఁ బెట్టుచుఁ గలయం, గ్రుమ్మరి నరవరుల నొక్క । కోటికిఁ దెచ్చెన్. 34

మ ఒకనాఁ డొక్కెడఁ బోయి పోయి దివి నత్యుచ్చైఃపయోదంబు నె
క్కి కడుం జెన్నగువీణ చే నమర నక్షీణప్రభావుండు సం
ఖ్యకళాసంజనకుండు నారదుఁడు రాఁగాఁ జూచి యాసన్నపు
ష్పకుఁ డై భక్తిఁ గృతప్రణాముఁ డగుచున్ । సల్లాపసౌఖ్యంబునన్. 35

ఆ. అసురవరుఁడు గుశల । మడిగిన, నుచితసంభాషణంబు సేసి । బంధుభావ
మాదరమున నెఱపి । యమ్ముని మానవ, హితముఁ గోరి యతని । కిట్టు లనియె.

నారదుచోదితుఁ డై రావణుఁడు యమునిమీఁదికిఁ జనుట.

మ. ధరణీచక్రమునందు నీవు సమరోత్సాహంబునన్ రాజులం
బొరవుచ్చం గనుఁగొంచు వించు మది నేప్రొద్దున్ ముదం బందుదున్
హరియుద్ధంబును శూలిసంగరము దేవాధీశుసంగ్రామముం
గర మర్థిస్మను సూతు నాకు నవివేడ్కం జేయ వి క్లొమ్మెయిన్. 37

క. ఏ నీకు నొకట సెప్పెద, దానవకులముఖ్య దేవతలకు నవధ్యుం
డైననినుఁబోటివాఁ డీ, మానవుల జయింప విక్రమంబును గలదే. 38

క. కలయం ద్రిమ్మరి మేదినిఁ, గలవీరుల నోర్చి జయము ♦ గైకొంటి మను
ష్యులు నీ కెదు రే యింకం, గలదే కొద వడ్డచో టఖండితశౌర్యా 39

తే. క్షుత్పిపాసలు జరయును ♦ ఘోరరుజలు, నడర నార్తులై యుండుదు ♦ రదియుఁ గాక
మర్త్యులిటమున్న వీరు లమర్త్యులైరి, వీనుఁగుల ముట్టి యొడిచి ♦ విపదుగలదె.

క. కావున నిమ్మనుజావళి, నీ వడుచుట మెచ్చు గా దనిన నప్పలుకుల్
దేవారి వోలు నని సం,భావించి మరుత్తపస్విపతి కిట్లనియెన్. 41

నారదవచనప్రబోధితుం డై రావణుఁడు యమునిపై దాడివెడలుట.

ఉ. ఏను రసాతలంబునకు ♦ నేగెద నాగకులంబు నోర్చి య
ద్దానవులన్ జయించి బల ♦ దర్పము లేర్పడ దేవకోటిదు
ర్స్థాన మడంప వాసవపు ♦ రంబునకుం జనువాఁడ సన్మునీం
ద్రా నినుఁ గంటి నా కభిమ ♦ తంబులు సేకుఱు నింక నెమ్మెయిన్. 42

తే. అనిన విని నీకుఁ బాతాళ ♦ యానమునకుఁ, దెరువు గా దిది సమవర్తి ♦ పురముసరణి
యందు జనుమత నిమదంబు ♦ వడఁపవలయు, ననిననమ్మునికనియె న ♦ ద్దనుజవిభుఁడు.

ఉ. మున్ను ప్రతిజ్ఞ సేసితి స ♦ ముద్ధతవృత్తి దిగీశకోటికిన్
బన్నముఁ దేరఁ గావున శు ♦ భంబులు శీఘ్రము చేత నీతి గ
ర్వోన్నతిఁ గ్రాలునాజముని ♦ నుక్కడఁగించి క్రమంబుతోడఁ ద
క్కున్న దిశల్ జయించెద స ♦ ముజ్జ్వలదుస్సహవిక్రమంబునన్. 44

క. పనివినియెద నని మ్రొక్కుచు, దనుజేంద్రుఁడు సనిన వేల్పు ♦ తపసియు నీతం
డనుమానింపక జముపైఁ, జనియెడు నియ్యెగుపురకును ♦ సమరం బైనన్. 45

క. వీఁడును వరసిద్ధబలుఁడు, వాఁడును జగ మెఱుఁగ దుర్ని ♦ వారుఁ డలుకమై
నేఁ డిరువురుఁ దలపడుదురు, వేఁడి మొగంబులన చూతు ♦ వేడుకతోడన్. 46

నారదుఁడు రావణునిరాక యమునికెఱింగించుట.

మ. అని యొక్కించుక నిల్చి యొండుగడ గా ♦ నత్యంతశీఘ్రంబునం
జని వైవస్వతుఁ గాంచి తా నధికపూ ♦ జాసత్కృతుం డై కృతాం
తున కారావణురాక సెప్పి యనిలో ♦ దోశ్శక్తిఁ జూపంగఁ బూ
ని నిజం బై యిట వచ్చె నేనిఁ జెడఁడే ♦ నీచేత నం చున్నెడన్. 47

క. అచ టెల్లఁ బుష్పకంబున, రుచి గప్పఁగ రావణాసుర ♦ ఁడు దైతేయ
ప్రచయకలకలనిరంతర, నిచితనభోభాగుఁ డై య ♦ మనికి నేతెంచెన్. 48

క. చనుదెంచి పురసమీపం,బునఁ దమతమపుణ్యపాప ♦ ములు గనుఁగొనఁ ద
మ్మనివారణఁ బొందఁగ నున్న,నిఖిలజంతువులఁ జూచి ♦ నయవిరహితుఁ డై. 49

ఉ. కొందఱు సౌఖ్యముం బొరయఁ ♦ గొందఱు దుఃఖముఁ బొంద నేల మీ
రందఱు నొక్కచంద మగుఁ ♦ డంచు విపద్దశఁ బొందువారి మే

లొండ నొనర్చె దైత్యపతి యున్నదుఁ డై పితృరాజుకింకరుల్
గ్రందుకొనంగ నే పడర గాసిగఁ జేసె దదాజ్ఞ నెంతయున్. 50

యమరావణసేనలు పోరాడుట.

ఉ. రక్షకు లెల్ల నొక్కటఁ దిరంబుగ మోహర మేర్చి యార్చి సం
ధుక్షితకోపు లై యతులదోర్బలదుస్సహలీలఁ దాఁకినన్
రాక్షసులుం బరాక్రమధురంధరతం దగ మాఱుకొన్న వీ
రక్షయకారి ఘోరసమరంబు ప్రకీర్తిత మయ్యె నయ్యెడన్. 51

ఉ. సేనలతోడ నద్దనుజసింహుఁడు సంగరకాంక్ష వచ్చినం
బూనికిఁ దీర్చి కింకరులు పోరుటకు న్మది నుల్లసిల్లి పె
ల్లైనబలంబులం దగుసహాయముగా సమవర్తి పుచ్చినన్
దానవసంగముల్ దలరఁ దాఁకె విశృంఖలదోర్విలాసతన్. 52

చ. జమునిబలంబు పేర్చి నిజసైన్యము నుక్కడఁగించినన్ భుజా
సముదయసంభృతాస్త్రబహుశస్త్రమహోగ్రతఁ జూపెఁ దాఁకి వి
క్రమరసికాంతరంగుఁ డగురావణుఁ డుజ్జ్వలరోషపావకో
ద్యమవినివార్యమానరిపుదర్పమహానిబిడాంధకారుఁ డై. 53

క. పంపునకు వోడఁ దగ దని, త్రుంపఁ గడఁగి కాలకింకరులు భీకరు లై
నొంపఁగఁ జంపఁగఁ దఱిమి ని,లింపరిపుం బొదివి రెదఁ జలింపక కడిమిన్. 54

ఉ. ఆశుగచక్రతోమరగదాసికుఠారముఖంబులన్ మహో
గ్రాశయు లై నిజాంగముల నన్నిటి నొక్కట నొంప నల్గి కీ
నాశునివారి నెల్లను వినాశము నొందఁగఁ జేయ వారిపైఁ
బాశుపతంబు వట్టి తెగ వాపె నిశాటవిభుం డుదగ్రతన్. 55

మ. తలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్. 56

చ. అపరిమితప్రతాపుఁ డగునాదశకంధరుచేత ముక్త మై
త్రిపురము లేర్చుభూతపతి తీవ్రశరంబునుబోలె మండి మిం
టిపయిఁ గలంగఁ జేర్చి నిగిడించి యుగాంతమహాగ్ని రీతిఁ బా
శుపత మరాతిసైన్యముల నూరెల ముట్టి దహించె వ్రేల్మిడిన్. 57

చ. జయమునఁ బొంగి పెల్లుగ నిశాచరవల్లభుఁ డార్వ సేనలుం
బ్రియమున నొక్క పెట్ట నలిరేఁగి నభంబు సెలంగ నార్చినన్
భయమున దండు గుండుగిలఁ బొలుదు నాసమవర్తి యెంతయున్
రయమున నుద్భటారుణతురంగసమూహరథాధిరూఢుఁ డై. 58

## యమరావణులద్వంద్వయుద్ధము.

ఉ. ముందట మృత్యు వుద్భ్రమితముద్గరహస్తతఁ గ్రాల నుజ్జ్వల
స్యందనపార్శ్వభాగమున నర్చితమై ఘనకాలదండ మొ
ప్పం దనకోప మాననము పైఁ బెనుమంటయుఁ బోలె నాకృతిం
బొంది వెలుంగ నయ్యసురపుంగవు మోహర మున్నచోటికిన్. 59

చ. చని తనమ్రోల వచ్చుమహిషంబుగళంబున ఘంటనిక్వణం
బును ఘనమూర్వినాదమును, భూరితరాసురసైన్యతూర్యని
స్వనవిభవంబు మ్రేఁగికొనఁ శాతశరాంబుధినీట ముంచె న
ద్దనుజబలంబు నప్రతిహతప్రదరుం డగుచున్ సముద్ధతిన్. 60

మ. జమునాటోపము దుస్సహం బగుడు నుత్సాహంబు వాటింప లే
క మదం బేది బలంబు పెల్లగిలినం గ్రవ్యాదనాథుండు దు
ర్దమబాహాబలుఁడై యెదిర్చె దశకోదండీసముజ్జృంభితో
ద్యమనిర్యాతనిశాతసాయకపటువ్యాపారఘోరంబుగాన్. 61

ఉ. ఈసున నంతకుండు నసురేశ్వరుఁడున్ వివిధాస్త్రశస్త్రవి
న్యాసము లేర్పడం జన జయాపజయంబులఁ బొందుచున్ రణం
బాసురవృత్తిఁ జేసిన లయావసరం బగుచున్న నాసరో
జాసనుఁ దొట్టి వారలెఱఁ గారయ వచ్చి రమర్త్యు లందఱున్. 62

శా. దేవవ్రాతము వచ్చినన్ భుజబలోత్సేకంబుఁ జూడన్ దశ
గ్రీవుం డుగ్రము లైనసాయకములం గీనాశు నొప్పించినం
జావం జేయుదు దైత్యునం చతఁడు భాస్వత్కాలదండంబు బా
హావిన్యస్తము సేయుచున్ భ్రుకుటిబంధాభీలసందీప్తుఁడై. 63

క. మృత్యుపురస్సరముగ లో,కాత్యయసమయంబొ నాఁగ నంతకుఁ డధికో
ద్ధత్యమునఁ గడఁగి డగ్గఱె, దైత్యుం బొడిసేయఁ గాలదండము పూనెన్. 64

## బ్రహ్మ యమరావణులయుద్ధము మాన్పుట.

ఉ. అత్తఱిఁ గ్రక్కునన్ సరసిజాసనుఁ డడ్డము సొచ్చి నిల్చి కే
లెత్తి మహాత్మ యిట్టు లుచితేతరవృత్తము నీకు నీడె మ
ద్దత్తవరానుభావమున దానవనాథుఁ డవధ్యుఁ డేన నీ
యుత్తమకాలదండము ప్రయోగ మమోఘము గా నొనర్చితిన్. 65

క. కావున దీన నసురపతి, చావును బ్రదుకుటయు నాయసత్యము నిజముం
గావుము లోకము లన్నియుఁ, గావు సుమీ నాకు బొంకు గల్గినయేనిన్. 66

క. తగ దుడుగు మనినఁ బితృపతి, నగి జగముల కెల్లఁ బ్రభువు నలినాసన నీ
వగుట భవదాజ్ఞ కెమ్మెయి, మిగులుదునే సమరమునకు మేకొని యైనన్. 67

క. నక్తంచరు సమయించుట, యుక్తము గాదేని నిచట । నునికి దగదు నే
శక్తుఁడ నై యుండియు భవ, దుక్తికిఁ గాఁ దాలఁగవలసె । నోపనిభంగిన్. 68

ఆ. అని రథంబు సూతుఁ । డనుమృత్యుముఖహరి,జనముఁ దానుఁ గూడి । జముఁడ దృశ్యుఁ
డైన వేధయును ని । జావాసమున కేగె, నారదుండు నరిగె । నాకమునకు. 69

క. కలయఁ గనుంగొని యెవ్వరు, మెలఁగమి సమరాంగణంబు । మిన్నక యున్నన్
గెలిచినవాఁ డై దానవ, కులపతి సనె సుతలమునకుఁ । గ్రొవ్వెసలారన్ 70

ఉ. ఆలములోన మైమయిఁ గృ । తాంతుని నోర్చితి నింక నన్నొరుం
డేల యెదుర్చు నంచు మద । మెక్కి నిశాచరవల్లభుండు పా
తాళజయార్థ మేగి మహి । తంబుగ భోగవతీపురంబు గ
ర్వాలసలీల ముట్టె భుజ । గాధిపుఁడుం గనియెన్ వినీతుఁ డై. 71

రావణుఁడు నివాతకవచకాలకేయులతో యుద్ధము సేయుట.

క. గణనాతీతవినూతన, మణినికరము గప్ప మిచ్చి । మన్ననఁ గని యా
ఫణిపతి సంతస మందెను, మణిమతి యనుపురికి నరిగె । మనుజాశనుఁడున్. 72

సీ. అందుఁ బూర్వంబున । నంబుజాసనుచేత వరములు గనిననివాతకవచు
లనియెడుదైత్యుల । నానిశాచరపతి పోరికిఁ బిలిచిన । వారు వొంగి
కయ్యంబు పెద్దయుఁ । గాలంబునకుఁ గంటి మనుచు ననేకసై । న్యములతోడ
వెడలిన నిసువాఁగు । వివిధాస్త్రశస్త్రప్రహారఘోరంబుగా । ననమసమర
తే. మేఁడుకాలంబు సేసిన । నెఱిఁగి యపుడు, వచ్చి వారలవరముఁ । దలను సెప్పి
తెలిపి సఖ్యంబు సేసినఁ । గలసి యచట, జెలిమి మైయుండె దశముఖుఁ । డెలమిమిగుల.

క. అతులితనవభోగంబులఁ, గతిపయదివసములు నివాత । కవచులచేఁ దో
షితుఁ డగుచు నిలిచి శౌర్యో, న్నతి వెలయఁగ నరిగెఁ బద్మ । నగరంబునకున్.

మ. చని వే ముట్టినఁ గాలకేయు లమితో । త్సాహంబునన్ భూమికం
పనసైన్యోద్ధతు లై కడంగి నగర । ప్రాకారబాహ్యాంగణం
బున వీఁకం దలపడ్డ రావణుబలం । బుల్ వీఁగినన్ రేఁగి య
ద్దనుజాధీశ్వరుఁ డస్త్రశస్త్రనిహతిం । దత్సైన్యముం గూల్చినన్. 75

ఉ. చూచి మహోగ్రకోపమున । శూర్పణఖాపతి వీఁగు సేనఁ జే
పీచి విశృంఖలప్రబల । విక్రమదుస్సహుఁ డై దవానలం
బేచినకాననం బడరి । యేచ్చువిధంబున నన్యసైన్యముం
జూచియుఁ జూడకే బలము । సొంపున రూపడఁగించి పేర్చినన్. 76

రావణుఁడు తనమఱఁది యైనవిద్యుజ్జిహ్వుని జంపుట.

చ. వడిగొని కాలకేయభటవర్గము ద్రోచినఁ దాను సేనలుం
గడఁగి నిశాచరేశ్వరుఁడు । గ్రందుగఁ దాఁకి రణంబు సందడిం

దొడిఁబడఁ ద్రెసెఁ దీవ్రతరదోఃసినిం దను నీడఁ బోక కో
ఱడమున బిట్టు గిట్టినమఱంది నెఱుంగక దుర్మదాంధుఁ డై. 77

శా. విద్యుజ్జిహ్వుని ద్రెళ్చిడిం దునిమి దోర్వీర్యం బవార్యంబుగా
నుద్యద్విక్రమవైరివీరసుభటవ్యూహంబు నెల్లన్ ధను
ర్విద్యాకౌశల ముల్లసిల్ల సమరోర్విం గూల్చె నిర్ఘోషసాం
ద్రద్యావాపృథివీదిశావలయగర్జస్ఫూర్జితాకారుఁ డై. 78

క. రణవిజయము గైకొని పట్టణ ముద్భటసుభటసంకటంబుగ భాస్వ
న్మణిగణధనములు మొదలుగఁ దృణము తుదిగఁ జూఱగొనియెదివిజారి వెసన్.

రావణుఁడు వరుణపట్టణముపై దాడివెడలుట.

ఆ. ఇట్లు భుజగదాసవేంద్రుల నిర్జించి, యసుర మసరుకవిసి యంతఁ బోక
కంధివిభునిపురము కంపువ యారసి, యుద్ధవిడిని బురము నొద్ద కేగి. 80

మ. వరుణుం డెక్కడ నున్న వాఁ డతనిగర్వగ్రంథి మాన్పంగ నే
ర్పరి నై వచ్చితి శస్త్రఘట్టనమునన్ రక్తంబు వోఁ జేసి నా
ఖరతేజంబునఁ గ్రాఁచి పొం గడఁచి చుల్కం జేసి నానాధనా
హరణం బే నొనరింతుఁ జెప్పుఁడు మదీయప్రౌఢి యం చుద్ధతిన్. 81

క. పురబహిరంగణమున మో, హరములు దీర్చికొని యున్న యసురేశ్వరుపై
నురవడిమైఁ దోతెంచిరి, వరుణతనూభవులు రథికవర్గముతోడన్. 82

క. సేనలు సేనలఁ దలపడ, దానవపుష్పకము గగనతలమునఁ గని యు
త్తానలసితరథు లై యం, భోనిధిపతితనయు లతనిఁ బొదివిరి కడఁకన్. 83

క. చీకాకుపఱచి బలుగదఁ, జెకొని యతఁ డేయ వ్రేయఁ జేరువఁ జేరం
గైకొనక తఱిమి యూఁడం, బోక పెనఁగి రంబుధిశపుత్త్రులు గడిమిన్. 84

ఉ. అంత మహోదరాఖ్య లగునంబరచాపవిదగ్ధు లైనదే
వాంతకవీరు లొక్కమొగి నారథసంఘముతోడఁ దాఁకి దు
ర్దాంతభుజాబలంబు ప్రథితంబుగఁ గేతనముల్ హయంబులున్
దంతిసమూహముల్ దునుక తండము లై ధర డొల్ల నేసినన్. 85

ఆ. విరథు లైనయబ్ధి విభుతనూభవులపై, నడరి రౌద్రమున సురారి కేలు
దోయిపదిటఁ బదియు వేయి శస్త్రాస్త్రవి,తతిని బొదివి జర్జరితులఁ జేసె. 86

చ. వెఱచఱవన్ దశాననుఁడు వీరభటావళియుం గడంగి డ
గ్గఱె జలధీశనందనులు గ్రందుకొనన్ రథహీను లైనయు
త్తఱి నుఱుమాడఁ జొచ్చినఁ బరిచారకులఁ గూడి కడంగి పెల్లుగం
బఱచిరి పట్టణంబుదెసఁ బౌరజనంబులు బెగ్గలింపఁగన్. 87

మ. వెఱ నిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించి యం
దఱుఁ బాఱంగ నిశాచరేంద్రుఁడు జయోత్సాహంబునన్ వెన్నడిం

దఱుమంగాఁ బ్రజఁ జేయి వీచుచు సముద్యద్వేగుఁడై తోలి తొ
ప్పఱఁ బెట్టెన్ శరజాలముం బిఱుదఁ గుప్పంగూర నాఁటించుచున్. 88

ఆ. వరుణుబలముఁ దనయవర్గంబుఁ గోట సొ, రంగఁ బొఱ నెగచి రావణుండు
జలదనిస్వనంబుచందంబు నెలుఁ గెత్తి, యెల్లదిశలు నెలఁగ నిట్టు లనియె. 89

క. పడుచులచేతను నీక్రియఁ, బొడిపించిన దశముఖుండు వో నిచ్చునె తాఁ
గుడిచెం గట్టెం గలనికి, నడచుం గా కింక నొదిఁగినం దను నగరే. 90

క. అనుపలుకులకుఁ బ్రభాసుం, డనువరుణామాత్యుఁ డచట నందఱుఁ జన గ్ర
క్కున మరలి యితని నుడిగిం,చినఁ గార్యం బగున యట్ల చేసెద ననుచున్.

చ. వరుణుఁడు పద్మగర్భుఁ గొలువం జనియెం బెఱవారు వచ్చి సం
గరమున నీకు నోడిరి జగద్విదితంబు భవద్భుజాబల
స్ఫురణము గావునన్ దివిజసూదన నీ కెదు రెవ్వ రిందులో
నరయఁగ నిందె కా దెచటనైన నొకండును గల్గనేర్చునే. 92

క. అనిన విని పొంగి తనుఁ బేర్కొని బొబ్బిడి రావణాసురుఁడు ప్రజ మరలుం
డని చేయి వీచె జృంభిత, దనుజసమూహప్రశంసితగుణుం డగుచున్. 93

ఉ. రాజితసౌధపంక్తిరుచిరద్యుతిజాలము పర్వె నిత్యవి
భ్రాజితచంద్రికావిభవభంగిన యెప్పుడునప్పురంబుఁ గే
లీజితవైరి రావణుఁడు లీల మెయిం జని కీర్తికాంతిసం
యోజితరేఖ క్రొత్త యగుచుండఁగఁ జేసి మదం బెలర్పఁగన్. 94

క. మరల విడిసి గెలుపునఁ బొం,పిరివోవుచు లంకఁ దలఁచి పెను పొనరఁ జమూ
వరులఁ బిలిపించి పోదము, పురమున కని చెప్పె దనుజపుంగవుఁ డెలమిన్. 95

చ. పయనము చాటఁ బంచి సులభంబుగఁ బూరియు నీరు వంటక
ట్టియలును గల్గుచోట్లను గడిందిమొగల్ దగుసుక్కళంబుగా
భయ మనుపేరు లేక నిరపాయముగా విడియించుచున్ మనః
ప్రియ మగుభంగి సేన నడిపించె విశృంఖలవైభవంబునన్. 96

చ. బలములతోడ మేదిని నభంబునచేరువ నంతకంబె న
గ్గలముగ నెక్కి సైనికులకన్నుల కందనిచోట డాపలన్
వలపల దవ్వుగాఁ దొలఁగి వాఁగిరి నెచ్చట నేసి వచ్చుఁ దా
నలసినయట్టు లల్పపరివారయుతంబుగఁ బుష్పకంబునన్. 97

రావణుఁడు లోకములోని స్త్రీలనెల్లఁ జెఱలుపట్టుట.

ఉ. ఆసమయంబున న్నగనియాంద్రురు కన్యలు నాక చొచ్చి ధా
త్రీసురరాజవైశ్యులను దేఁకువ సేయక యెల్లజాతులుం
గాసిగ నొక్కపెట్టుగఁ బ్రకాశరహస్యవిభేదహీనుఁడై
యాసురవైరి పట్టెఁ జెఱ లడ్డము లేక మృగాయతాత్ములన్. 98

క. మునిసిద్ధయక్షకిన్నర, దనుజోరగకన్యకావితానము నెల్లం
గొనివచ్చి వచ్చి పుష్పక, మునఁ బెట్టుచు వచ్చెఁ బంక్తిముఖుఁ డనయుం డై. 99

సీ. తట్టికి వచ్చి యిట్టట్టు పోనేరని లేళ్లవిధంబున లీల యెడలి
వలఁ జిక్కి యెక్కడ మెలఁగంగ నేరని చిలుకలచాడ్పునఁ జెన్ను దఱిఁగి
మావునఁ జోరఁబడి యావలఁ జన లేని మీలచందంబునఁ జాలఁ గుంది
యురులలోఁ బడి యెందు నరుగంగఁ జాలని నెమిళులతెఱఁగునఁ గొమరు దక్కి
తే. కలయఁ జూచుచుఁ బలుకంగ నెలుఁగు రాక, నలఁగు మేనులతో నెఱిఁదలలు వీడి
వెగడుపడి వెల్లనై కడు విన్నఁబోయి, పుష్పకంబున నున్న యప్పొలఁతు లెల్ల.

క. కొలఁదికి మీఱిన నెవ్వగ, నలఁదురి నానావిధంబు లైనతమతలం
పులగతి నొర్తొర్తునకుం, దెలియ విలాపములు సేయు తెఱఁ గెట్లనినన్. 101

క. చంపు నొకో యక్కట కా, రింపఁ దలంచు నొకొ లఘుచరిత్రంబులకుం
బంపఁ గడంగు నొకో శం, కింపం డీకఱకుటసుర గీ డొనరింపన్. 102

## రావణునిచెఱం బడిన స్త్రీలు విలపించుట.

మ. మగఁడా నీవు జగంబు వొప్ప మిగులన్ మానంబు వాటింతు వా
లిగ నెగ్గం బగుమాట వాటిలెనె తల్లీ నీకు లోకంబుపా
టిగ నిట్లొంచెనె నిందతోడివగ తండ్రీ యెందుఁ గీర్తింపఁగాఁ
దగునీసంతతి కీడునం దొడరెనే దైవంబు చెద్దుం గటా. 103

తే. చమురు నెత్తురు నవబంధుసమితి గరము, ప్రీతి నఱకాళులకు లఱిచేతు లొగ్గ
నునికి యెక్కడ నీక్రూరదనుజుబారి, కగ్గమై వచ్చు టెక్కడ నకట విధియ.

ఉ. ఇమ్ములఁ దోడ నాడుచెలు లేమను చుండుదు రొకొ యిప్డు నా
తమ్మునిముద్దుమాటలు గొవల్పడఁ బల్కెడుచిల్కబోద ని
త్యమ్మును బొత్తునం గుడుచు సర్మిలిఁ జేద్పడు మవ్వ మెక్కి యొ
క్కమ్మడి నంకురించులత లొప్పు దొఱంగవె నీరు గానమిన్. 105

ఉ. చిత్తము గుంద చుండఁ జెఱ సేయుటకంటె విశుద్ధ మైననా
వృత్తము గోలుపుచ్చుటకు వేగ తలంపక నన్ను లగ్గుగాఁ
గత్తులఁ గోసి దానవులు గండలు దిం డ్రని కట్టిఁ డైనవీఁ
డిత్తఱి నెట్లు లైన సమయింపఁ డొకో దొసఁ గెల్ల మానఁగన్. 106

క. అని పెక్కు తెఱంగుల న, వ్వనితలు దురపిల్లి యిట్లు వనరుచుఁ జదలం
జని చని నలుదిక్కులఁ గనుఁ, గొని పల్కరి తల్లడంబు గూరిన మఱియున్. 107

ఆ. ఇంక నేటిలోక మీదుష్టదైత్యుని, కిట్ల చెల్లె నేని యెల్లి నేఁటి
లోనఁ బాధు గాదె యాసలినాసను, రాజసంబు నిప్పు యోజనముఁగ. 108

చెఱఁ బడ్డయింతులు రావణుని శపించుట.

క. తగు విక్రమంబు సేయుట, యగునే పరసతుల నిట్లు లదయతమై నె
వ్వగలఁ బొగిలింప నతనికి, మగఁటిమి గా నేర్చునే యమంగళ చేష్టల్. 109

చ. పరమపతివ్రతావిభవభాసురలీల వెలుంగుమమ్ము ని
ష్కరుణత నిమ్మెయిం బఱచెఁ గావున నీదనుజాధముండు స
త్పురుషపరిగ్రహం బయినపుణ్యసతిం గలుషింపఁ జేసి త
ద్వరునిపరాక్రమంబున నవశ్యము మృత్యువుఁ బొందుఁ గావుతన్. 110

క. అనవుడు దశాస్యుఁ డాశాపనిహతిఁ బ్రభ సెడియు బాహుబలమదమునఁ గై
కొనక నలి నపహసించుచు, ననుమానము లేక యెలమి నరుగుచునుండెన్. 111

సీ. ఉడుగక కాల్చుచు నుండెడుశోకంబ యతితీవ్రహవ్యవాహనుఁడు గాఁగ
నిట్టూర్పుగాడ్పులు నిగిడించుటయ విలసిల్లఁ బ్రజ్వలితంబు సేఁత గాఁగఁ
బాయక యొనరించు బహువిలాపంబుల రాజితమంత్రాక్షరములు గాఁగఁ
గన్నీరు బోరనఁ గ్రమ్మించుటల పొరిఁ బొరి నాజ్యధారలపోఁత గాఁగఁ
తే. గొలఁది కగ్గల మై యెదఁ గలుగువగల, యొనరుసమిధలు గా నిట్టు లువిదపిండు
రావణాభిచారంబుగ భావమందు, నుగ్రముగ వేల్పు తెఱఁగుననుండెఁ జూడ.

రావణుఁడు దిగ్విజయము చేసి వచ్చి లంకం బ్రవేశించుట.

క. ఇత్తెఱఁగున దశకంధరుఁ, డత్తరుణులఁ గొంచు లంక కరిగెం బౌరుల్
చిత్తము లలరం గానిక, లుత్తమవస్తువులు దెచ్చి యొప్పింపంగన్. 113

చ. ప్రియ మెసఁ బల్లవింపఁగ విభీషణుఁ డాప్తులుఁ దాను నెంతయున్
రయమున భూషితద్విపతురంగముఁ డై యెదురేగి యన్న పా
దయుగము డాయ భక్తిమెయి దండనమస్కృతి సేసినన్ హరా
ద్రి యెగయ నెత్తి కీర్తిఁ బ్రచురించినబాహుల నెత్తెఁ దమ్మునిన్. 114

ఉ. ఎత్తియుఁ గౌఁగిలించి దనుజేంద్రుఁడు లోచనపద్మషండముం
జిత్తసరోరుహంబు విలసిల్లఁ గనుంగొని కుంభకర్ణుఁ డిం
దిత్తఱి మేలు కానఁడె యహీనపరాక్రము లాలిఁ దామసా
యత్తునిఁ జేసె మాలవిధి యం చొకయించుక చిన్నవోవుచున్. 115

క. ఇభతురగస్యందనగతి, రభసంబునఁ బృథివి యద్రువ రక్షోవంశ
ప్రభువు నగరంబు సొచ్చెను, విభవోజ్జ్వలుఁ డగుచు వినయవినుతులు సెలఁగన్.

ఆ. ఒక్కచందురుండ యుదయింపఁ బొంగెడు
నంబురాశి యిది పురార్ణవంబు
దనుజపతిముఖేందుదశకసన్నిధి నుబ్బ
కున్నె యనఁగ వీట నులివు మిగిలె. 117

# పంచమాశ్వాసము.

శూర్పణఖ తనమగనిఁ జంపె నని దుఃఖించి రావణుని దూఱినాడుట.

క. అయ్యవసరమునఁ దనపతి, కయ్యంబునఁ బంక్తివదను ఖడ్గనిహతి రెం
డయ్యె ననిశూర్పణఖ విని, పయ్యెదకొం గెడల బుడమిఁ బడి మూర్ఛిల్లెన్.

చ. సభయము లైనడెందముల సంభ్రమ ముమ్మలికంబుఁ గప్ప సం
క్షుభితసఖీజనం బొలయఁ గొండొకసేపునఁ దేఱి తీవ్రశో
కభరితచిత్త యై మొగముఁ గప్పెడుబాష్పజలంబు లంబుజ
ప్రభ సెడ ముంచు పెన్వఱదభంగిగ నెవ్వరి నేనిఁ జూచుచున్. 119

ఆ. అరుగుదెంచి యన్న యడుగులకడ నార్త
నాద మడరఁ ద్రెళ్లి నాథుఁ బనవి
యేడ్చుచున్న నల్ల నెత్తి యమ్ముద్దియఁ
దడవి కన్నునీరు దుడిచి యతఁడు. 120

క. సముచిత మగు తెఱఁగున శోకము వాపుట కనునయింపఁ గడఁగి తదాలా
పములకుఁ జొచ్చుటయును గోపమునను రక్కసియుఁ గరము ప్రల్లదురాలై.

ఉ. అక్కటికంబు మాలి చెలియల్ వగఁ బొందదె నాకు దీన దూ
ఱెక్కు జగంబునం దనక యింతయుఁ గొంకక పాపవృత్తికిన్
ద్రుక్కక వైర మెత్తి కడుఁ గ్రూరుఁడ వై యిటు సేత చూడఁగా
దిక్కులు గెల్వఁ గాదు నను ద్రెక్కొనఁ బోయితి గాని యిమ్మెయిన్. 122

క. అగ్గలిక మెఱసి కడఁగుచు, మొగ్గరములు గడచి పోయి మును మును మఱదిన్
మ్రొగ్గతిలఁ జేసి దీనికి, సిగ్గువడనినిన్ను నేమి సెప్పదుఁ జెపుమా. 123

రావణుఁడు శూర్పణఖ నూరడించి దండకారణ్యమునకుఁ బంపుట.

చ. అనవుడుఁ గ్రందుఁ గయ్యమున నప్పటికిన్ మనవారు లాఁతివా
రని మది నేర్వరింప వస మమ దురుక్తము లేల యింక నా
తని మగిడింప వచ్చునె వృథాపరితాపము దక్కు నీదునె
మ్మనమున కెట్టు లట్టుల సమస్తధనంబులు వేడ్క నిచ్చెదన్. 124

క. అని యొకభంగిం దననేర్చినయట్టులు సెప్పి తీర్చి చెలియలి నూరా
ర్చినవాఁ డై యవ్వనితకు, మనుజాశనుఁ డిట్టు లనియె మఱియుం బ్రీతిన్. 125

సీ. దండకారణ్యంబు దద్దయు హృద్యంబు శుక్రశాపమున నచ్చోటు దైత్య
వాస మయ్యెడుఁ గాన నీసమయంబున నెలవు గైకొని ఖరు నిల్పువాఁడ
నతఁడు పిన్నమకొడుకయ్యును మనము దా మను భేద మెఱుఁగనియట్టివాఁడు
నీదెస మిగులంగ నెమ్మివాటించు నయ్యెడ నీవు వసియింపు మిపుడ పోయి

ఆ. యిష్ట మగుపదార్థ మెయ్యది యేనియు, ననుదినంబు వేడ్క నడిగి తెచ్చి
యనుసరించి నడపు మని నియమించెద, నేను గలుగ నీకు నేమి కొఱత.

చ. అని యిటు లూఱడించి ఖరు నప్పుడ పిల్వఁగఁ బంచి యాదరం
బునఁ దగు రాజచిహ్నములు భూరిబలంబును నిచ్చి మంత్రులై
చనుఁ డని దూషణుం ద్రిశిరు సత్కృతిపూర్వము గాఁగఁ బుచ్చి యం
దునిచె నతండు శూర్పణఖయుం బ్రియ మందిరి రాజ్యసంపదన్. 127

రావణుఁడు కుంభిల యనువనమున యజ్ఞము సేయుచున్న యింద్రజిత్తుం జూడఁబోవుట.

క. చెన్నొందఁగఁ దనయింటికిఁ, గన్నా కయి మెఱసియుండు గాదిలితనయుఁ
జన్నములు సేయ నడవిన, యున్నాఁ డని విని దశాస్యుఁ డుద్యోగమునన్.

క. అరదమున నేగె సముచిత, పరివారముతోడఁ జెఱల పడఁతులు డెందం
బురియఁగఁ బుష్పకమున ని,ర్భర వేదన నుండ నసురపతి నిష్ఠురుఁ డై. 129

తే. తెరువు సూపుచుఁ జటులకేసరిని నెక్కి, కెలన వచ్చువిభీషణుపలుకు లర్థి
నాదరించుచు నతనిచే నచటివింత, లెల్ల నెడనెడ నెఱుఁగుచు నింపు మిగుల.

క. కుంభిళ యనునుగ్రాటవి, శాంభవ మగునొక్కపూజ్యసత్రముఁ దగఁ బ్రా
రంభించి శివునిచేతను, సంభావితుఁ డైనతనయు సవనము సేరెన్. 131

చ. చనుట యు నాతఁ డుల్లమున సంతస మాననకాంతి వింత సే
య నెదురు వచ్చి తండ్రిచరణాబ్జయుగంబు శిఖాభిరామ మై
ననిజశిరంబు గూడఁగఁ బ్రణామము సేసిన నెత్తి యర్మిలిం
దనపదిదోయిచేతుల నరతం డిఱికౌఁగిటఁ జేర్చె నందనున్. 132

క. ఆదరమున మహితచతు, ర్వేదమహాఖ్యాతమంత్రవిధుఁను శుక్రుం
డాదైత్యపతికి నాశీ, ర్వాదం బొనరించె విప్రవరసహితుం డై. 133

చ. నగుచు దశాననుండు భృగునందనుతో నిది యేమి యీతనిం
బొగఁ బడఁ బంచి యివ్విపినభూమి నిరోధము సేసి దీన మీ
రు గనినలాభ మేమి యమరుల్ దగుభోజ్యము లెల్ల మ్రింగి మో
పుగొనుచు మిమ్ము నాలిగొని పోయిరి వేయును నేల నావుడున్. 134

ఆ. అట్టు లనకు మన్నయసదృశవ్రతుఁ డగు, నీదువరసుతుండు నిరుపమాన
మహిమ వెలయ మున్నబహువిధయజ్ఞంబు, లాచరించి పిదపనభవుగుఱిచి 135

క. మాహేశ్వర మగుయాగము, దోహలమునఁ జేయఁ గ్రతువుతుది నాశివుఁ డ
ర్ధాహితనారీక మ్మగు, దేహం బుద్దామవృషగతిం జెలు వొందన్. 136

మ. దయ నిచ్చోటికి వచ్చి కామగతి హ్యాదశ్వస్యందనంబుం దమో
మయమాయాచరితంబు శాత్రవబలోన్మాథక్రియాదక్షదు
ర్జయశాపంబును దివ్యబాణనిచయస్ఫారానుభావంబు న
క్షయతూణీరయుగంబు నిచ్చెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగాన్. 137

తే. నీవుసను దెంచితనుమహనీయమహిమఁ, బురికిఁదోకొనియరుగంగఁబోవు వేడ్క
నెదురుసూచుచు నున్నంతనేగుదెంచి, తనిన భార్గవుపలుకులు విని సురారి. 138

రావణుం డింద్రజిత్తుఁ గుంభిళనుండి లంకకుఁ దోడ్కొని వచ్చుట.

క. అగుఁ గాక యింకఁ జేయున,ది గలదె పోనిమ్ము సురలుఁ దేఁకువ సెడఁగం
దగ మిఁకఁ జెప్పితి మనకుం, బగ యింద్రుండ కాఁడె యెల్లభంగులఁ దలఁపన్.

చ. అని గురుఁ బ్రీతి వీడ్కొని మహాబలముల్ దనపజ్జ వచ్చినం
గని కరులం దురంగములఁ గాలుబలంబుల నేర్చి యొక్కయొ
డ్డనముగఁ దీర్చి సుందరపటధ్వజదండము లెత్తఁ బంచి తూ
ర్యనినదపూరితక్షితినభోంతరుఁ డై దనుజేంద్రుఁ డున్నతిన్. 140

క. మును రమ్యపదార్థంబులు, గొని వీథు లలంకరించుకొని జనులు గనుం
గొనియెడు వేడుక గుబురులు,గొని యున్న పురంబుఁ జొచ్చెఁ గొడుకుం దానున్.

ఆశ్వాసాంతము.

చ. పరిజనపద్మమిత్రునకుఁ బాతకమిత్రున కన్యసైన్యవి
స్ఫురణలతాలవిత్రునకు సుందరగాత్రున కిందిరామనో
హరసుభగాతపత్రునకు నంబుజనేత్రునకుం బ్రమోదని
ర్భరధరణీకళత్రునకు రాజితగోత్రున కిజ్జగంబునన్. 142

క. లావణ్యవిసరనవబా,లావృతచతురాంగనానయశుచివరునకున్
సేవాగతబహువిధవసు,ధావల్లభసంకటీకృతద్వారునకున్. 143

మాలిని. శతమఖగురులజ్జాసంపదాపాదనోద్య
న్మతికి నమితశత్రుక్ష్మాపసేనాతమోగో
పతికి నిహతశేషప్రత్యయైకార్థకార్య
స్తుతికి విజయమానద్రోహిబాహాసికుర్విన్. 144

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిధేయ తిక్కననామధేయప్రణీతం బయిన యుత్తరరామాయణం బను మహాకావ్యంబు నందుఁ బంచమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# నిర్వచనోత్తర రామాయణము

—•—



## షష్ఠాశ్వాసము.

యుతునకుఁ గాంతిప్రా
లేయరుచికి ధర్మమతికి । లీలాసుమన
స్సాయకునకుఁ బుణ్యాధి
ష్ఠాయకునకు మనుమసిద్ధి । జనపాలునకున్. 1

క. దనుజాధీశ్వరునకు ముచు,మును పుట్టినకొడుకు ధర్మమున నీశ్వరుఁ దృ
ప్తునిఁ గావించి వరంబులు, గనిన సుహృద్బంధుపౌరగణము లెలర్చెన్. 2

చ. మన మలరంగ సద్భటసమాజము నూరెల నిల్వ నెంతయుం
బెనుపున మేఘనాదుఁడు విభీషణుఁడుం దనతోడ రా మదిం
చినకరివోలెఁ బుష్పకముఁ । జేరి మృణాళలతాలివోనియ
వ్వనితలపిండు దైత్యకులవల్లభుఁ డల్లన డించి తెచ్చినన్. 3

మ. తరుణీబృందముఁ జూచి సారకరుణోదారుండు దైత్యేశ్వరా
వరజుం డావలిమోము సేసికొని యేవం బిచ్చరిత్రంబు ని
ష్ఠుర మోహో యని సంచలద్వదనుఁ డై । శుంభద్భుజాగర్వవి
స్ఫురితుం డైననిజాగ్రజన్ముమొగముల్ । సూచెన్ విషాదంబుతోన్. 4

ఆ. తమ్ముఁ జూచునను(గుఁ)డమ్ముని భావించి, నగుచు దైత్యవంశనాయకుండు
పగఱవారిఁ జెఱలఁ । బట్టక మద్దాడి, వత్తు రయ్య శౌర్యవంతు లనిన. 5

చ. గుణ మిది దోష మిట్టి దని । కొంత యెఱింగినఁ గాక యిట్లు ని
ర్గుణతయ పట్టి క్రాలుతమకుం దగువారలు సెప్పసౌమ్యభా
షణము నిరర్థకం బనువిచారము నెమ్మదిఁ బుట్టి యవ్విభీ
షణుఁ డుచితంపుమాటలఁ బ్రసంగము డిగ్గఁగఁ ద్రావి యిట్లనున్. 6

—• విభీషణుఁడు కుంభినసను మధుఁ డపహరించె నని యన్నతోఁ జెప్పుట. •—

క. నీ వరిగినదిగ్జయమున, కీవల మధుదానవేంద్రుఁడే తెంచి పురిం
గావలి యున్నదనుజసుభ,టావలిఁ బొరిపుచ్చి భుజబలాటోపమునన్. 7

తే. ఉవిద లాక్రందనము సేయుచుండ నొక్క
రమణిఁ గొనిపోయె నంతఃపురంబుఁ జొచ్చి

యదియు మనమాల్యవంతుని యనుఁగుఁగూఁతు
వనుఁగుఁగూఁతురు కుంభీనసాభిధాన. 8

ఉ. యజ్ఞరసప్రమత్తుఁ డగునాత్మజుపై సడి వెట్ట లేదు నా
యజ్ఞత నప్పు డేఁ జని సమాధినిమగ్నమనఃప్రవృత్తిఁ గా
లజ్ఞుఁడఁ గాక వారిధిజలంబులలోన మునింగి యుండి య
ప్రాజ్ఞులచేత నాలిఁబడుపాటికి వచ్చితి నేమి సెప్పుదున్. 9

క. అనుడు బొమలు ముడివడునా, ననములఁ గెం పడర నసురనాథుం డేమీ
మనవీ డొకరుఁడు సొచ్చెనె, యనుమానము దక్కి గుండె లదరక చక్కన్.

క. రాసొబగున నున్మత్తుం, డై సెంకింపక కడంగి యాతం డింతల్
సేసెఁ గదె చెడితి రిప్పులి, మీసల నుయ్యాల లూఁగి మెయిమెయిఁ బోయెన్.

చ. చెలియలిఁ గోలుపోయి యెడసేసినఁ జాలమి వెట్టి నవ్వరే
కెలనను గాన నమ్మధువు గీటడఁగించెద దాడి వెట్టి నా
బలిమి దలుంగ నీనడిమి బన్నము విన్న సమర్థ్యు లెంతయుం
జెలఁగక తక్క రందుఁ జని చేతులతీఁటకు మందు సేసెదన్. 12

మధునిపై దండెత్తినరావణుఁడు కుంభీనసప్రార్థనచే వానితోఁ జెలిమిసేయుట.

మ. అని వీటం దనపిన్నతమ్ము నిడి నిప్రాసక్తుఁ డై యున్నత
ష్ముని బోధింపఁగఁ బంపి తోడ్కొనుచు సేము న్సైన ము న్నంచు నీ
సున నాతండును మేఘనాదుఁడును రక్షోవంశవీరోత్సవం
బొనరింపన్ మధుమానమర్దనవిదగ్ధోత్సాహసన్నాహుఁ డై. 13

క. చని మధురాపురి ముట్టిన, విని కుంభీనస భయంబు వినయంబు జనిం
ప నరుగుదెంచి ధరాలిం, గనముగఁ గృప పుట్ట నన్నకాళ్లం బడియెన్. 14

తే. అతఁడు కరుణాసమేతుఁడై యతివ నెత్తి, నిన్నుఁ దెచ్చినపాపాత్ముఁ డున్నచోటు
సెప్పు మిప్పుడ వాని నిర్జించి నీకు, హర్ష మొనరింతు ననిన నయ్యంబుజాక్షి.

మ. తగునే నీయిలు సొచ్చి నన్నుఁ గొని రాదైతేయవంశాధముం
డు గరం బెగ్గొనరించె నైనను భుజాటోపంబు సూపంగ లో
కగరిష్ఠుం డగునీకు వాఁడు దొరయే కన్యాత్వమే నాకు లే
దు గదా పడ్డది కార్య మింకఁ జన దాముష్టాత్ము నిర్జింపఁగన్. 16

క. మధువున కలుగుట యది నను, విధవంగాఁ జేత గాన వే యేటికి వాఁ
డధముం డనలే నెమ్మెయి, వధియించుట పాడి గా దనవద్యవిహీనా. 17

తే. అదియుఁ గాక రాక్షస మన మొదలఁ బరిణ
యప్రపంచంబునం దొకయధమవిధము
గలదు గావున నది గాఁగఁ దలఁచి యైనఁ
దప్పు సైరింపు నాకుఁ గా దళితవైరి. 18

క. అతఁడు నతిబహులనిద్రాయుతుఁడై యున్నాఁడు గాచు టొప్పదె సంబో
ధితుఁ జేసి తెచ్చి సేవారతుఁ జేసెద ననిన దనుజవరా జిట్లనియెన్. 19

చ. అలఁతులఁ బోవుతప్పె యిది యైనను నాతఁడు నేతికుండపై
నెలుక సలంబుఁ బోవిడిచి యేను భవత్ప్రతిఁ గావితిఁ మనం
బలరఁగఁ బోయి నిద్ర దెలిపియుంగ నుపాయము సేయు నాకు నె
చ్చెలి యగుఁ దోడితెమ్మనినఁ జేడియ సమ్మద మంది క్రమ్మఱన్. 20

చ. చని పతి నిద్ర దెల్పి దనుజప్రభు రాకయుఁ దాను బోకయుం
మన మలరంగ బాంధవపుమాటల సంధి దగంగఁ జేసి యా
తనిఁ దమయన్న పాలికి ముదంబునఁ దోకొని పోవఁ బూని వ
చ్చినతన వైనపూనికయుఁ జెప్పిన గొండొక సమ్మతించుచున్. 21

క. మీయన్నకుఁ దేజముగాఁ, బోయి యతనిఁ గంటి నన్ను బోధింపవ యే
నాయనకుఁ జాల నని యిఁకఁ, జేయునదియుఁ గలదె గడవఁ జేసితి తరుణీ. 22

క. ఈచనవు సెల్ల నిచ్చితి, నీచెప్పినయట్ల యతని నేఁ గనియెద మై
త్రీచాతుర్యసమగ్రుఁడ, నై చేసెదఁ బిదపఁ దగుసహాయం బెల్లన్. 23

ఆ. అని యలంకరించుకొని తనసేన సన్నాహసుందరముగ నడవఁ బనిచి
వారణేంద్ర నెక్కివచ్చి బావకుఁ బొడసూపె మధువు పెంపుసొంపు మిగుల.

మధుఁడును రావణుఁడు నింద్రునిపై దండెత్తుట.

ఉ. ఆదశకంధరుం డుచిత మయ్యెడుభంగి మఱందికిం మహా
ప్లావ మొనర్చి పేర్చి యమరాధిపుపై నడవం దలంచు ట
త్త్యాదరలీలఁ జెప్పి తగ నప్పురి నాఁడు వసించి యాతఁడుం
గా దన కెత్తితో నడవఁగా మఱునాఁ డటఁ బోయె నుద్ధతిన్. 25

ఉ. రావణుఁ డిట్లు దేవనగరంబునకుం బలపాదధూళివి
ద్రావితసర్వదిగ్వలయరాజకులుం డగుచుం గడంక మై
బోవు నెడం బథంబున నభోవిభవంబుఁ దిరస్కరించుశ్రీం
గావళి నుల్లసిల్లు రజతాద్రిఁ గనుంగొని కౌతుకంబునన్. 26

ఉ. శూలినివాస మై తెలుపుసొంపునఁ బొంపిరివోవునమ్మహా
శైలముచక్కిఁ జక్కటికి సప్తతురంగముఁ డేగుదెంచి యు
త్తాలపుదేవగేహము సుధం జెలువొందఁగ నందుఁ బేర్మికిం
జాలి వెలుంగురత్నకలశంబువిధంబునఁ దేజరిల్లెడున్. 27

ఆ. అనుచు నగముఁ జేర నరిగి రక్షోవంశకరుఁడు దానిసొంపు గలయఁజూచి
యనుఁగుఁదమ్మునికిఁ బ్రియమ్మునఁ జూపుచు, నిట్టులనియె వేడ్కయొసక మెసఁగ.

## షష్ఠాశ్వాసము.

### కైలాసవర్ణనము.

క. సెలయేఱు వాఱుఁ జెలువగు, శిలపైఁ దజ్జలము దిగుచు సింధురపతి చూ
డ్కుల కొప్పెఁ బుండరీక, స్థలమున మకరంద మానుషట్పదము క్రియన్. 29

చ. అరవిరిగుత్తులం బొలిచి యల్లనిగాడ్పులఁ దూలునీలత
ల్దరహసితోదయంబు సవిలాసతనూవలనంబుఁ గల్గుసుం
దరులతెఱంగు గాఁ బతివిరోధంబున నున్నరసాలపోత మీ
గిరితటభూమికిన్ సరసకేలికి వచ్చినమాడ్కి నొప్పెడున్. 30

క. మనరాక హర్మ్యతలమునఁ, గనుఁగొనియెడు కామినులమొగంబులు వాతా
యనమునఁ గానఁగ నగుచాడ్పున నీతమ్మికొల నొప్పె భూధరముపయిన్. 31

క. ఈవెండికొండశిఖరము, క్రేవఁ దమాలతతి దృష్టికిం బ్రియ మొసఁగం
గా వలఁతి యయ్యె నీలగ్రీవునికంఠంబుకప్పు క్రియ నందం బై. 32

చ. అని గిరిరామణీయకమునందు మనం బెలయించి యద్దశా
ననుఁడు బలంబుఁ దత్తటమునన్ విడియింపఁ దలంచి సన్నివే
శనవిధిసూచనార్థము దెసల్ సెలఁగన్ బటుభేరి వ్రేయఁగాఁ
బనిచి మనోహరం బయినపట్టునఁ దా విడిసెన్ బ్రియంబునన్. 33

ఆ. ఇట్లు విడిసి దానవేంద్రుఁడు బహువినోదములఁ దగిలి చతురసముచితాల్ప
పరిజనములతోడ గిరితటరమణీయతలమునందుఁ గేలి సలిపె నర్థి. 34

క. మగుడఁ జనుదెంచి యర్హ్యం, బగుగతి మజ్జనముఁ గుడుపు నైనపిదపఁ దాఁ
దగ లోపలికొలువున నిం,పుగ సుఖసత్కథలఁ బ్రొద్దు పుచ్చె సరసుఁ డై. 35

ఉ. అంత సహస్రపాదుఁ డపరాచలశృంగతటంబు సేరె దు
ర్దాంతుఁడు దానవేంద్రుఁ డమరప్రకరంబు జయింపఁ బోవుచో
నెంతలు పుట్టునో యనుచు నే పడఁగంగఁ దొలంగి కాలుకొ
న్నంతయు దవ్వుగాఁ జని భయం బడరన్ గిరిదుర్గ మెక్కె నాన్. 36

క. అరుణకరబింబ మస్తశి,ఖరిపైఁ గర మొప్ప బహులకస్తూరీలి
ప్తరుచిరకుచకాశ్మీర, స్ఫురితస్థాసకముచందమున నందం బై. 37

క. మఱి కొంతవడికిఁ జీఁకటి, తఱచై తోతెంచె దశవదనునుద్యోగం
బెఱిఁగి నిశాటబలము గ్రి,క్కిఱియం బలుదెసలనుండి యేతెంచె ననన్. 38

### అంధకారవర్ణనము.

సీ. ఇది చూడ్కిఁ గప్పిన యంతటఁ బోక తక్కటియింద్రియంబులఁ గప్పకున్నె
యిది వెల్లిగైకొని యేచి యిండ్లులు సొచ్చి దివియలఁ బోరిగొనఁగవియకున్నె
యిది నేఁడు శశి గెల్చి యెల్లియే తెంచునన్నలినాప్తు మార్కొని నిలుపకున్నె
యిది వెలుం గనునామ మెల్లను నుడిపి యిజ్జగతి నిం కెటుఁ దాన నెగడకున్నె

తే. నిక్కముగ నివి చీఁకటిగాయొక్క తలఁప, నేమి మాయయొ కాక మునిన్నిట్టితిమిర
మెఱుఁగ మెన్నఁడు నాజనులెల్ల బెగ్గలించునట్లుగఁ గడు నగ్గలించెఁ దమము.

——చంద్రోదయచంద్రికావర్ణనములు.——

తే. యామినీకాంతమృగమదమలఁది మలయ, జమునఁదిలకంబుఁ బెట్టినచందమగుచు
నిఖిలదిక్కులఁదిమిరంబునిండియుండ, నలతిరైయైప్రాఙ్ముఖంబునఁదెలుపుదోఁచె. 40

క. రావణుఁ డమరులమీఁదం, బోవుట విని యతనితోడఁబురుడునకుం బాం
థావలిపై వెన్నవచ్చెం, గావలయు ననంగ నమృతకరుఁ డుదయించెన్. 41

సీ. చిత్తజుచిగురులం జిత్రంబుగా నిడ్డ లలితతమాలపల్లవ మనంగ
రతిపుమాణిక్యదర్పణమున నూనిన కమనీయమృగమదకణ మనంగ
పెడవిల్తులీలారవిందంబుమీఁదికిఁ దివ్వటమై నెరఁగినతేఁటి యనఁగ
వలరాజుసిందూర తిలకంబులోఁ జెలువొందు కాలాగరుబిందు వనఁగ
ఆ. సుదయరాగమహిమనుజ్జ్వలం బైనపింబంబు నడుమలాంఛనంబు చెన్నుఁ
జేయఁ బూర్వశైలశిఖరదేశంబున, నిందుఁ డొప్పె భువన మెలమి మిగుల. 42

ఉ. పంబినకెంపుఁ బాసి దివిఁ బ్రాఁకి దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరు నేసి కుముదంబులఁ బండువు సేయఁ బంచి య
బ్జంబుల నిద్ర పుచ్చి మరుసాయకముల్ గరసానఁ బట్టి కో
కంబుల నేఁచి లోకముపొగడ్తలు సేకొని చంద్రుఁ డున్నెడన్. 43

క. బడి చేసినచందంబునఁ, గడువేగం బొకటి నొకటిఁ గదిసి దివిని సం
దడి గా నెంతయు గుంపుగఁ, బడి వెన్నెలకుం జకోరసంతతులు గవిసెన్. 44

క. ముసు ముసు నెగడెడురశ్ముల,గొన లెల్లం బట్టికొని చకోరంబులు ద్రుం
చిన నచట నచటఁ దఱఁగలి,గొనిపెరిఁగెడుమాడ్కిఁ దలముకొనిప్రభ లెసఁగెన్.

తే. తివిచి నవకంబు పీఁప్రులు త్రెంచి యలఁతి
తునియలుగఁ జంచుపుటములఁద్రుంచి తల్లు
లాదరంబున నందియీనట్టు లెత్తి
ప్రీతిఁ గముచుఁ జకోరంబుపిల్లగములు. 46

క. చంచులఁ గాంతులు వెన్నెలఁ, జించి యమృత ముట్ట నొసఁగుచెన్నునకును రా
గించుచుఁ జవిఁ జొక్కుచుఁ గబళించుఁ జకోరికలు సముదలీలాలస లై. 47

సీ. క్రమ్మి పైఁ దొరఁగెడు కౌముదితీయంబు సొంపునఁ దనుపునఁ జొక్కిచొక్కి
పచరించుచంద్రాతపంబు కాలువలలో నడ్డంబుగా నిల్చి యీఁగి యీఁగి
వెల్లువపెల్లు సూపెడుసాంద్రచంద్రికాపూరంబు గని మదిఁ బొంగి పొంగి
మిన్నులతోఁ బాయువెన్నెలకడుల నెఱకలు సడలించి యీఁది యీఁది
ఆ. చెలఁగి చెలఁగి మలఁగి మలఁగి యల్లల్లన, క్రాలి క్రాలి బిట్టు తూలి తూలి
సమదవృత్తిఁ గేళిసలిపెఁ జకోరచయంబు సదలు దమమయంబు గాఁగ. 48

క. తడఁబడ నొండొంటికి ము, న్నెడఁ గముచుచు నొడిసికొనుచు నేపునఁ బైపైఁ
బడుచు నవు లవుల నీసునఁ, గడచుచు వెన్నెలఁ జకోరగణ మాసునెడన్.

క. తినుగమి నొల్లక యొకయెడఁ, దనయిచ్చకు వచ్చునిందుధామని కాయం
బున మవ్వ మెక్కి నిగిడెడి, కొనలు గమిచి మేసె నొకచకోరము దివుటన్. 50

ఉ. సమ్మదవారి గన్గడలఁ జాలుగ మై గరుపార నిందుబిం
బమ్మున దృష్టి నిల్పి పయిఁ బ్రాఁకుమరీచుల నూఁగునూఁగు లేఁ
గొమ్మలు వట్టి చంచుపుటకోటిఁ గదల్చి తెమల్చికొంచు సౌ
ఖ్యమ్ము విహంగమ మ్మయినయాకృతి నొందెఁ జకోర మొక్కెడన్. 51

చ. కలయఁగ నూనునట్లుగ జగంబు సమస్తముఁ జాలఁ దోఁగెనో
జలజభవుండు గోరి పెఱచాయల నెల్లను మాన్చి యొందుసుం
దెలుపు ఘటించెనో యమృతదీధితి వేడుక విశ్వరూపుఁ డై
నిలిచెనొ నాఁగ నెల్లెడల నిండఁగ వెన్నెల పర్వె సాంద్ర మై. 52

క. వెన్నెలపోఁతపనులొ యన, వెన్నెలగండరువుపనుల విధమున మీఁదన్
వెన్నెలనీరు వఱపి రనఁ, గన్నుల కిం పొసఁగె నిల సకలరూపములున్. 53

చ. అలసత యొప్ప నల్లన రతాంతమునం బ్రియుపొద్దఁ బాసి నె
చ్చెలికడ కేగుదెంచు సరసీరుహనేత్ర విలోచనంబులం
దలఁకెడుమందహాసము విధంబున సొంపున మీఱి యున్న చెం
గలువలలోన నింపడరు కౌముది వేడ్క లొనర్చెఁ జూడ్కికిన్. 54

సీ. భరితసుధారసపాత్రంబు లనుకుముదోత్కరంబులు దళుకొత్త మెఱసి
చంద్రకాంతోపలజలముల కాలువ లివి యవి యని యప్పు డేర్పరించి
దెసలు సూడఁగ గుండెదిగ్గనుచక్రసమూహంబునకుఁ దలముసుక లగుచు
నీఁదుచకోరంబు లెగుర ప్రేఁగై యీఁడిగిలఁ బడునట్లుగా దలముకొనుచు
తే. నంతకంతకుఁ బొంగి మిన్నంది వెల్లి, మిగిలి యెసిమిదిదిక్కులమీఁదఁ బొరలి
జనము లానందమునఁ దేల జగములెల్లఁ, దొట్టె నిండారువెన్నెలనిట్టవొడిచె.

తే. వివిధవర్ణ మై యసురేంద్రు వీడు విడిసి
యుండెఁ జంద్రిక పర్వ నక్కొండ యొప్పె
మెఱయుపులితోలు గట్టి మైఁ దఱచు గాఁగ
భూతి యలఁదినభూతేశుపోలుపు దాల్చి. 56

## రంభారావణసంవాదము.

ఉ. అత్తఱిఁ జంద్రుఁ జూచు మలయానిలు రాకకు స్రుక్కుఁ గామినీ
వృత్తము లాత్మ నెక్కొలుపు వెన్నెలఁ గోరి రమించుచున్నయు
న్మత్తచకోరదంపతుల మచ్చికకున్ మది మెచ్చు లోలుఁ డై
యొత్తినవేడ్కలన్ వెడలి యేకత మేగి దశాస్యుఁ డొక్కెడన్. 57

ఉ. అప్పు డొకర్తు గొంచెమగు నాభరణంబులు సన్నపూఁతయుం
గొప్పిడి త్రిప్పిలోఁ జెరివికొన్న నడంగినపూవులుం బయిం
గప్పినచేలకొంగునునుఁ గప్పును మెల్పున నేగుమెట్టలేఁ
జప్పుడు చెన్నుఁ జేయుగతి చందము వింతగఁ బోవునయ్యెడన్. 58

మ. కని వేగంబున నడ్డ మేగి యతఁ డాకంపించునక్కాంతకే
లనురాగంబునఁ బట్టి యెవ్వతెవు నీ వత్యంతకౌతూహలం
బున నెచ్చోటికిఁ బోయెదన్న నది యంభోజంబుచందాన నా
నన ముజ్జృంభణ మందఁ బెంజెమట మేనం గ్రమ్మఁగా నిట్లనున్. 59

చ. అతులితధైర్యసాగరకరుణాలయమానస యేను రంభ నా
పతి నలకూబరుం డతనిపాలికిఁ బోయెద నన్యచిత్తనై
యతివ సనంగ నెందు నిటు లడ్డము వత్తురె నాదు పేరుఁ బో
వు తలఁపు వింటి పాయు నగవుం దగుమాత్రయ కాక యొప్పునే. 60

క. పోలఁతుక యిమ్మెయి నేర్పడఁ, బలుకఁగ వెండియును మరునిబాణంబులకుం
గోలఁ దై యొప్పనివేడుక, చులుకఁదనము సేయ నయ్యసుర యిట్లనియెన్. 61

చ. పడఁతుక యేను రావణుఁడ బాహుబలంబున నింద్రువీటిపై
నడచుచు నుండి యున్నగమునన్ విడియించితి నేన నిప్పుడి
య్యెడి కలవోక వచ్చి సొగయించువిధంబునఁ బోవుచున్న నిన్
బొడగని కాముబల్మితకముల్ నను నిమ్మెయి వెఱ్ఱిఁ జేసినన్. 62

ఉ. చిక్కితి నిష్టభోగములు నేకుఱుఁ బెంపును దేజ మెక్కఁగా
డక్కినబంట నైతి నొకటం గొదలేక జగంబులెల్ల నీ
వెక్కటి యేలు మన్న హరిణేక్షణ పంక్తిముఖుండ వేని నే
నక్కట నీకుఁ గోడలఁ గదయ్య తొలంగు తొలంగు నావుడున్. 63

ఆ. కొడుకుపెండ్లమైన కోడలు గాక పూఁ,బోఁడి యిట్లు దెసవె పోయిపోయి
నీవు మాటలాడ నేర్తు గదా యని, యెట్టు లేని నాదు టిది క్రమంబె. 64

క. అనిన నసురేంద్రు పలుకులు, విని నవ్వుచు మీఁద లోకవిశ్రవసునకున్
జనియించుట యెఱుఁగనె యా, ధనదుండును నీవు నన్నదమ్ములు గారే. 65

క. అతనికొడుకు నీకును గొడు, కతనిసతి నీకుఁ గోడ లని నైజము చె
ప్పితిఁ గాక తప్పు గలదే, యతఁడు నతఁడు నీకు మాన్యు లగుదుర కాదే. 66

క. ఏ నీకు భక్తి సలుపఁ, గా నుపలాలనము సేయఁ గలవాఁడవు నీ
వీ నెఱితప్పినమాటలు, దానవకులనాథ యిట్లు దగునే యాడన్. 67

క. అని రంభ సిగ్గువడఁ బల్కిన దానికిఁ గొంకుకొసరు లేక దశముఖుం
డనుమానింపక యిట్లను, మనసిజదందహ్యమానమానసుఁ డగుచున్. 68

చ. ధనపతి యన్న యే నతనితమ్ముఁడ నానలకూబరుండు నా
తనయుఁడ యింత నిక్కువము దానికిఁ గాదన నాకు నప్సరో
వనితలు వింత యైరె యనివారణ నెట్లయినం జరించునీ
వును గులభామవోలెఁ దగవుల్ ఘటియించెదు వైశికంబునన్. 69

క. విచ్చలవిడియై యున్నెడ, మెచ్చక ననుఁ ద్రోచి పోవ మేలే తమకం
బచ్చుపడునట్లుగా సిరి,వచ్చిన మోఁకాలు సూపువారుం గలరే. 70

క. నాకంటె మిగులువిటు నీ,లోకమునన కాదు దిగువలోకంబులఁ బై
లోకముల వెదకఁ బోయిన, నీకుం బడయంగ వచ్చునే హరిణాక్షీ 71

ఉ. నావుడు నమ్మృగేక్షణ మనంబున రోయుచు నేను లంజియం
గావుడు వానితోడితమకం బని లంజియ గాదు ప్రేమస
ద్భావ మెఱుంగ వైతి గుణభాగివిపో నినుఁ గోర్కె సెందునే
నీవచనంబు తప్ప కట నీళ్లులపట్టున నేయి మందొకో. 72

క అని మొగమోడక విరసవ,చనముల భంగింప నాదశముఖుం డుస్మ
త్తునిగతి నంతయు వినియును, విననిచెవులు సేసి లావు వెరవును మెఱయన్.

క. అంగనఁ బొదివి సగాఢా,లింగనముగఁ దా మ్రుచ్చూడలీలాచతురా
నంగక్రీడాసంగతి, నెంగిలి గావించె మదము నేర్తెఱ మిగులన్. 74

సీ. పగరాజు పైవచ్చి బలువిడిఁ బరిభవించినఁ దలంకినపురిశ్రీవిధమున
సమదద్విపము కేళిసలిపినఁ జాల నలంగినయుద్యానలక్ష్మికరణి
ఘనలులాయము సొచ్చి తనయిచ్చ నాడినఁ గలఁగిననెత్తమ్మికొలనిభంగిఁ
గడుబెట్టిదపుగాలి సుడిసిన నెఱి దప్పి తిరిగినమవ్వంపుఁ దీఁగెమాడ్కి
తే. మున్ను గైసేసియలవడ్డచెన్ను దప్పి,యొలమిఁ బ్రియుపాలికేగెడుకలిమియడంగి
వేఱచంద మై యెంతయు విన్ననయ్యె, నసుర గారించి విడిచిననమ్మృగాక్షి.

క. వెలవెలఁ బాఱుచుఁ గొంకుచుఁ, దలరుచు నడఁ దొట్రుపడుచు వలఁకుచుఁ దనలోఁ
బలుకుచు నెడనెడ నిలుచుచు, నలకూబరుకడకు నింతి నలఁగుచుఁ జనియెన్.

### నలకూబరుఁడు రావణుని శపించుట.

చ. చని ధరఁ జాగి మ్రొక్కి తనచందముఁ జూచి విషణ్ణుఁ డైనయా
తని కఱ లేక చెప్పిన నతండు ప్రభావమునన్ సమస్తముం
గని కలుషించి యింక దశకంధరుఁ డెవ్వతె నైన నీక్రమం
బునఁ బయిఁ బడ్డ నప్డ మృతిఁ బొందఁ గలం డని శాప మిచ్చినన్. 77

ఆ. తివిరె నంబరమున దేవతూర్యరవంబు, గురిసెఁ బుష్పవృష్టిసురగణంబు
సంతసిల్లె దీని నంతయు నేర్పడ, వినినసతుల కెల్ల వెఱపు వాసె. 78

క. నలకూబరుశాప మెఱిఁగి, యొలమి దఱిఁగి పంక్తివదనుఁ డిది మొదలుగఁ దా
బలిమిం బైపడ నెన్నఁడుఁ, జెలువల నని నిశ్చయించె జిత్తములోనన్. 79

ఉ. కొండలపాటునన్ మనము గుందినఁ గంటికి నిద్ర రాక సే
సం దెలిపించి యప్డు పయనం బయి దైత్యవిభుండు వోవ సం
క్రందనుఁ డంతయున్ విని సురప్రకరంబులఁ గూర్చి రాత్రిమైఁ
గ్రందుగ నానిశాచరులరాకకు నాకము సంచలింపఁగన్. 80

రావణుఁడు దండెత్తి వచ్చుట విని యింద్రుఁడు విష్ణునిఁ గాన నేగుట.

క. ఆదిత్యమరుద్వసురు,ద్రాదిదివిజగణము లెల్ల నప్పుడ భూభృ
ద్భేదికడ కేగుదెంచె న,గావరదుర్దాంతభుజబలాటోపమునన్. 81

ఉ. వారల మోహరింపుఁ డని వాసవుఁ డేగె నుపేంద్రుఁ గాన నం
భోరుహనాభుఁడుం ద్రిదశపుంగవు సత్కృతుఁ జేసి రాకకుం
గారణ మేమి యన్న దశకంఠుఁడు మాపయి వచ్చె నీవునుం
బోరికి వచ్చి దేవగణముం గృపఁ గావుము దేవ నావుడున్. 82

చ. హరి సనుదెంచె నాజికి దశానను నోర్వక రిత్త యెట్లొకో
మరలెను జాలఁ డొక్కొ యసురమాటవడం బనిలేదు బ్రహ్మచే
వరములు గన్నగర్వమున వచ్చె నలంతులఁ బోఁడు వానికిం
బరువము గాదు కాలపరిపాకము వచ్చిన నేన తీర్చెదన్. 83

క. దేవఖచరాదిజాతుల,చే వానికిఁ జావు లేదు చెప్పెదఁ బిదపం
గేవలమును బోఁ డంతకు, నీవరుసకు నీవ చాలు దెల్లవిధములన్. 84

ఇంద్రుఁడు యుద్ధమునకు వెడలుట.

చ. బలరిపుతోడ నిట్లు హరి వల్కిన నాతఁడు నట్ల కాక యం
చలఘుపరాక్రమస్ఫురణనాహవదోహలచిత్తయుక్తుఁడై
తెలతెల వేగునంతఁ జనుదెంచి బలంబులు గూడఁ దేరు మా
తలి గొని వచ్చినన్ గిరికిఁ దాఁకెడుకేసరిమాడ్కి నెక్కినన్. 85

క. ఉడుపతి దోతెంచినఁ బొం,గెడుజలనిధికరణిఁ బోరికిన్ వజ్రి వడిం
గడఁగుట గనుఁగొని ఘోషం, బడరఁగ సురసైన్య మధికహర్షము నొందెన్.

ఉ. అంత సరోరుహాప్తుఁ డుదయం బరుదెంచె నిశాచరుల్ పరా
క్రాంతి దగం గడంగి యమరావతి కేగిరి వారు రాత్రిమై
నెంతయు నగ్గలం బగుదురే బొడసూపెదఁ గాక దేవతల్
సంతస మందఁగా ననుచు సత్వరుఁడై చనుదెంచె నొక్కొనాన్. 87

చ. కమలవసంబు చేసినయగణ్యతపంబుఫలంబు చక్రయు
గ్మములముదంబుప్రోక త్రిజగంబుల కన్నులబ్రహ్మవిష్ణురు
ద్రమహిమ లొక్కలై కలయఁ గ్రాఁచినయుండ త్రివేదమూలకం
ద మని నుతింప నొప్పెసఁగెఁ దామరసప్రియబింబ మత్తఱిన్. 88

సీ. దళము లొండొంటిసందులను సమాలోలవలయంబు సడల మొవ్వంబు గవిరి
యుడరి కర్ణికలలో నంటిన కేసరంబులు దల మెక్కుచుం బొదలఁ బొంగి
సుడిగొని వెడలంగఁ గడఁగు క్రొత్తావి యల్లన మీఁది కెగయఁగ మొనలువిచ్చి
యొండొండ మకరంద ముప్పొంగి నలుగడ నిండి పైఁ బొరలంగ నెఱయ విరిసి
ఆ. మధుకరములఁ గలసి మలసియుఁ దమలోన, లలితగంధవహుఁడు నెలిమి సేయఁ
గమల సంతసమునఁ దమయంద వసియింపఁ, జాల నుల్లసిల్లె జలరుహములు.

చ. అరదము నెక్కి లోచనసహస్రము కాంతి వెలుంగఁ బొల్పు ని
ర్జరపతిఁ గన్నులారఁ గని సంతసమం దెడువారితోడిమ
చ్ఛరమున నెక్కె నా నుదయశైలముమీఁద సహస్రదీధితి
స్ఫురణ దలిర్ప నొప్పు రవిసొంపున జృంభణ మొందె నబ్జముల్. 90

తే. అప్పుడసురేంద్రుసైన్యంబు లమరపురము, దవ్వులే దంచుఁ గట్టాయితంబు నేసి
కూడి నైరృతి యారణ్యక్రీడ కమరఁ, బడగ లంతంతఁ గ్రాలంగ నిడము నొప్ప.

క. పదపదఁ డంచు దిశలు గ్ర, క్కదలఁగ లేయెండచాయఁ గడు నుగ్రము లై
యెదురం గొందఱు గల రని, మది నించుక సరకుగొనక మదమున నడచెన్. 92

ఉ. చిత్రముఁ జూపిన ట్లసురసేనలు దుర్దమలీలఁ గిట్టినన్
వృత్రవిరోధిసైన్యమును విక్రమసంపద సొంపు మీఱ లో
కత్రయపూజ్యుఁ డప్పుసునికాయమునందుఁ బ్రసిద్ధుఁ డైనసా
విత్రుఁడు మున్నుగాఁ గడఁగి వీఁక నెదిర్చెఁ జెలంగి యార్చుచున్. 93

దేవదానవసేనలు పరస్పరము తలపడి పోరుట.

క. ఉభయబలముఁ దలపడి లో,కభయంకరభంగిఁ బోరఁగా రక్తనదుల్
ప్రభవించె నంబుచరస, న్నిభ మైనయమిత్రగాత్రనికరం బడరన్. 94

ఆ. దనుజబలము నొచ్చి వెనుకకు జరగ న,కంపనప్రహస్తఖరనికుంభ
దూషణప్రచండధూమ్రాక్షశుకసార,ణాదిసుభటకోటి యార్చి తాఁకె. 95

శా. ఆవీరావలి కీడఁ బోక మహనీయస్థైర్యసారంబునన్
దేవానీకము కుంతఖడ్గపరిఘాదిప్రౌఢిదుర్వార మై
సావిత్రోద్భటబాహువిక్రమకళాసాహాయ్యసంజాతశౌ
ర్యావేశంబునఁ బోరె రౌద్రరసవ్యాప్తాకారఘోరంబుగాన్. 96

క. అమరులు వోదుట దానవ, సమితికి భర మగుడు సరభసంబున నిజనా
మము ప్రకటించి యదల్పుచు, సుమాలి సావిత్రుఁ దాఁకె సురలు దలంకన్.

మ. పటువేగంబున శాతభల్లచయసంపాతంబునన్ మింట మి
క్కుటమై పర్వ ధగద్ధగీయ మగుచుం గోపంబు రూపంబు లై
చటులక్రీడఁ జరించున ట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి రు
త్కటదర్పోద్ధతు లై పరస్పరజయాకాంక్షా ప్రచండంబుగన్. 98

క. ప్రదరంబుల సావిత్రుఁ డ, రదముం బొడి సేయఁగా విరథుఁ డై నయెడం
గదిసి గద యెత్తుకొని తల, చిదురుపలుగ వ్రేసె దైత్యసేనలు దలఁకన్. 99

క. దైతేయవంశవల్లభు, మాతామహుఁ డైనయాసుమాలి పడుటయున్
భీతిం దెరలిన దనుజ, వ్రాతముఁ గని కోపవేగరక్తాక్షుం డై. 100

శా. అగ్నిచ్ఛాయముఁ గామగంబు నగు తే రత్యుగ్రుఁ డై యెక్కి యా
భుగ్నభ్రూలతికాసహోదర మనం బొల్పొందుచాపంబు సు
ద్విగ్నారంభత నెక్కు వెట్టి శరవార్ధిన్ మేఘనాదుండు ని
ర్మగ్నాకారులఁ జేసె నిర్జరుల శౌర్యస్ఫూర్తి శోభిల్లఁగన్. 101

క. పేర్చునరదంబు ప్రబలం, గార్చిచ్చువిధమున నతఁడు గడగినఁ బటుబా
ణార్చులు గవియుడు నిర్జరు, లేర్చినతరువులును బోలె నే పేది రనిన్. 102

మ. అసురాధీశతనూజుకోల్తలకుఁ గా కత్యంతభీతిం గలం
గి సురానీకము సూరెగిల్లిన పణక్రీడాదరం బారఁగా
రసికుం డై రథ మెక్కి గోముఖుఁడు సారథ్యంబు సేయం గడున్
వెసఁ దాఁకెం ద్రిదశేంద్రనందనుఁడు దోర్వీర్యం బవార్యంబుగాన్. 103

క. దైతేయుఁ డవర నిట్లని, కేతెంచినఁ గాంచి దానవేశ్వరుతనయుం
డాతనిసూతుం డగు నా, మాతలిసుతు మేను బాణమయముగఁ జేసెన్. 104

క. అతఁ డాతనిసారథ్యమై, శితశరములు నించుటయును జెలఁగుచు వడిఁ ద
చ్చతురంగంబులుఁ దాఁకెను, బ్రతిభటరథతురగదంతిపత్తులు సెదరన్. 105

ఉ. అత్తఱి మేఘనాదుఁడు జయంతు శరావలిఁ ద్రుంచి వాని మై
నెత్తురువఱ్ఱు సేసి రథినిం బొడి సేసినయంతఁ బోక యు
ద్వృత్తిఁ గడంగినం దమము పీటుకొనం గవియించె దృష్టియుం
జిత్తము లావు మాలి సురసేనలు బెగ్గిల సగ్గలంబుగన్. 106

క. చీఁకటి గవిసిన విబుధా, నీకం బొడి చన నైన నేరద హృదయ
వ్యాకులత మునింగి భయో, ద్రేకముపడి తెగువ దలరి త్రిప్పికొనంగన్. 107

క. ఆమాయాతిమిరము పౌ, లోమీజనకుఁ డగునప్పులోముఁ డెఱిఁగి సు
త్రామతనూభవునకు నది, యేమిటఁ బో దంచు నచటి కేతెంచె వెసన్. 108

ఉ. వచ్చి జయంతు నాఁగి యసురవారణ: బర్వేడు నీతమంబు ము
న్నిచ్చె జయార్థ మై యభవుఁ డీతని కీరిపుచేతఁ జచ్చినన్
వచ్చెడి దేమి సంగర మవశ్యముఁ జేయఁగ నీను వార్ధిలోఁ
జొచ్చుట చాలఁ గార్య మనుచుం బలిమిం గొని పోయె డాఁగఁగాన్. 109

తే. అమరపతినందనుఁడు పాఱవడఁగి చనిన, నసురమాయయు నుడివోయెనట్ల కాదె
యదరి దరికొని మండుతీవ్రానలంబు, పుడుక లెడ గల్గ వైచినఁ బొనుఁగువడదె.

క. ఇవ్విధమున నింద్రసుతుం, డెవ్వరు నెం దరుగుటయును ƒ నెఱుఁగక యుండం
గ్రొవ్వాఱి తనసరివారలు, నవ్వేట కియ్యకొని పోయె ƒ నవిజృంభితుఁ డై. 111

క. దనుజాధీశ్వరుతనయుం, డనిమిషు లనుహాంసముల రయంబునఁ బఱపం
దనయారుపు లెలుఁగున మే,ఘనాదుఁ డను పేరు సార్థకంబుగఁ జేసెన్. 112

ఆ. ఇట్లు దనతనూజుఁడే వేది సైన్యంబు, గాసి యగుడు నలిగి ƒ వాసవుండు
కెంపు గన్నులందు ƒ బెంపారుచుండఁ జెం,గలువకొలనిమాడ్కిఁ ƒ జెలువుమిగిలి.

ఉ. మాతలిఁ జూచి దానవసమాజము దర్పము మీఱె నిత్తఱిన్
వాతజవంబునం గడఁగి ƒ వారక వీరికి సమ్ముఖంబుగా
వే తురగంబులం బఱపు ƒ విక్రమసంపద యుల్లసిల్లఁగాఁ
జేతులతీఁట వో నుఱుము ƒ సేసెద నెవ్వఁ డెదిర్చి వచ్చినన్. 114

క. అనుచు నిజబలము నిలునిలు, మని కరతల మెత్తి నిలిపి ƒ యదలిచి సమరం
బునకు మగుడఁ బురికొల్పుచుఁ, దనచుట్టును సున్నదొరలుఁ దానును గడఁగెన్.

చ. ఎదురుగ వీచె నిష్ఠురసమీరము లుల్కము లుగ్రభంగి నె
ల్లదిశల డుల్లెఁ బెల్లుగ బలంబులపైఁ బెసుగ్రద్ద లాడె బె
ట్టిదముగ మ్రొగ్గి యభ్రకరి ƒ డిల్లపడెన్ వెస నందనంబు గ్ర
క్కదలఁగఁ గూసె నొక్కట సృగాలము లప్రియసూచకంబు లై. 116

క. కలయంగ దుర్నిమిత్తం,బులు పుట్టినఁగనియు వినియుఁ ƒ బోలివోవనియ
గ్గలికమెయి నెమ్మనమ్మునఁ, దలఁ కొకయించుకయు లేక ƒ దర్పోద్ధతుఁ డై. 117

క. సురపతి గడఁగుడు దనుజుల, బరవస మెక్కింత మట్టుపడుటయు దశకం
ధరుఁడు సమరోత్సుకుం డయి, యరదము సన వసము గాకయుత్యుగ్రముగన్.

క. అమరవిభుం దలపడఁ జను, సమయంబున నడ్డపడియె ƒ సంభ్రమలీలన్
సమదుఁ డగు మేఘనాదుఁడు, దమతండ్రిరణంబు మాన్చి ƒ తాన కడంకన్. 119

చ. తలపడి యింద్రుతోడ నతిదారుణయుద్ధము సేయఁ జొచ్చినన్
బలము బలంబుఁ దాఁకుటయు ƒ బాసటగా వడిఁ గుంభకర్ణుఁ డు
జ్జ్వల మగుశూల మెత్తికొని ƒ వచ్చి యుగాంతపురుద్రు కైవడిం
జెలఁగుచు నార్చి మోహరము ƒ చెంగటఁ దాఁకె భయంకరంబుగన్. 120

క. అదరి మొన లిక్కడక్కడ, వడిఁ దిరిగిన దిశలు బడలు ƒ వడ రౌద్రము చూ
ప్పడ బాహుశక్తి యేర్పడఁ, గడిమి పొగడ్తవడఁ గుంభకర్ణుఁడు పోరెన్. 121

క. ప్రతివీరుఁ డొక్కరుఁడు లే,కతులబలుం డైనహీనుఁ ƒ డైనను నప్పా
ట తనకు గుఱిగా సురవడి,నతండు ముసుకూడి సురల ƒ నందఱఁ దఱిమెన్.

ఆ. ఎదిరి తేరినొగయు ƒ నిభముదంతంబును, దనకరంబుఁ బాదతలము లోను
గాఁగ నాయుధములు ƒ గానివి లే వయ్యె, నరివిమర్దనమున ƒ కతని కపుడు.

క. అంతకు ముందట యీవృ,త్తాంతము విని తోడుపడుట కని సత్వరులై
యంతకవరుణధనేశులు, దాంతిమెయిన్ వచ్చువారు తదవసరమునన్. 124

క. తమతమబలములతో సం,భ్రమగతిఁ బఱతెంచి దివిజపతికిం బొడసూ
పి మనుజభోజనసైన్యము, సమయింపఁగఁ జొచ్చి రధికసంరంభమునన్. 125

క. చిచ్చునకుఁ దోడు గరువలి, వచ్చినక్రియఁ బోర నమరవరులమొనలకున్
హెచ్చుగ దిక్పతిసేనలు,వచ్చుటయును మ్రొగ్గె నసురసర్గము గలయన్. 126

ఉ. సన్నబలంబులైననిజసైన్యములం గని రావణుండు శౌ
ర్యోన్నతుఁడై నందనుని నొప్పరికించితిఁ గుంభకర్ణుఁడుం
గన్నది లేదు మెల్ల మురికాలు దిగీశులు వచ్చి రేను బో
కున్న భరంబు గాదె యనియుద్ధతిఁ బేర్చి రథాధిరూఢుఁడై. 127

శా. సొంపారంగఁ బసిండి పైఁ బఱపినన్ శోభిల్లువిల్లందమై
శంపావల్లిక నిల్చి పొల్చుగతి భాస్వత్కాంతిఁ జెల్వొందమై
పెంపుం జాయయుఁ గాలమేఘ మన నాభీలంబుగా దిక్కులా
కంపింపం బటుబాణవర్షమున నాకాశం బడంగించుచున్. 128

క. అరదంబున యురవడికిం, దెరలి తెఱపి యిచ్చి సురలు దిరుగుడువడ ని
ర్జరపతిరథంబునకు భీ,కరగతి సమ్ముఖముగా వేగం బఱపుటయున్. 129

చ. వదనసరోజకాంతి శరవర్షమునన్ మొగిడింపఁ గాన న
య్యెడ దశకంధరుం డిచట నెచ్చట లేఁడు తనూజుఁ జూపి తా
ను దొలఁగి యున్నవాఁ డతని నొంపక గెల్వఁగ రాదు రాఁడె దు
ర్మదమున నంచు నున్న బలసూదనుఁ డాహవదోహలంబునన్. 130

తే. ఏచి మాతలిఁ గనుఁగొని యిటులు వచ్చు, దనుజుతేరికి నెదురుగా మనరథంబు
శీఘ్రగతిఁ బోవ నిమ్మని చెప్పె మార్వి,భీకరధ్వని దిక్కులు పిక్కటిల్ల. 131

శా. రుద్రాదిత్యమరుద్వసుప్రభృతులార్భటుల్ నింగి ముట్టంగ వీ
రోద్రేకంబున దాపలన్ వలపలన్ హోరాటమై ముంచి స
ర్వద్రోహిం బరిమార్త మంచు వికటభ్రామ్యద్భుజామండలీ
రౌద్రప్రాకారతఁ దాఁకఁ దాఁకె రిపుధైర్యస్రావణున్ రావణున్. 132

తే. ఇట్లు దాఁకుడు దశకంఠుఁ డేపు మిగిలి, యందఱకు నన్ని రూపంబులైనయట్లు
వివిధశస్త్రాస్త్రకేళీప్రవీణబాహు, దండనికురుంబదుస్సహోత్సాహుఁడగుచు.

క. వడి నడరుచుఁ దెరలుచుఁ బై, పడి పోక వెనంగునమరబలమునకుం గీ
డ్పడక నిలిచి మెఱసెను బలు, కడళ్ల కెదురైనతటాతికరణిం దిరమై. 134

ఉ. ముందటఁ దాఁకి పోరుతనమోహరముల్ వెసఁ బో నదల్చికొం
చుం దఱియంగఁ జొచ్చి బలసూదనుఁ డాదశకంఠు నస్త్రపం

క్తిం దునుమాడి బాణమయదేవానిఁ గా నొనరించె వాఁడు సం
క్రందనుపై నిశాతవిశిఖంబులు నించె సురల్ దలంకఁగన్. 135

శా. వ్యగ్రాటోపత నొండొరున్ మిగుల బాహాశక్తి సూపన్ మహో
దగ్రం బయ్యె సురాసురేంద్రరణ మన్యోన్యధ్వజచ్ఛేదనా
త్యుగ్రం బై యితరేతరవ్యథితరథ్యోదాత్త మై శౌర్యసా
మగ్రీగాఢపరస్పరాంగదళనోన్మాదోద్భటాకార మై. 136

క. ఈసున నాసురపతి జంభాసురున క్లొసరి రావణాసురు శీఘ్రం
జేసియు వ్రేసియు బొడిచియు, వేసరి దిక్పాలకోటి విన ని ట్లనియెన్. 137

ఉ. ఎద్దెస నైన శంక చెడి యేగు విరించి వరంబు నెమ్మదిం
బెద్దయు నమ్మి వీఁ డిటు లభేద్యతఁ గ్రుమ్మరు చున్నలోక మా
పద్దశఁ బొందు మానుపు నుపాయము నారసి చూడ నొండు లే
దిద్దనుజాధముం బొదివి యే పటుఁ బైపడి పట్టుకొందమే. 138

చ. అనవుడుఁ జాల మే లని దిశాధిపు లందఱుఁ జేరి చుట్టు ము
ట్ట నమరవల్లభుండును గడంక దశానను తేరిరాక క
ల్కినగతి మాతలిం గెలనికిన్ రథ మల్లఁ దొలంగి పోవ ని
మ్మని వెసఁ జొచ్చి పట్టుకొన నాయిత మై యతిసాహసంబునన్. 139

మేఘనాదుఁ డింద్రుని మాయాతిమిరమున ముంచి పట్టుకొనుట.

క. ఒరసికొని పోవ నత్తఱి, సురసైన్యం బార్చుటయును జూచి తిమిరముం
గర మచ్చెరువుగ గ్రక్కునఁ, బరఁగించుచు నసురకొడుకు పఱతెంచె వడిన్.

క. మాయాతమమున మునిఁగిన, డాయల దివ్యాస్త్రజాలదళితాంగులఁ గాఁ
జేయుచు నాబృందారక,నాయకు డగ్గఱియె మేఘనాదుఁడు గడిమిన్. 141

క. తుహినంబునఁ బడినపయో,రుహషండముమాడ్కి నష్టరుత్పతి మాయా
పిహితతమోవృతలోచన,సహస్రుఁ డై యున్న నతనిసారథి నేసెన్. 142

ఉ. మాతలి మూర్ఛవోయిన నమర్త్యవిభుండు రథంబు డిగ్గి జీ
మూతగజంబు నెక్కి బలముం జలముం జెడి యాత్మసైనికా
రాతిభటప్రభేదవిదురస్థితి దీనతఁ బొంది యుండియున్
భీతి యెఱుంగ కుండ వెడబీరము సేయుచు నుండె వెండియున్. 143

చ. నిలువులు పడ్డయట్లు తననేత్రము లేమియుఁ గానలేమి న
గ్గలముగ బెగ్గలించుబలఘస్మరు నమ్ముల నోడు సేసి ని
ట్టల మగుడప్పి సోలుటయు డాసి దశాననందనుండు వి
చ్చలవిడిఁ బట్టి కట్టి జయశంఖముఁ బట్టఁగఁ బంచి యార్చుచున్. 144

రావణుఁ డింద్రునిఁ బట్టి లంకకుఁ గొనిపోవుట.

చ. అరదముమీఁదఁ బెట్టుకొని యాతనిఁ దండ్రికిఁ జూపి యింక సం
గర మిది యేటికిన్ జయము గైకొని పోదము రమ్ము నావుడుం
గరము ప్రియంబునం దనయుఁ గౌఁగిటఁ జేర్చి త్రిలోకరాజ్యవి
స్ఫురణము నాకు దక్కె నని పొంగి దశాస్యుఁడు మిన్ను ప్రేయుచున్. 145

ఉ. మోదమునం దనూభవుని ముంగలిగా నడపించి తాను దు
ర్భేదబలాన్వితుం డగుచుఁ బింగలి యై చన దేవకోటి శౌ
ర్యోదయలీలఁ గూడుకొని యొండొరుఁ బల్కుచు శక్రమోక్షణా
ప్లావము గోరి పెంపున రయం బెసఁగం బఱతెంచి తాఁకినన్. 146

ఉ. ఎత్తెల గొంపదిక్పతుల నింపఱ ముంద తెలుంగనట్ల యీ
తత్తబడం బిఱింపి చెసఁ దాఁకిన దీనికి సంభ్రమంబుమై
నిత్తల కేగు దేవలవ దేత్తెఱః బొమ్మని చెప్పి పుచ్చినం
జిత్త మెలర్పఁగా సుతుఁడు శీఘ్రమునం జనఁ దా సుదగ్రుఁడై. 147

క. బకమరి తిరిగిన నమరులు, పకపిక లై పోవ లావుఁ బెం పేర్పడ నే
నకు వెనుకై చనియెను లంకకు దానవవిభుఁడు బాహుగర్వోద్ధతుఁడై 148

ఆశ్వాసాంతము.

మ. అతులౌదార్యుఁ డహీనశౌర్యుఁడు సముద్యద్ధైర్యుఁ డత్యంత వి
శ్రుతచారిత్రుఁడు సూరిమిత్రుఁడు జనస్తోతవ్యగోత్రుండు సం
భృతసత్కీర్తి పవిత్రమూర్తి యసుహృద్బృందార్తినిర్వర్తి పూ
జితధీమంతుఁడు పుణ్యవంతుఁడు జయశ్రీకాంతుఁ డిమ్మేదినిన్. 149

క. సన్మార్గచతురపథికుఁడు, జన్మవిశేషప్రసిద్ధసగరకులుఁడు భూ
భృన్మకుటఘటితచరణుఁడు, మన్మథనాథుఁడు కవీంద్రమందార మిలన్. 150

మాలిని. నిరుపమజయలక్ష్మీనిత్యవిస్తారవక్షుం
డరిబిరుదమహోత్సాహప్రతిక్షేమదక్షుం
డరుణకిరణవీక్షావ్యాప్తపద్మాయతాక్షుం
డురగశయనరేఖాయుక్తసంరక్షుఁ డుర్విన్. 151

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిధేయ
తిక్కననామధేయప్రణీతం బైన యుత్తరరామాయణం బను మహాకావ్యంబు
నందు షష్ఠాశ్వాసము

శ్రీరస్తు.

# నిర్వచనోత్తరరామాయణము

## సప్తమాశ్వాసము.




రంజకత్వచతురా
చారుఁడు వర్ణాశ్రమప్రచారుఁడు విద్యా
ధౌరేయుఁ డార్యవినుత
ప్రారంభుఁడు మనుమమానవాధీశుఁ డొగిన్. 1

బ్రహ్మ యింద్రజిత్తు కోరినవర మిచ్చి యింద్రుని విడిపించుకొని వచ్చుట.

క. అక్కడఁ గమలాసనుఁ డా, రక్కసుఁ డమరేంద్రుమీఁద రాకయు సమరం
బెక్కుడుగఁ జేసియును హరి, యుక్కఱి పట్టువడి పోకయుం దెలియంగన్. 2

చ. విని మునిబృందముల్ గొలువ వేగమ లంకకు నేగుదెంచి య
ద్దనుజవిభుండు సేయునుచితప్రతిపత్తిఁ బ్రియంబు వొంది యా
తనిదృఢశౌర్యముం దనయుదైర్యమునుం గొనియాడి వెండి యా
యనిమిషనాథు గెల్చిన జయాతివిశేషము సూపి చెప్పుచున్. 3

ఆ. భువనములకు నెల్లఁ బ్రోదిగ శతమఖుఁ, డాను నిలుపుటయు నతండు లేమి
సకలభూతములకు సంకటం బగుటయు, నెఱుఁగఁ జెప్పివారి యిచ్చ యెఱిఁగి.

చ. ముదమున నింద్రుబంధనవిమోక్షము సేయుఁ డభీష్టవస్తు వి
చ్చెద మదికోర్కి యేర్పడఁగఁ జెప్పుఁడు నా కనుచున్ సముల్లస
ద్వదనచతుష్టయుం డయినవారిజసంభవుఁ జూచి వాంఛిత
ప్రదుఁ డగు టాత్మలో నెఱిఁగి రావణసూనుఁడు ప్రీతి నిట్లనున్. 5

క. కమలాసన విను నావి,క్రమమున వెల వెట్టి దేనిఁ గారుణ్యము సే
యుము నాకు శాశ్వతం బగు,నమరత్వం బనిన నతని కజుఁ డిట్లనియెన్. 6

క. ఆశ్వాసంబుగ బలికిన, విశ్వాసము సేసి మున్ను వేఁడితి కలదే
శాశ్వత మగునమరత్వం, బీశ్వరుఁ డొకరునిక తక్క నితరుల కెందున్. 7

క. అనుడు నొకతెఱఁగు సెప్పెద, వినుఁ డని రావణసుతుండు వినయవిశేషా
వనతశరీరుఁ డగుచు ని, ట్లనియెం గరకమలముకుళనాదరపరుఁ డై. 8

ఉ. ఆల మొనర్పఁగా వలయునప్పుడు వహ్ని నుపాస్తి చేసి యా
వేలిమి నొక్కతేరు ప్రభవించిన గ్రక్కున దాని నెక్కి దో

ర్లీల వెలుంగ నేగిన సరిత్ప్రకరంబులచేత నెమ్మెయిం
గాలవశంబు నొందక యఖండితవిక్రమశాలి నయ్యెదన్. ..9

ఉ. హోమసమాప్తి నుత్థితరథోత్తమ మొక్కటి దక్క నొంట సం
గ్రామము సేయఁబో నది యకాలముగా దుది కియ్యకొంటి నా
కీమెయి మేరవెట్టి వర మిమ్ము పరాక్రమలీల మెచ్చి నీ
వేమియు నీక పోక తగ వేనియుఁ బొమ్మమరేంద్రు నిచ్చితిన్. 10

తే. అనుఁడు దరహాసచంద్రికాతనదువదన, కమలవనమున కభినవకాంతి యొసఁగఁ
జిత్రచారిత్రుఁ డగుకలిపుత్త్రపుత్త్రు, నర్థిఁగనుఁగొని యవ్వర మతని కిచ్చె. 11

చ. అడిగినయట్ల యిచ్చిన దశాననసూనుఁడు ప్రీతి మేన నె
ల్లెడ వెలిఁ బేర్చె నాఁ బులక లెంతయు వింతగ మ్రొక్కి పెంపు సొం
పడరఁ గులం బెలర్ప జనకానుమతంబున నాబలారికిన్
విడుగడ సేసె నప్పు డరవిందభవుండు ప్రమోద మందఁగాన్. 12

ఆ. అంబుజాసనుఁడు దశాననుఁ జూచి నీ, నందనునకుఁ ద్రిభువనముల నెగడ
నింద్రజిత్సమాఖ్య యిచ్చితి సుముఖులై, యుండుఁ డనియె దనుజులుల్లసిల్ల.

చ. అసురుల నిమ్మెయిం బ్రముదితాత్ములఁ జేసి పయోజసూతి సం
తోసమున నాకలోకపతిఁ దోకొని పోవునెడం దదీయవ
క్త్రసరసిజంబు లజ్జ యనురాత్రి గడుం జెడి యున్కికిం గృపా
రసపరుఁ డై హితార్థ మధురస్ఫుటసత్యమృదూక్తి నిట్లనున్. 14

చ. తమతమదుష్కృతంబు సుకృతంబును నాపదయున్ శుభంబు లై
తముఁ దఱి నైనఁ బొందు నది దప్పునె సాధ్వి నహల్యఁ గోరి గౌ
తమునికిఁ దప్పితీ వకట తత్ఫల మీయశుభంబు దోషసం
గమవినివృత్తికై యొకమఖం బొనరింపుము విష్ణుతుష్టిగన్. 15

క. అని చెప్పి పోవుటయు న, య్యనిమిషవల్లభుఁడు విష్ణుయాగం బొనరిం
చి నిఖిలదురితరహితుఁ డై, చనియెన్ ద్రిదివంబునకు విశాలవిభూతిన్. 16

మ. అనినం జిత్తము చోద్య మంద రఘువంశాధీశ్వరుం డిట్టు లా
తనికిన్ బీరము సెల్లెఁ గాని యెచటం దద్విక్రమక్రీడ మా
న్ప నొకం డైనను జాలఁడే యనుడు భూపాలాగ్రణిం జూచి య
మ్ముని మందస్మితసుందరుం డయి మనోమోదంబుతో నిట్లనున్. 17

రావణుఁడు కార్తవీర్యునితోఁ బోరాడి చెఱఁబడుట.

ఉ. నిర్జితశత్రుఁడున్ భువననింద్యచరిత్రుఁడు నైనరావణుం
డూర్జితవిక్రమస్ఫురణ నుర్విఁ జరించుచు మించి యేచి శౌ
ర్యార్జనలోలబాహుమహిమాస్పదుఁ డై చనునాసహస్రబా
హార్జును పెంపుసొంపు హృదయంబున సైఁపక వచ్చె నాజికిన్. 18

తే. అరుగుదెంచి మాహిష్మతీపురము సుట్టి, వేగ పోరికి నర్జును వెడలు మనుఁడు
రావణుఁడు వచ్చె నలఁతులఁ బోవఁడనుచు, గోపురాంగణస్థితజనక్షోభ మెసఁగ.

క. పన్ని బహిరంగణంబున, నున్న నసంభ్రాంతిగతి సముచితమ్ముగ నా
సన్నులయి మంత్రు లిట్లని, రన్నరపతి పెంపునన్ భయం బెద లేమిన్. 20

చ. అధిపతి వీట లేనిసమయంబున సంగరకాంక్షతోడ ని
ట్లధికబలంబులం గొని వృథాతిశయంబుగ నేగుదెంచి యి
వ్విధమునఁ బన్ని నీ వనృతవిక్రమముం బ్రకటించుకంటె నం
బుధినడు మైన నీపురికిఁ బోయి యొదుంగుము చాల మే లగున్. 21

చ. అనుబలుమాట లియ్యకొని యద్దనుజేశ్వరుఁ డాతఁ డున్న వాఁ
డని యని సేయు వేడుక రయంబున వచ్చితి నెందుఁ బోయె మీ
జనపతిలావు నాదుభుజశక్తియు నించుక తూఁచి చూడ నేఁ
జన నెడఁగించి యెయ్యెడకుఁ జయ్యనఁ దోకొని రండు నావుడున్. 22

ఆ. అతనిపెంపుఁగలిమి కయ్యమాత్యులు దమ, నెమ్మనముల మెచ్చి నృపతివృత్త
మున్నరూపు సెప్పి యిన్నరభోజను, నిచట సునుత మనుచు నిట్టు లనిరి. 23

క. వారువము నెక్కి వనితలు, గారవమునఁ గొలువఁ గంతుకై వడి వెడలం
జేరక యంతంతను బరి, వారము నిలువఁ బడ వర్షవరపరివృతుఁ డై. 24

క. సరసకవివిటవిదూషక, పరిహాసకగాయకాదిపరిజనములు వే
సహటపయి మేలు దొలఁకెడు, తురగము నెడఁ దూఱఁ గాంచి నొలఁకాడఁగన్.

ఉ. చూడ్కికిఁ బండువై ముదము సొంపునఁ జూపఱు సొక్కుచుండ ని
మ్మాడ్కి నరేశ్వరుం డరిగె మాపటికిం జనుదెంచు నాతనిం
దోడ్కొని తేరఁ బూను టదిదుర్వినయం బగు మాకు రాజులన్
వేడ్క మెయిం జరింపఁ జని వీటికి రమ్మని పిల్వవచ్చునే. 26

క. నటదలికులశుకపికసం, కటలీలోద్యానములను గమనీయసర
స్తటినీతటాకముల నుత్కటకౌతుకవృత్తి నాడుఁ దరుణులుఁ దానున్. 27

క. ఎయ్యెడ నిలుచుట యెఱుఁగమ, యియ్యెడ నేఁ డీవు విడియు మెల్లి యతనితో
నియ్యకొని యెల్లభంగులఁ, గయ్యము సేయంగఁ దలఁపు గలిగినయేనిన్. 28

ఆ. వేగపడకు మనుజవిభుచేతిబలుపును, జూతు గాక యనిన శూరరేఖ
నగుచు మంత్రివరుల మొగములు గనుఁగొని, యిట్టు లనియె దానవేశ్వరుండు.

ఉ. ఏపున నేను వచ్చుటయు నిచ్చట నిల్చుట కోహటించుటన్
మీపతి యెక్కడేనిఁ జన మిన్నక మాటలు పేర్చినన్ రణా
టోపము మాన నేర్తునె కుటుంబసమేతము డాఁగె నాతనిం
జూపరు మీరు నింకఁ దలసూపఁ డతండును బోయి వచ్చెదన్. 30

క. మెలఁగుదెస మెలఁగి క్రమ్మఱు, తల నొకమరి యేమఱించి । దాడిమెయిఁ దో
ర్బలము మెఱసి పైఁ పడి నా, చలము నెఱపి పోదు మీఁకుఁ । జాటితిఁ జుఁడీ.

క అని దుర్మదాంధకారమ్మునఁ గానక బిట్టు వలికి । పోయెను గలని
స్వనకోకిలకర్బురకాననరేఖావంధ్యవింధ్యనగమున విడియన్. 32

మ. చని దైత్యేంద్రుఁడు తత్ప్రదేశమునఁ జంచత్కాంచనాంభోజధూ
ళినితాంతప్రవిలిప్తహంసకుల కేళీజాతసంధ్యాభివం
దనలోలవ్రతిజాలమార్గ్యమున మోదస్థాన మై లోకపా
వనతం బేర్చిననర్మదం గని మృదుస్వచ్ఛందలీలారతిన్. 33

తే. నెమ్మి మజ్జన మొనరించి । తమ్మివిరులు, పాలఁ గోయించి హృద్యవిశాల మైన
పులినతలమున శివలింగ । పూజ సేయఁ, బొడఁగె నట నర్జునుండనుపబడఁతిపిండు.

క. వనకేలీకౌతూహలమునఁ దగిలినయట్టివారు । ముదితహృదయు లై
వనిఁ బరిచితస్థలములకుఁ, జని హృద్యవిహారతంత్ర । చాతుర్యమునన్. 35

మ. లలితక్రీడమెయిఁ సముత్కటమదోల్లాసంబునం బెక్కుభం
గులఁ జేతోరమచూతపోతలతికాగుల్మప్రదేశంబులం
గలయం గ్రుమ్మరి పొద్దుపుం జెమట నంగంబుల్ నవాంకూరసం
కలనాశోభితవల్లరీనిభము లై । క్రాలంగ రాగిల్లుచున్. 36

క. ముదమున జలకేళికి నర్మదకుం జను దెంచి లలితమకరవిహారా
స్పదతత్ప్రవాహమున నిం, పొదవఁగ నాడు నెడ నధిపుఁ । డుల్లాసమునన్. 37

తే. బాహువులు సాఁచిపడమరపాఱుచున్న, యాతరంగిణిఁ బోకుండనాఁగుటయును
నెదురునొట్టిదశాననుఁ । డీశుఁబూజ, సేయు నెడముంచికొనియెనచ్చెరువుగాఁగ.

క. రావణుఁడు సంభ్రమంబున, దేవార్చనకొఱఁతతో నది వెడలి కలయఁ
భావించి యెదురు క్రమ్మెడు, నా వెల్లువఁ జూచి విస్మయం బెదఁ గదురన్. 39

క. తూర్పుదెస వచ్చు నీనది, దర్పంబున నెదురు రాఁ గతం బేమిరొ మీ
రేర్పడ నెఱిఁగి రం డని, శూర్పణఖాభ్రాతచరులఁ । జూడఁగ నంపెన్. 40

ఆ. వార లరిగి విభుఁడు । వామలోచనలును, జలవిహార మర్థి । సలుపు చునికి
చూచి వచ్చి యాఁ నిశాచరవల్లభు, నెదుర నిలిచి మ్రొక్కి । యిట్టు లనిరి. 41

క. దేవా దేవర పంపిన, నీవెల్లువ తెఱఁ గెఱింగి । యే తెంచితి మె
చ్చోఁ వినఁగఁ జూడఁ బడయము, యావిధ మద్భుతరసావహం బై యుండెన్. 42

ఉ. భూరిబలాభిరాముఁడు విభూషణభూషితమూర్తి కామినీ
స్మేరముఖేందుబింబముల । చెన్నున నుజ్జ్వలచంద్రలోకకే
లీరతి నున్నచందమున । లీల మెయిఁ సలిలావగాహన
స్ఫారకుతూహలుం డయి విశంకత నొక్కఁడు కేళి సల్పెడున్. 43

క. ఆతతబహుబాహుం డగు, నాతఁడు సేతులఁ బ్రవాహమాఁగిన మరలం
దోలెంచె నావుడును విని,వీతభయుఁడు కార్తవీర్యవిభుఁ డని యెఱిఁగెన్. 44

చ. ఎఱిఁగి కరంబు వొంగి కడు నేకత మిట్లగపడ్డచో నతం
డెఱుఁగక యుండ ముట్టికొని యే పడఁగించెద నంచు మంత్రులం
దఱకు నెఱుంగఁ జెప్పికొని దానవుఁ డున్మదుఁ డై చనంగ న
త్తఱి నరుణాభ్ర మస్థిమయధారలతో దివిఁ దోఁచె ముందటన్. 45

ఉ. దానికి శంక సేయక యుదగ్రరణోత్సుకుఁ డై నయట్టియా
దానవవల్లభుండు బలదర్పసముద్భటసంకులంబుగా
సేనలు ముందటం దఱుమ శీఘ్రత మేదిని సంచలింపఁ గాం
తానిచయంబుఁ గంచుకివితానము బెగ్గిల బిట్టు ముట్టినన్. 46

మ. వనితాబృందములోన నున్నపతి తీవ్రక్రోధుఁ డై గంగ గా
హనకేలిం బిడియేసుఁగుల్ వొదువ మోదాయత్త మై యుండి గ్ర
క్కున నన్యద్విపదానగంధమునకుం గోపించునైరావతం
బును బోలెన్ మడు వల్లె వెల్వడి రణప్రోత్సాహయోగ్యస్థితిన్. 47

క. కట్టాయిత మై యువిదల, నిట్టుండుఁడు వెఱవ కిచట నిదె వచ్చెద నన్
ముట్టినదానవులను బలి, వెట్టెద నర్మదకు ననుచు భీకరవృత్తిన్. 48

చ. అతఁడు వినూత్నరత్నరుచిరాంగద మై వివిధాయుధప్రభా
న్వితమగుబాహుసంఘమ యనీకముగాఁ బటువిక్రమక్రమో
ద్ధతి దితిసూనుసేనల మోదం బఱె నల్లడఁ దూలఁ దోలె ఘో
రతిమిరపుంజభంజనకరప్రకరుం డగుభానుకైవడిన్. 49

క. తెరలినబలములఁ గని యుద్ధురవృత్తిఁ బ్రహస్తుఁ డతనితోఁ దలపడియెం
గరి కేసరి హరిణము పులి, నురగము గరుడిఁ దలపడ్డయొ ప్పమరంగన్. 50

క. తాఁకి ముసలమున వ్రేసిన, వీఁక నొడిసిపట్టి యతఁడు వెసఁ దిగిచిన నా
రోఁకలి తనచే వచ్చిన, నాఁకగొనక దాన నసుర నడిచెం గడఁకన్. 51

ఉ. ఆటున మూర్ఛవోయినఁ బ్రహస్తుఁ గనుంగొని యింకఁ దాఁకినం
గీటడఁగించు నర్జునుఁడు గేవలుఁడే యని భీతచిత్తు లై
మేటిమగల్ సలం బెడలి మేమెయి మార్కొన లేక పాఱినం
గాటుకకొండవోలె దశకంఠుఁ డెదిర్చె మహీమహేంద్రునిన్. 52

ఉ. వీరగుణాభిరాము లగువింశతిబాహుసహస్రబాహు లా
తారకకార్తికేయులవిధంబున నాబలనిర్జరేశ్వరా
కారత నమ్మురాచ్యుతుల కైవడిఁ బెద్దయుఁ బ్రొద్దు మేమెయిం
బోరిరి చూచు ఖేచరులు భూరిబలంబుఁ జలంబు మెచ్చఁగన్. 53

క. లావణి వివిధాయుధముల, భూవిభుఁడుం దాను నట్లు । పోరి యలసి వీ
రావేశ మడర జయకాం,క్షావశుఁ డై రావణుండు । గదుఁ దమకమునన్. 54

మ. మది శంకింపక ముట్టి విక్రమరసోన్మాదంబునన్ భూవిభున్
గద వ్రేయంగ నతండు పైపడి భుజాగర్వంబునం బట్టి నా
రదుఁ డార్వం బరికాఁడు నిర్భయతఁ జేరం జూచినం బట్టుసు
న్నదశుండాలములీల దిక్కులితనామ మ్రావణున్ రావణున్. 55

క. పట్టి యిరువదికరంబులు, గట్టిగ వీఁపుపయి మోపుగాఁ బెట్టి తగన్
బెట్టు మెడ పట్టుకొనితుది, ముట్టినమగఁటిమి నభంబు । ముట్టఁగ నార్చెన్. 56

ఆ. నృపవరేణ్యుఁ డిట్లు । రిపుఁ బట్టు వఱచి కం,చుకిగణంబు నల్లఁ । జూచి యొకనిఁ
బిలిచి యోరి వీనిఁ । బెడకేలితోన తె,మ్మని సముద్ధతముగ । నప్పగించి. 57

క. తరుణీజనము వినోదపుఁ, బరివారము మున్ను నడవఁ । బనిచి పిఱుం దై
పురమున కరుగ నిజప్రభు, పరిభవముం జూచి దైత్యభటకోటి వడిన్. 58

క. నిలునిలు విడువిడు మంచును, బలువిడిఁ గూడుకొని పిఱుఁదఁ । బఱతెంచిన న
మ్ముల నోడు సేసి యందఱ, నిలిపె విజయలక్ష్మిసొంపు । నెలకొన నెలమిన్. 59

క. తనకొలఁది యెఱుంగక యీ, దనుజుఁడు వనితావినోదతత్పరు నన్నుం
జెనసె నని యుగ్గడించుచు, ననిమిషరిపుమీఁదఁ బొరిఁ గటాంక్షం బెలయన్. 60

తే. ఎదురువచ్చినమంత్రుల । కెగ్గు లెన్ని, చూపి చెప్పుచు నివ్విధికోపమునకు
నుపశమం బెట్టు సేయుదు రొక్కొ యనుచుఁ, బురికిఁజనిమందిరాంగణభూమినిలిచి.

క. పొంపిరివోయెడుతనయసు, కంపాతిశయమునఁ బంక్తికంధరు నెట్లుం
జంపం జాలక రోషము,పెంపునఁ గారాగృహమునఁ । బెట్టఁగఁ బనిచెన్. 62

క. మనుజపతి యివ్విధంబునఁ, దనచెఱయింటికిని ముచ్చుఁ । దఱ్ఱున నొప్పిం
చినయట్టుల మఱిని పరకు,గొనక మఱచి యున్నయెడను । గొనిదినములకున్. 63

పులస్త్యుఁడు కార్తవీర్యుని వేఁడుకొని రావణునిచెఱ విడిపించుట.

మ. దనుజేంద్రుండు సహస్రబాహువిభుచేతం బడ్డపాటంతయున్
విని మాహిష్మతికిం బులస్త్యుఁడు గడున్ । వేగంబ యేతెంచి య
జ్జనపాలుం గనినన్ యథోచితముగా । సత్కారముల్ సేసి వ
చ్చినకార్యం బెఱిఁగింపుఁ డన్న నతఁ డౌచిత్యంబు మై నిట్లనున్. 64

చ. అలవి యెఱుంగ నేరక దశాస్యుఁడు లోకముతోడివానిఁ గాఁ
దలఁచి జితాఖిలాధ్యుఁడఁ గదా యని నచ్చి కడంగి వచ్చి సం
కలియకుఁ జొచ్చె వానిఁ బలుకం బని లేదటు లుండె నింతలం
తలుపను లెల్ల నీకు భుజదర్పముగాఁ గొన నేర్పు సాలునే. 65

క. ఆక్రమసంచిత మగుభూ,చక్రం బుదయాస్తశైలసహితంబుగ ని
ర్వక్రపరిపాలనస్థితిఁ, జక్రము చెల్లించుపూజ్యసామ్రాజ్యమునన్. 66

క. తుదిముట్టి యున్ననీ కోకఁ, డెదురే యది గాక పగఱ యే పడఁగినఁ ద
ప్పొ దలంప నిదియ కడు నొ, ప్పిద మగు నినుబోఁటినృపులకెంపున కరయన్. 67

చ. నలినజుఁ డైనబ్రహ్మకును నాలవవాఁడు దశాననుండు ని
ర్మలగుణలోల వీఁడు మనుకుమం డని చెప్పఁగ నాకు సిగ్గగుం
బలుకులు వేయు నేటికిఁ గృపాపరతాస్తుతి దక్క వీని మం
దల విడు నాకుఁగా నృపతిధర్మవిచక్షణ పుణ్యవీక్షణా. 63

చ. అనవుడు నట్ల చేయుదు మహాత్మ భవద్విపులాంతరంగమో
దన మగు దానిఁ జేయఁ గని ధన్యుఁడ నైతి దశాస్యు వేగ తో
డ్కొని చనుఁ డన్న నానృపతికుంజరుమంజుమృదూక్తిఁ జిత్తరం
జన మగుడుఁ మొగం బలరఁ బంయుమి దీవన లిచ్చి మెచ్చుచున్. 69

తే. దనుజవల్లభు విడిపించుకొని పులస్త్యుఁ, డరుగ లజ్జావనతుఁ డగుచు నతని
ననుపఁబోయిన సానునయంబు గాఁగ, బుద్ధిఁ దగఁ జెప్పిలంకకుఁబుచ్చె చనియె. 70

## రావణుఁడు వాలిచే భంగపడి యతనితో మైత్రి చేయుట.

ఉ. రావణుఁ డివ్విధంబునఁ బరాజయ మందియు లంకలోనికిం
బోవుడు నంతయుఁ మఱచి భూవలయంబునఁ దొంటియట్ల నా
నావిధదుశ్చరిత్రము లొనర్చుచుఁ గ్రుమ్మరి యొక్కనాఁడు వి
ద్రావితశత్రుభూరుహచరప్రభు వాలి నెదుర్చ వేడుకన్. 71

శా. కిష్కింధానగరంబు పై నరిగి సుగ్రీవాదు లెల్లన్ రణా
విష్కారోద్యమతీవ్రు లైనఁ గని తద్విక్రాంతి మానంగ మ
స్త్రిష్కంబుల్ రుధిరంబు మాంసమును ధాత్రిం గూల్చ నుంకించియుఁ
దుష్కర్మం బగు వాలిలేమి నని చేతోవృత్తి నూహించుచున్. 72

క. పడుచుం బైదలు పన్నినఁ, గడపి చనక చిఱుతతోడి కయ్యమునకు నేఁ
గడఁగుట తగ దని యాయని, విడిచి దశాననుఁడు వారు విస నిట్లనియెన్. 73

క. మీలోనఁ గూడుకొని రాఁ, డాలం బాలంబు నేసి యది యెట్లొకో తాఁ
జాల నని చెప్పఁ గాక, వ్వాలికి డాఁగినను బోవవచ్చునె నాచేన్. 74

చ. అనవుడు సూర్యసూనుఁడు దశాననుఁ గన్గొని నీవు నన్ను మె
చ్చనికత మేమిటం గొలఁది సాలనె వాలిని గూర్చి వచ్చి తే
యనికిఁ గడంగినన్ బిరుదు లైనమగల్ గని వీరు గారు నా
కనియు నెఱుంగ కిట్లు భయమంది తిపీ వెడమాట లేటికిన్. 75

శా. నాకి ట్లింతయు నీడఁ బోయితి జగన్నాస్యుండు నా నొప్పునా
నాకేశప్రియనందనుం జెనసి మానప్రాణముల్ గావఁగా
నీకుం దీరునె యుప్పు దక్షిణపుమున్నీటం గృతస్నానుఁ డై
యేకాంతంబున నుండుఁ బొమ్మనినఁ బోయెం బుష్పకారూఢుఁ డై. 76

మ. దనుజేంద్రుండు మరుద్గతిం జని సముద్రస్నానసంజాతశు
ద్ధి నితాంతామలచిత్తనిశ్చలసమాధివ్యంజితానందమీ
లనసంభావితలోచనుం గపికులశ్లాఘ్యాత్ము నవ్వానవిం
గను తన్మూర్తినివృత్తవిక్రమకళాకౌతూహలస్ఫూర్తి యై. 77

వాలి రావణునిఁ జంకలో నిఱికించుకొని నాలుగుసముద్రములను ముంచుట.

క. ఎదురెదురను ముదలింపఁగ, మదిఁ గొంకి పిఱిందివలన మందగతిం జే
రెద నేమఱి యున్నెడఁ బ, ట్టెద ననువగఁ బుష్పకంబు డిగి వచ్చుతఱిన్. 78

క. రావణునుద్యోగమునకు, దైవము ప్రతికూల మైనఁ దత్త్వనిదిధ్యా
సావేశవిరామం బై, యావనచరవిభుఁడు గన్నులర విరియంగన్. 79

క. కడకంటిచూడ్కి దశముఖుఁ, బొడగని సంభ్రమములేమిఁ బొంచి సతనిఁ దాఁ
బెడమఱి చూచుట యుడిగి మ,గుడ నేత్రము లల్ల మూసికొని చిత్తమునన్. 80

క. వంచన నను నియ్యెడ ని, ర్జించుతలంపునను నసురసేరెడు నే భం
జించెదఁ బాపాత్ముల నొ, ప్పించుట ధర్మంబ యనుచుఁ బిఱుఁ దారయుచున్.

క. ఉన్నయెడఁ మునివ్రేళులఁ, దిన్ననినడ నసురపతి పొదిలుఁ డై చేరం
గొన్ని యడుగు లరిగి యడరి, యన్నగచరనాథుపై రయంబునఁ బడియెన్. 82

క. వెనుకకు మొనసి కరంబునఁ, బెనఁచి తిగిచి నిఖిలలోకభీకరుఁ డగున
ద్దనుజేంద్రు ననాయాసం, బునఁ జంకిట నిఱికి యింద్రపుత్త్రుఁ డచలుఁ డై. 83

చ. ఎఱుఁగనియట్ల యున్న నసురేశ్వరుఁ డప్పుడు గాలుఁజేయు లా
వఱి రభసంబునం గుదుప నక్కడ నిక్కడ నూడఁ జూచి మై
గిఱుపఁగ నప్వి శక్తి యెఱేఁగించుట నెమ్మదిఁ గోరి వానిమై
సుఱసుఱ స్రుక్కి నొక్కి బలసూదనసూనుఁడు ప్రక్కదాపునన్. 84

చ. చదియఁగ నొత్తి యెత్తికొని శాతనఖంబులఁ గ్రూరదంష్ట్రలన్
వదనములన్ శరీరమును వారక ప్రచ్చుచు మేనిగాలిఁ దో
యదములు దూలఁ బశ్చిమదిగంబుధికిం జనియెన్ రయంబునం
జదల భుజంగమగ్రహణచారుసుపర్ణవిలాసభాసి యై. 85

చ. చని దనుజేశ్వరుండు వసచంకన యుండఁగఁ దజ్జలంబులన్
మునిఁగి శమంబుమై నియమముల్ దగఁ దీర్చి క్రమంబుతో సుద
గ్వననిధిఁ బ్రాక్పయోధిఁ గపివల్లభుఁ డట్టుల చేసి యశ్రమం
బున నిజపట్టణోపవనభూమికిఁ బెచ్చి సుఖోపవిష్టుఁ డై. 86

వాలిచే భంగపడి రావణుఁ డతనితో మైత్రి చేయుట.

శా. కోపం బాఱినఁ జంక వాపి ధరణిం గూర్చుండఁగాఁ బెట్టి ని
ష్పాపోల్లాసకటాక్ష మల్ల నొలయం బ్రౌఢస్మితజ్యోత్స్న ల

జ్ఞాపూరావృతతన్ముఖాబ్జములపై । సాంద్రంబుగాఁ జూపి ని
ర్వ్యాకృపారామరసుందరీప్రకరగర్భస్రావణుఁ రావణున్. 87

క. కనుఁగొని యచ్చట నప్పుడ, కనినట్టులు సంభ్రమించి । గారవమున న
వ్వనచరవీరశిఖామణి, దనుజపతికి నిట్టు లనియెఁ । దదభిముఖుం డై. 88

క. ఎందుండి రాక యిక్కడి, కెందులకుం బోక యిచట । నేకార్యము సే
యం దలఁచి నిలిచి తప్పని, విందము నీ వింటికడకు । విచ్చేయు తగన్. 89

క. అనవుడు వెలవెలఁబాఱుచు, దనములు వెడ వాంచి యెత్తి । దశముఖుఁడు గపీం
ద్రునిమోము దీనదృష్టిం, గనుఁగొని గద్గదిక నెలుఁగు । గడలుకొనంగన్. 90

మ. తగు నీ కే మని పల్కుదుఁ విను భుజాదర్పంబుదుఁ మాఱు లే
క గిరీశుఁ గిరితోన యెత్తి సురలోకస్వామి జంభారి గా
సిగ బంధించి జగత్త్రయంబును బసుల్ । సేయఁ విజృంభించి గ
ర్వగరిష్ఠుం డగునన్ను నిద్దెసకుఁ దేరం జాలుటఁ వాసవీ. 91

చ. అనవుడుఁ గౌఁగిలించి దనుజాధిపతిం దగ గారవించి తో
కొని పురి కేగి తత్తదనురూపలచరిత్రములఁ సఖిత్వరీ
తి నడపి తాను దమ్ముఁడు సతిప్రియభాషలచేఁ బ్రసన్నుఁ జే
సిన నతఁ డాకపీంద్రవరుచెల్మికిఁ బల్లవితాంతరంగుఁ డై. 92

ఆ. వివిధ కేలిఁ దగిలి । వేడుకఁ గతిపయ, దినములందు నిలిచి । దివ్య మగుటఁ
దోన వచ్చియున్న । మానితనిజవిమా,నమునఁ బ్రీతిఁ దనపురమున కరిగె. 93

క. లీల నటు లసురవల్లభుఁ, గేళీపాత్రంబుఁ జేసి । క్రీడించినయ
వ్వాలి భవదస్త్రమున కర, సాలియుఁ జాలమి నుతింపఁ । జాలదె యెందున్. 94

క. అని మునిపతి యివ్విధమున, దనుజపతిం జెప్ప రామ । ధరణీపతి తి
న్ననినవ్వు మెఱయ నాతని, వినితిమి యిఁక నొకటి వినఁగ । వేడుక యనుచున్.

క. ఏమియొకో నన్నడిగెదు, నీమానవనాథుఁ డంచు । నెద నూహింపం
గా మునిజనవల్లభుతో, రామనృపతి కౌతుకస్ఫురణ ని ట్లనియెన్. 96

## హనుమంతునిజననాదివృత్తాంతము.

క. కొంత యెఱుంగుదుఁ బవనజు, వింత దివిజరాజతనయు । విక్రమము హనూ
మంతునకు వాలికిం గల, యంతర మేకొలఁదియొకొ చరాచరవేదీ. 97

ఆ. అనిన నాంజనేయు । నతులబలము విన, వేడ్క సేసె నితఁడు । విస్తరించి
కలతెఱంగు సెప్పు । వలయు నా కని ముని, యిట్లు లనియెఁ బ్రీతి । యెసక మెసఁగ.

శా. వాలిం గీలియు వాయుపుత్రుసరియే । వాఁ డాత్మశక్తిజ్ఞుఁ డై
యీలోకంబులు గెల్తు నే ననిన మా । కెందుం గలండే మహీ
పాలాగ్రేసర వానివర్తనముఁ జెప్పం జిట్ట లావిక్రమ
శ్రీలోలుఁ భవదీయసన్నిధిఁ బ్రశంసింపం దగుం జెప్పెదన్. 99

చ. సురగిరిసానుదేశమున సుస్థిరసంపద నుల్లసిల్లు కే
సరి యనువానిభార్య గుణశాలిని యంజన నాఁగ నొప్పు నుం
దరి యనిలప్రసాదమున ధర్మవిధిన్ మహనీయమూర్తివి
స్ఫురితుఁ గుమారుఁ గాంచెఁ బరిపూర్ణతపోమహిమాభిరాము డై   100

ఉ. ఆతనిరక్షణంబున సహర్నిశముం దగ సావధాను డై
యేతఱిపండు లొప్పు నవి యేఱి వనంబునఁ దెచ్చి యిచ్చుచుం
బ్రీతిఁ జరించుచున్నెడఁ గపిప్రవరార్భకుఁ డొక్కనాఁడు ప్ర
ద్యోతనబింబముం బొడుచుచుండఁగఁ జూచి సముత్సుకాత్ముఁ డై.   101

చ. ఫల మనుబుద్ధిఁ బుచ్చికొనఁ బాఱె నభంబున వాయుదేవుఁడున్
సలిలకణార్ద్రితం గిరణజాలము వేఁడిమి దాఁక కుండ నే
వలనను దాన యై పొదివి వచ్చెఁ దనూభవు నాఁడె పర్వ మై
జలరుహమిత్రుఁ బట్ట రభసంబున రాహువును జేరె నత్తఱిన్.   102

క. ఆసైంహికేయుఁ డర్కుఁ, గ్రాసాదరవృత్తి వచ్చు కపిఁ గనుఁగొని సం
త్రాసభరితమానసుఁ డై, వాసవుకడ కేఁగి ఖిన్నవదనుం డగుచున్.   103

క. రవిశశిబింబగ్రహణోత్సవ మెల్లను నాకు మున్నొసఁగి యెప్పుడుఁ జె
ల్ల విడిచి యుండుదు నేఁ డొకఁ, డవార్యవిక్రముఁడు వచ్చె నర్కునిఁ బట్టన్.

మహా. అనినం గోపించి యింద్రుం డఖిలభువనమర్యాద లయ్యైవిధిం ద
ప్పనిభంగిం జొప్పుతో నేర్పడ నడవఁగ నా పంపు గానీక యెవ్వం
డినబింబగ్రాహి యై యయ్యోదకు సుకముమై నేగుదెంచెం దదంగం
బనఘా మద్వజ్రధారాహతిఁ బొడిపొడి సేయంగ నే వత్తు నంచున్.   105

మ. అనికిం బూని కరీంద్రు నెక్కి చనుజంభారాతికిన్ ముందటం
జని తద్బాహుపరాక్రమంబున మహోత్సాహంబుతో సింహికా
తనయుం డాకపిబాలుపై నడరి యుద్యద్విక్రముం డై నయా
తనియాటోపము నోర్వఁజాలక విభీతస్వాంతుఁ డై పాఱెనన్.   106

తే. ఎగచికొనిపోయి కపి దివిజేంద్రదంతి, వెనుకసార నంటఁ దఱిమిన మనములోన
మెచ్చియును దనచేసినమేరతప్పు, నని తలంచుచు మృదురోషుఁడై యతండు.

క. భాసుర మగువజ్రంబున, వ్రేసిన హనుదేశ మర్థవిదళిత మైనం
గేసరితనూభవుఁడు మూర్ఛాసంగతుఁ డై ధరిత్రిఁ జాఁగం బడియెన్.   108

క. తనవచ్చినపని దీఱిన, ననిమిషపతి నాకమునకు నరిగెఁ దనయునిం
గనుఁగొని వేదనఁ బొంది పవనుఁ డప్పుడ యుడిపెఁ దనదువర్తన మెందున్.

ఆ. జగములందు వాయుసంచార ముడిగిన, సకలజీవలోకసంకటంబు
పుట్టుటయు విరించి పురుహూతవరుణాదిసురులు బలసి కొలువ నరుగుదెంచి.

## సప్తమాశ్వాసము.

క. మాత్సర్యము ప్రాణంబు చికిత్సిత మగునొక్కొ వీని కిఁక బ్రాణ మనుచున్
వాత్సల్యంబునఁ బుత్రకు, నుత్సంగమునందుఁ దాల్చియున్న సమీరున్. 111

క. కనుఁగొని కరుణాపూరిత, మనస్కుఁడై యక్కటకట మారుతుఁడు సుతా
ననసక్తలోచనుం డై, మనవచ్చుటఁ గానఁ డనుచు మక్కువతోడన్. 112

శా. చేరంబోవుటయున్ సమీరుఁడు సురజ్యేష్ఠున్ నిరీక్షించి దు
ర్వారాంతఃపరితాప మేది తనయున్ వక్షోగతుం గా సమా
చారప్రౌఢత నెత్తికొం చెదురుగా సద్భక్తిమై నేగి లో
కారాధ్యం బగుతత్పదాంబుజయుగం బర్చించె నానమ్రతన్. 113

క. వనజాసనుండు ఫాలంబునఁ గేలిరవొంద నెత్తి పొడివి భుజము నా
తనిమస్తకంబు వక్షంబునఁ జేర్చి కృపాతిరేకమున గాఢముగన్. 114

క. పశ్చిమదిశ చందంబున, నిశ్చేష్టుం డయినబాలునిం జూచుడు వాఁ
డాశ్చర్యంబుగ నపుడ పునశ్చైతన్యాగమంబునం దెప్పిఱిలెన్. 115

క. దర్శనమాత్రన శోకవిమర్శకుమచిత్తుఁ డయ్యె మారుతి బాహా
స్పర్శమునఁ బ్రబలదురితనికర్శుఁడు ప్రాణనిర్వికారుఁ గా నొనరించెన్. 116

చ. తనయుఁడు సేద దేఱిన ముదంబునఁ గౌఁగిటఁ జేర్చి యంబుజా
సనునకు మ్రొక్కఁ బంచి వికసద్వదనుం డయి వాయుదేవుఁ డెం
దు నిఖిలదేవకోటి పరితోషవిధాయక మైనయాత్మవ
ర్తన మొనరంగఁ జేసె నమరప్రభుచిత్తము పల్లవింపఁగన్. 117

చ. కమలభవుండు దేవతలఁ గన్గొని మారుతిఁ జూపి దేవకా
ర్యమునకుఁ గా జనించె నితఁ డద్భుతవిక్రమశాలి రామనా
మమున వెలింగి లాఘవసమాజవిభూషణ మైనకేలిజ
న్మమున దశాస్యదుర్మదము మాన్పు నెడం బనిసేయు శార్ఙ్గికిన్. 118

క. కావున మీ రిందఱు సంభావించి వరంబు లొసఁగి పవనునకుఁ బ్రమో
దావేశము లోకహితముఁగా వీనిఁ గృతార్థుఁ జేయఁగాఁ దగు ననినన్. 119

ఆ. వాసవుండు తనదువక్షఃస్థలంబునఁ, గ్రాలు సురభికుసుమమాల యర్థిఁ
గపికుమారుచారుకంఠభాగంబున, నాదరార్ద్రహృదయుఁ డగుచుఁ బెట్టి. 120

క. హనువున మత్కులిశము దాఁకినచో ఱిలుకవడి వీనికిం దొడ వగుచి
ట్టునికిఁ దగ హనుమంతుం, డను పే రిచ్చితిఁ బ్రసిద్ధ మై పెం పొనరన్. 121

క. కులిశము మొదలగునాయుధముల నేమిట వీనియంగములు నిర్దళితం
బులు గాకయుండ నొసఁగిలి, నలఘువరం బనియె దృక్సహస్రం బలరన్. 122

సీ. వారి నెయ్యెడల నీ వానరోత్తమున కాపద పుట్ట నీనని యుదధిపతియు
నగ్ని నెన్నఁడును నీ యగచరాగ్రణికిఁ గీడొందంగనీనని హుతవహుండు

భూతగణంబులచేత నీహరిసత్తమునకు నెగ్గొనర నీ ననిశివుండుఁ
గాలదండమున నీ కపిముఖ్యునకుఁ జింత వంత రా నీనని యంతకుండు
తే. వరము లిచ్చిరి తక్కటిసురలు నిజము,హానుభావానురూపంబు లైనపదవు
లొసఁగి రిమ్మాడ్కి మారుతి నసదృశప్ర,భావుఁ గావించి పద్మసంభవుఁడు ప్రీతి.

చ. అనిలుని వీడుకొల్పి దివిజావళితోడ వియత్పథంబునం
జనియె నతండుఁ బుత్త్రుఁ గొని సంతస మందుచు నేగుదెంచి యం
జనకుఁ దదీయబాహుబలశౌర్యములుఁ వరలాభముం గ్రమం
బున నెఱిఁగించి పోయెఁ గపిపుంగవుఁడుఁ శిశుకేలిలోలుఁ డై. 124

క. మునిజనులయాశ్రమములకుఁ, జని చని యాగోపకరణచయ మెల్లను దు
ర్వినయమున గాసి చేయుచు, ననికి కలిగి వారమందహుంకారములన్. 125

క. తనశక్తియు వరలాభం,బున వచ్చినపెంపు నుల్లమునఁ దలఁపక యి
వ్వనచరుఁడు నిజబలం బెఱుఁ,గనిగజజాతియును బోలెఁ గావుత మనినన్. 126

తే. బుద్ధిమంతుఁడు గావున వృద్ధతాప,సోక్తులకు స్రుక్కి దౌర్జన్య ముడిగి మెలఁగె
నితఁడు తనలా వెఱుంగనికతన మఱియు,వీరులనఁ గొంద ఱిమ్మహి వినఁగఁబడిరి.

క. ఇనునరదముముందట వెను, వెనుకకు వెసఁ జనుచు శబ్దవిద్యాధ్యయనం
బొనరించె నాతఁ డోజ్జగ,హనుమంతుం బోల నలవి యగునె యొరులకున్. 128

తే. జనకుఁ డగుఋక్షరజసుండు సచ్చుటయును, వాలిఁ బట్టంబుగట్టిన వానితమ్ముఁ
డైనసుగ్రీవుఁ డత్తఱి యావరాజ్య,భరముఁ దగఁ దాల్చియుండె యప్పవనతనయు.

క. చెలిఁ జేసి కొని ముదంబునఁ, గలసి మెలఁగుచుండి పిదపఁ గౌశికసుతుతోఁ
గలుపించి ఋశ్యమూక,స్థలి కాతఁడు వోవఁ దోన చనియె నితండున్. 130

క. తనలా వెఱుఁగనికతమున, నినసుతునకు వశ్యుఁ డయ్యె నేత్తైఱ సంక్రం
దననందనుభుజబలమ,ర్దనమునకుఁ గడంగఁ డయ్యె రఘువంశనిధీ 131

చ. అనపుడు సమ్మదంబు దొలఁకాడఁగ నిక్కము నట్ల కాక య
వ్వననిధి దాఁటి లంకయును వానివనంబును గాసి చేసి నం
దనుఁ బెగఁ జూచి వచ్చినవిధం బది యల్పులచేతఁ దీరునే
జనకజఁ గాంతుమే యసమసాహసుఁ డీతఁడు లేక తక్కినన్. 132

క. అని లజ్జావనతుం డగు, హనుమంతుఁ గటాక్షవీక్షణాదరముదితా
త్మునిఁ జేసి దాశరథి య,మ్మునిజనముం జూచి కేలు మొగుచుచు భక్తిన్. 133

అగస్త్యాదిఋషులు రాముని వీడ్కొని చనుట.

క. మసలితిరి విచిత్రకథా, రసవృత్తిం దడ వెఱుంగ రాక యనుష్ఠా
నసమయ మయ్యె నభోమ,ధ్యసమీపంబునకుఁ దరణిరథము వచ్చెన్. 134

మ. విజయం చేయుఁడు నావుడుఁ మునులు పృథ్వీనాథ యూహింప వి
శ్వజనీనుం డగునిన్నుఁ జూపు సదనుష్ఠానంబు గాదే భవ

ద్విజయశ్రీ దమకొర్కిఁ గా సుకృతముల్ వే భంగులం జేయునీ
ద్విజకోటిం బరికించి కొమ్మని కృతార్థీభూతచేతస్కులై. 135

క. క్రందుకొనఁగ నొక్కుమ్మడి, నందఱు దశవదనదమను నాశీర్వాదా
నందితుఁ జేసి యమందానందముఁ బొందుచుఁ దపోవనములకుఁ జనినన్. 136

క. తగ నెల్లవారిఁ బొమ్మని, జగతీపతి యచటు వాసి సమయసముచితం
బుగ నగ్ర్యయెడలకుఁ జని, పగలిటివర్తనము ప్రాజ్యపదవిఁ సలిపెన్. 137

తే. రాత్రియగుటయుఁ గార్యతూర్యత్రయాది,వివిధగోష్ఠివినోదముల్ వేడ్కనడపి
యతిమనోహరవాసగేహమున కేగి, నిరతిశయమోదమున సుఖనిద్రఁ జేసి. 138

చ. రవియుదయంబుకంటె మును రాజశిఖామణి మేలుకాంచె దా
నవకులమర్దనాంక సునాదము లై నసురంగగీతముల్
వివిధగతిప్రవర్తన నవీనము లై సొగయింప మాగధ
ప్రవరులు పాడుమంజుమృదుభంగికి వీనులు దొల్త మేల్కనన్. 139

ఆ. అపుడు సముచితంబు లగుకరణీయంబు, లాచరించి రఘుకులాధినాథుఁ
డభిమతప్రసాధనాభిరామాకృతి, నై మహావిభూతి నతిశయిల్లి. 140

చ. కొలువున కేగుదెంచి నృపకోటియు మంత్రికదంబకంబు దై
త్యులుఁ గపులుం గవీంద్రులు నియోగులు వందిజనంబు లిష్టభృ
త్యులు మొదలైనవారలు నిజోచితభంగి సుఖోపవిష్టులై
బలసి ముదంబునం గొలువఁ బ్రస్తవనీయసముజ్జ్వలస్థితిన్. 141

తే. చామరగ్రాహిణీకరచాయకటక, ఝళ్మిరాజినీరాజనరంజితుండు
భరతలక్ష్మణశత్రుఘ్నపరివృతుండు, నగుచు సామ్రాజ్యలక్ష్మిసొం పగ్గలింప. 142

సీ. పౌరజానపదాభిభాషణంబులు దగ నర్ఘ్యతెఱంగుల నాదరించు
నుత్తమహయదంతి సత్తమరథరత్నములు సూచి సవరణ లలవరించు
యోధవీరప్రకారోక్తినిరూఢన ముద్ధతి కెడఁదలో నుల్లసిల్లు
నిఖిలవిద్యాగమనిపుణవిద్వజ్జనసంభావనంబుల సంతసిల్లు

ఆ. ననుదినంబు నిట్టు లభిమతబహువిధ, సముచితప్రవర్తనము లొనర్చు
చతివిభూతినుండి కతిపయదినములు, పోవుటయును రామభూవిభుండు. 143

పట్టాభిషేకమునకు వచ్చినజనకరాజు మొదలగువారిని రాముఁడు వీడుకొలుపుట.

మ. జనకాదిక్షితిపాలలోకములకుం సంభావనాపూర్వకా
ర్చన లర్థిం దగ నిచ్చి వీడ్కొలిపి మార్గక్షేమసంవాహనం
బొనరింపం దనతమ్ములం బనిచినం బ్రోద్దామసేనాసహా
స్రనమద్భూమిభరస్ఫుటానమితశేషస్కంధు లై పోయినన్. 144

క. వనచరనిశాచరులమ్మన్నన నిచ్చలుఁ గ్రొత్త గాఁగ నరపతి వారిం
గొనియాడుచుండఁ గతిపయదినములకుం దమ్ము లరుగుదెంచిరి మగుడన్.

ఉ. అచ్చట రాజు లిచ్చినయనర్ఘమణిప్రకరం బుపాయనం
బిచ్చిన వేలువేల ధరణీశుఁడు వారల నాదరించి మీ
రెచ్చినవస్తుకోటి గణుతింపఁ గృతార్థతఁ బొందె డెంద మే
నిచ్చెద వీరి కంచు నసురేంద్రహరీంద్రులఁ జూచి వేడుకన్. 146

ఆ. పురుషరత్నములను బొందుట యుచిత మీ, రత్నములకు నని ధరావిభుండు
వారి కప్పు డొసఁగె గారవ మేర్పడ, జాత్యగుచిరరత్నజాలకంబు. 147

క. వనచరులకు నసురులకుం, గనకాంబరభూషణములు గణనకు మిగులం
దనుఁ జేరఁ బిలిచి యిచ్చుచు, జననాథుఁడు వేలువేల సంభావించెన్. 148

ఆ. ఇవ్విధమున వారి కెల్ల సంప్రీతి యొ,నర్చి రామధరణినాథుఁ డర్క
తనయుతోడి నిట్టు లనియెఁ బ్రసాదవి,కాసలలితవదనకమలుఁ డగుచు. 149

క. నీపురి కేగుము హరిసే,నాపరిపాలనము సేయు నయదక్షుఁడ వై
నాపిలిచినయప్పుడ సే,వాపరతంత్రత వహింపవలయుం జుమ్మీ. 150

క. అంగదుఁ బాటింపుము త,క్కుంగలయీసుభటకోటిఁ గొనియాడుము వీ
రిం గైకొంటిమిగాదె య,భంగుల యెప్పాట నరిది పనులకు నైనన్. 151

మ. అని సుగ్రీవునిఁ బ్రీతి వీడ్కొలిపి దైత్యాధీశ్వరుం జూచి యి
ట్లను లంకాపురి కేగు ధర్మమహితన్యాయంబు లోకంబు కీ
ర్తనసేయన్ భవదీయరాజ్యము చిరస్థాయిత్వముం బొందఁగా
మను నీబంధుల నీగి తేజమున సన్మానింపు మెక్కాలమున్. 152

క. అని కారుణ్యజ్యోత్స్న, జనకం బగుతనదువదనశశిమండల మా
తనినెమ్మనమ్ము సమ్మద, వనధిం బొంగింప నసురవరు వీడ్కొలిపెన్. 153

క. హనుమంతుఁ జూచి మత్కీ, ర్తనములు భువనముల నెంత దాఁక నడచు నీ
వును నంతకాలమును ని,త్తనువు విడువకుండు మనుచు దయ చిగురొత్తన్.

క. హిమధరణీధరతటసం,గమచారుమరున్నదీప్రకారసుభగతం
గమనీయంబుగఁ దద్వ,క్షమునం దొకహార మిడి యసదృశప్రీతిన్. 155

ఆ. తిగిచి కౌఁగిలించి యగచరసత్తము, సద్గుణములఁ దగిలి సంస్తుతించి
రఘువరేణ్యుఁ డాదరం బెలరారంగ, వికచవదనుఁ డగుచు వీడుకొలిపి. 156

క. తనుఁ బాయఁ జాల కందఱు, వెనుఁబడుట యెఱింగి ధరణివిభుఁ డొండొరునె
మ్మనము మఱుఁగు చుండఁగ ని, వ్వనటకుఁ బనియేమి యనిన వారతిభక్తిన్.

క. ధరఁ జాఁగి మ్రొక్కి తమతమ, పురములకుం జనిరి రామభూపాలుండున్
భరతాద్యనుజసమేతము, పరిపాలనచేసె రాజ్యభారంబుఁ దగన్. 158

ఆశ్వాసాంతము.

చ. శరదభిరామచంద్రరుచిజాలసఖత్వసముల్లసత్పయ
శ్శరనిధిగర్వచర్వణవిశారదమేదురకీర్తిపూరభా

సురలహరీకదంబపరిచుంబితపూర్వమహీభృదస్తభూ
ధరమలయాభిధానగిరిదైవతపర్వతమేఖలుం డిలన్. 159

క. ఫలితామరతరుశాఖా,తులితభుజుం డఖిలదిగ్వధూమస్తసము
జ్జ్వలదీధితిశాసనమణి, కులదీపక రాయగండగోపాలుఁ డిలన్. 160

మాలిని. చిరవితరణలీలాశీలుఁ డుత్సాహవిద్యా
పరిణతదృఢసంగాభంగుఁ డక్షీణపుణ్యో
త్కరపరిచయశిల్పాకల్పుఁ డాభోగశుంభ
ద్ధరణివలయరక్షాదక్షుఁ డబ్జాక్షుఁ డుర్విన్. 161

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిధేయ తిక్కననామధేయప్రణీతం బయినయుత్తరరామాయణం బనుమహాకావ్యంబు నందు సప్తమాశ్వాసము.



శ్రీ ర స్తు.

# నిర్వచనోత్తర రామాయణము

## అష్టమాశ్వాసము



పతిగౌరీపతివా
ణీపతిలీలాచతుర్థనిజవర్తనుఁ డి
ష్టాపూర్తనిరతమతి కరు
ణాపూర్ణుఁడు మనుమసిద్ధినరవరుఁ డెలమిన్. 1

క. అంత నొకనాఁడు నృపుఁ డ,త్యంతమహిమఁ బెద్దకొలువునం దున్నయెడన్
వింతయినకొన్నివచనము, లెంతయు మధురములు గాఁగ నిట్లనెఁ జవలన్. 2

### కుబేరపుష్పకము రామునియొద్దను వచ్చుట.

ఆ. ఏను బుష్పకంబ మానవాధీశ్వర, నీవు పరమధర్మనిపుణబుద్ధి
నవుడు నన్నుఁ గిన్నరాధిపుపాలికిఁ, బోయి యతనిపంపు సేయు మనుడు. 3

మ. భవదాజ్ఞం జని యాధనేశుఁ గని సేవం జెప్పుడుం దొంటియ
ట్ల విధేయాత్మతఁ జేయు నన్నుఁ బనిచెన్ లావణ్యవారాశి దా
నవవిధ్వంసనుఁ డాశ్రితాపదుదయోన్మాథక్రియాశాలి రా
ఘవచూడామణి రామదేవుఁడు కృపాకల్యాత్ముఁడై నావుడున్. 4

శా. ఆతం డచ్చెరువాటు సంతసము వక్త్రాబ్జంబునం దోఁపఁగా
నాతో నిట్లని పల్కె రామధరణీనాథుండు లోకత్రయం
బాతంకం బెడ సుజ్జగింప సుర లత్యానందముం బొంద దు
ర్జాతుం బంక్తిముఖున్ వధించి కొనియెన్ సర్వంబు లంకాపురిన్. 5

క. నీవును నం దొకసరకా, భూవల్లభునకు వినోదములకును బాత్రం
బై వలసినచోటులకుం, బోవలెఁ దివి నిన్ను నిందుఁ బుత్తేఁ దగునే. 6

చ. అదియునుగాక లోకముల నన్నిటిఁ గావఁ దలంచి దుష్టదు
ర్మదఖరదండమండనపరాయణులై చనునట్టివారి కి
ట్టిది దగుఁ గాక పూని యొకరిం గడతేర్పఁ గడంగలేక యొ
ల్లిదు లగువారి కేటికి సలీలవిహారము వేడ్క సేయఁగన్. 7

ఉ. కావున నెల్లభంగులను గ్రమ్మఱఁ జయ్యనఁ బోయి రామధా
త్రీవిభునొద్ద నిల్వుము మదీయహితం బిది యేను బంపఁగాఁ

భ్రోవుట నెగ్గు లే దతఁడు పొచ్చెము సేయక సమ్మతించి సం
భావన సేయు నన్ను జనపాలక సమ్మద మంది వచ్చితిన్. 8

క. పనిగొనుము నన్నుఁ గైకొని, యనునప్పలుకులకు మానవాధీశుఁడు సం
జనితబహుమానుఁ డై యి, ట్లనియెం బుష్పకవిమానమానందింపన్. 9

క. ఏవలన నుండి యైనను, నావలసినయపుడ గ్రక్కున నం జనుదేరం
గావలయుఁ దలఁచునంతకు, నీవల నెట్టట్ల తిరుగు మఖిలజగములన్. 10

క. సిద్ధులగమనంబులకు వి,రుద్ధముగాఁ జనకు మానరోషంబులు స
ద్బుద్ధులకుఁ దగమి యెఱిఁగి జ,గద్ధిత మతి సంచరింపు గౌరవ మొప్పన్. 11

తే అని మహీపతి ముక్తాయతాక్షతములు,గంధపుష్పంబులును గొనిగొనకమున
మన్ననకుఁ దగుదివ్యవిమానమునకు, నర్చనము నిచ్చి వీడ్కొల్పెనదియుఁ బ్రీతి.

క. తన కిష్ట మైనయెడకుం, జనినయనంతరమ రాజసత్తముతో ని
ట్లనియె భరతుండు పరిజను, లనుమోదరసానుభావితాంబుధిఁ దేలన్. 13

భరతుఁడు రామునిఁ బొగడుట.

ఉ. చోద్యముగా నమానుషవచోరచనల్ విలసిల్లె నెంతయుఁ
హృద్యము గాఁగ నామయవిహీనత నొప్పెఁ దనగ్ర ప్రకర్షముల్
మాద్యదరాతిసంచరణమార్గము లెల్లను మానె నెందు సా
వద్యులు లేరు బాలమృతివాదము లేదు ధరిత్రి నెయ్యెడన్. 14

చ. కొడుకులఁ గాంచి రంగన లకుంఠితసిద్ధులఁ బొందెఁ గర్షముల్
గుడువఁగఁ గట్ట నెల్లజనకోటికి నేమిఁ గొఱంత లేద యి
ప్పుడు భవదీయరాజ్యమున భూవరకుంజర సౌఖ్య మంది యి
ప్పుడమికి నిన్ను శాశ్వతవిభుండుగఁ గోరెద రెల్లవారలున్. 15

క. అనవుడుఁ దమ్ముని పలుకులు, విని మది ముదమంది మోము వికసిల్లఁగ నా
తనిఁ బ్రీతి వొందువీక్షణ,మున సీతావల్లభుఁడు ప్రమోదితుఁ జేసెన్. 16

ఆ. పుష్పకప్రసంగమునఁ దనుఁ గొనియాడు, భరతు నివ్విధమున భరితపరమ
హర్షుఁ జేసి సమయ మగుడు నాస్థానమం,డపము వాసి చనియెనృపవరుండు.

శ్రీరామునివినోదవిహారము.

ఉ. నిచ్చలు నిత్తెఱంగున ననింద్యచరిత్రుఁ డనేకభంగులఁ
వచ్చినవిన్నపంబు లనివారణమై విని నిశ్చయంబుగా
నిచ్చునదుత్తరంబులకు నెల్లజనంబులు సంతసిల్ల రా
లచ్చి నహీనసద్గుణకలాపములం దగిలించె దక్షుఁ డై. 18

చ. ప్రజ ననురాగ మందఁ బరిపాలనసేయు నరేశ్వరుండు దో
ర్విజితవిరోధి యై తుదిని వేడ్కమెయిఁ విహరించు నెందు నా

ర్యజనులు మెచ్చఁగా నరసి యాదిమునీంద్రనిబద్ధనీతివా
క్యజనితకౌతుకుం డగుచు నమ్మనుజేంద్రుఁడు సమ్మదంబునన్. 19

క. రమణీయస్థలముల హృద్యము లైనపదార్థములఁ బ్రియాసహితవిహా
రము సలుపు నుచితపరివారము నాగరికంబునను సరసమధురముగాన్. 20

ఉ. వేడుక నెత్త మాడుచుఁ బ్రవీణత మై గరువంపుఁ బన్నిదం
బాడుచుఁ జూచి యొండొరులయంగకముల్ మది మెచ్చి యుల్లసం
బాడు నెపంబు వెట్టి కొనియాడుచుఁ బువ్వులవ్రేటు లాడుచుం
జేడియయున్ విభుండు విలసిల్లిరి పొచ్చెము లేనిమచ్చికన్. 21

సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి తనువల్లిఁ గలయంగ దాన యలఁదుఁ
బువ్వులు బహువిధంబుగఁ గట్టి ముడి కోకభంగిగా నెత్తులు వట్టియిచ్చు
హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి యందంబు వింతగానలవరించు
మృగమదపంకంబు మృదువుగా సారించి తిలకంబు వెట్టి నెచ్చెలికిఁ జూపు

ఆ. జనకరాజతనయ మనము దలిర్పంగ, వివిధనిపుణలీల వెలయ నిట్లు
చతురముగ నొనర్చు సౌభాగ్యసారాభి, రామమూర్తియగుచు రామవిభుఁడు.

మ. ప్రణయక్రోధముఁ దాన యొక్కెమెయి సంపాదించుఁ బాదాంబుజ
ప్రణతిం గ్రమ్మఱఁ దీర్చు నేర్చి ధరణీపాలుండు సాహాతభా
షణముల్ వీనుల నించు మన్మథకళాస్వాతంత్ర్య మానంద స్ఫు
రణమార్గంబునఁ జెల్ల నిచ్చు రమణీరాగాబ్ధిపూర్ణేందుఁ డై. 23

సీతారాము లుద్యానవనమున విహరించుట.

చ. ఉపవనదేశకేలిజనితోత్సుకతాభరితాంతరంగుఁ డై
నృపుఁడు సఖీసమేతధరణీతనయాసహితంబు గాయకా
దిపరిజనంబుతోఁ జని తదీయసమీరుఁడు దన్నుఁ గానరా
కపగిది వీచినం గొలువు గైకొని యింపెద నాదరించుచున్. 24

క. చొత్తెంచిన వనపాలిక, మత్తమధుపములకుఁ దప్పిమధుభరితం బై
క్రొత్తావి గ్రమ్ముసరవిరి, గుత్తి విభున కిచ్చె వినయకుంచితతను వై. 25

చ. జనపతి యందఁగా వెఱచి చాడ్పున జానకిఁ జూపి కానుకల్
గొనఁ దగువార లుండ మనకుం జను నే యని చేయి వాయఁ బె
ట్టిన వనపాలికాకరపుటీకలితస్తబకంబు వుచ్చె మె
ల్పున సతి లేఁతనవ్వునఁ గపోలతలంబులఁ గాంతి వింతగాన్. 26

క. తరుపోతలతాకృత్రిమ, సరిదంబుజషండకేలిశైలముల మనో
హారము లగునెడలఁ గ్రీడా, పరతంత్రాత్ము లయి లలితభంగిఁ జతురతన్. 27

చ. అరవిరు లెవ్వ రెక్కుడుగ నారసి మేలుగ నేఱి కోయఁగా
వెరవరు లెవ్వ రొక్కొ కడువేగమ సెజ్జకుఁ జాలఁ గందునం

భారయనియట్ల కెంజిగురుఁ బ్రో వాడఁ గూర్తురు చూత మంచు న
న్నరపతియుం దలోదరియు నర్మవచోరచనార్ద్రచిత్తులై. 28

చ. అలరులఁ గోయుచున్ మధుకరావళిఁ జోపుచుఁ గీరపోతకం
బులపలువాఱుమాటలకుఁ బొంచుచు నంచలఁ బట్టఁ దారుచున్
లలితమయూరనర్తనవిలాసముఁ జూచుచు బోటిపిండుతోఁ
గలయుచుఁ బాయుచున్ బహులకౌతుకవృత్తి రమించి రెల్లెడన్. 29

సీ. తీఁగెయుయ్యేల లెక్క తూఁగియాడుచుఁగూడి పాడెడుమత్తాలి బాలికలను
బలుకులతోడన యలవడఁ దొడఁగిన నేరనికీరకుమారికలను
నింపారులేఁదూఁడులేటి పిల్లలకుఁ బెట్టుచు నున్నహంసకుటుంబినులను
ఫలరస మొండొంటి కెలమిఁ జంచుల నించు తఱిఁ జొక్కుకోకిలదంపతులను
తే. జూచిచూచియొండొరులకుఁ జూపిచూపి, చెలులకెఱిఁగించికొనియాడి చెప్పిచెప్పి
చిత్తహారివిహారసంసేవఁ దగిలి, యుల్లసిల్లిరి వనితయు వల్లభుండు. 30

ఉ. అల్లవె లెస్సపువ్వు లని యందనిగుత్తులదిక్కు సూపి తా
నల్లన చేరి నేను నెగయ న్నిను నెత్తెదఁ గోయు మంచు భూ
వల్లభుఁ డాదటం బొదివి వామవిలోచన నెత్తెఁ దత్తనూ
వల్లికతోన మైఁ బులకవర్గము కాముఁడు నారు వోయఁగన్. 31

చ నవకపుమావిమోకలఁ బెనంగినతీవలు వేడ్కఁ బెంపఁ బ
ల్లవములసెజ్జ లుల్లముల లజ్జ లడంపఁగఁ దేఁటితండముల్
దివుటల ముంపఁగా సమదలీల మనోజవినోదసక్తులై
యవసరసేవ మెచ్చి మలయానిలు సౌరభధన్యుఁ జేయుచున్. 32

ఆ. ఇవ్విధమునఁ బతియు నెలనాఁగయును వివిధప్రకారలీలఁ దగిలియుండఁ
జెలులుఁ గేలివనము గలయంగఁ జొచ్చి నెమ్మనములందుఁ గోర్కికొనలునిగుడ.

చ అలరులు గోయుచోట మధుపావళి మ్రోఁతకు ముగ్ధ లుల్కినం
గలకల నవ్వుచుం దొలుతఁ గైకొని మవ్వపుఁదీఁగె లాగి పు
వ్వు లొరులు గోయ నింకఁ దలఁపుం డని యొప్పుగ జంకె సేయుచున్
లలిఁ దమలోన మత్సరము లం దుదికొమ్మలగుత్తు లందుచున్. 34

సీ. మావిలేమోకలమవ్వంపుఁదీవలఁ జెన్నొంపఁ బెండ్లిండ్లు సేసి చేసి
పలుదెఱంగుల క్రొవ్విరుల నేర్పువాటించి తొడవులు గావించి తొడివితొడివి
పతులను బ్రియలఁ గా భావించి పొదరిండ్ల నిక్కులుగాఁ జేసి యేగి యేగి
చెట్టుపల్ నెఱయని చిలుకబోదలఁ బట్టి తెచ్చి బిడ్డలుగఁ జన్నిచ్చి యిచ్చి
తే. బొదివి పుప్పొళ్లు సల్లియుఁ బువ్వుఁ దేనియలఁ బదంపడి తడిపియునలి వసంత
మాడి యాడి యుద్యానవిహారలీల, సలిపి రంభోరుహావన లెలమి మిగుల.

చ. వినువు లోకకర్తచేతఁ గమనీయలతాంతము లున్న నొక్కెడం
గనుఁగొని ముగ్ధ యొక్కతె వికాసిని యై నవకంపుఁదీఁగెఁ బా
సినయొలగొమ్మగుత్తి సమీచేరి నయంబునఁ బట్టి కోయఁ జూ
చిన నగి యల్ల నవ్వ నది సిగ్గువడం గని యార్చి రందఱున్. 36

మ. కుచముల్ వాతెఱనీటిమీఁదివిలసత్కోకంబులం గ్రేణి సే
యుచు నుండన్ మెడ యెత్తి పాదయుగళం బూఁదంగ బాహాలతల్
పచరింపం గరమూలకాంతి నిగుడన్ భావంబు రంజిల్లఁ బా
డుచుఁ గ్రీడించిరి పువ్వుఁబోఁడులు లతాడోలాకళాప్రౌఢులన్. 37

సీ. చిగురాకు గెంగేలి చెలిమి యొనర్పంగ మవ్వంపు లేఁబొదల్ మలఁచిపట్టి
పెఱచేతినఖపంక్తి గిఱికొని చెన్నొంద నెగయుదీప్తుల విరు లినుమడింప
గురుఁబగన్నగమీఁద నెరసిన నెమ్మొగ మడ్డ మంకించి చూ పలవరించి
తనుగెంపు గడ చని దళములు సడలఁ బువ్వులు గోయ నొల్లకతొలఁగ నెత్తి
తే. యడరునెత్తావిపొలివోని యలరులేఱి, మెలపునలవాటు నెడఁదల మేకొనంగఁ
బ్రణయసఖులకుఁగన్నులపండువగుచుఁ,జతురముగనొర్తుపుష్పావచయముచేసె.

క. చెలిచెక్కుఁ జెమట యొక్కతె,యలసులఁ గొనితుడువ రెంటియందలిమెఱుఁగుల్
పొలివోవుట సరి యై యి,ట్టలముగ నొండొండ రాయుటయు జిగి దఱిఁగెన్.

ఆ. వనజవదన లిట్లు వనకేలి సలిపి చా,లించి జలవిహారలీలఁ గోరి
జనకరాజతనయ సముచితముగఁ జేరి, యిష్ట మెఱుకపడఁగ నిట్టు లనిరి. 40

ఉ. నీదుకృపాకటాక్ష మనునీరజషండమునందు నిర్భరా
హ్లాదముఁ బొందఁగా వనవిహారపరిభ్రమవృత్తి యెమ్మెయిన్
ఖేదము సేయ లేకునికిఁ గమలాకరకేలిమీఁద లే
దాదర మించుకేని నలినాయతలోచన మాకు నిత్తఱిన్. 41

చ. అనుడు విదేహరాజసుత యల్లన నవ్వ దొలంకుదృష్టులం
గనుఁగొనియెన్ సముల్లసితఘర్మజలాంకురజాలకంబు చె
న్నున విలసత్సుధాకణమనోహర మైనశశాంకబింబమో
యనఁ జెలువొందు రామవిభునానన ముల్లము పల్లవింపఁగన్. 42

క. చెలులచతురోక్తిరచనకు, నలినాయతనేత్ర నెమ్మనము విలసిల్లం
గొలనవిహారము సలుపం, దలఁచినఁ బతి కౌతుకంబు దనమదిఁ గదురన్. 43

సీతారాములజలవిహారవర్ణనము.

క. అనుచరుల నడిగియడిగియుఁ,బనిగొండ్రె వలయునెడలఁ బ్రభువులుపోద లెం
డని కమలవనము తెరువునఁ, గొనిపోవఁగ జానకియు సఖులుఁ జని రెలమిన్. 44

చ. చెలు వగునాననాబ్జముల చేరువఁ గుంతలభృంగమాలికల్
మెలఁగ వళీతరంగములమీఁద ఘనస్తనచక్రయుగ్మకం

బులు విలసిల్లఁ గూడుకొని । పొల్తులు పద్మినిపొంత వింతసొం
పొలయఁగ వేడ్కమై నరిగి । రొండొకపద్మినిఁ బోలి లీలతోన్. 45

తే. అందఱకుమున్న సలిలవి।హారమునకుఁ, గడఁగియొక్కర్తుగ్రక్కునఁ। బొడవులూష్చి
నెలఁతుకల మొత్తమనుపచ్చ।విలుతునసుఁగు, టంపపాదిలో నిబరిగో।లయట్టులుండె.

చ. పొలయుసమీరణంబు నిను।పుందనుపుం దగ నింపునెమ్మనం
బుల నొకయింపుఁ బెంప రతి।బోటులు విభ్రమ మొప్ప వీఁగుఁజ
న్నులపయిఁ గే లమర్చుచుఁ ద।నూలత లించుక గొంకఁ గుంతలం
బులు మెల పొందఁగాఁ జెవుల।పొందునఁ జేర్చుచుఁ గూడి వేడుకల్. 47

క. మగుడఁబడి కరళు లక్కడ, నిగుడఁగఁ దనుపారుకొలని । నీరు పులకముల్
నెగయించుచుఁ దొలుసోఁకున, సొగయింపంగూడి యాడఁజొచ్చిరి సుదతుల్. 48

సీ. సునుఁగాంతి దొలఁకెడు।ఘనకుచయుగళంబు లదరంగఁ జిలుకుల । నాడి యాడి
మెఱుఁగులు దూఁగెడు । మృదుకరవల్లిక లల్లాడఁ జల్లుపో।రాడి యాడి
జిగితొలం కెసఁగెడు । మొగములునిక్కుచు నడఁగుచుండఁగ నీఁదు।లాడియాడి
మిం చెల్లదిక్కులు । ముంచి చెల్లెడుమేసు లలసి క్రాలఁగ నోల।లాడియాడి

తే. యొలి నిలుచుచుఁగరళులఁ।దేలి చనుచు, మునిఁగిపోవుచు నోర్తోర్తు।ముంచిపట్టి
లోఁతునకునొయ్యఁ దిగుచుచు।నీఁత లేని, యచట మిన్నక యీఁదుచు।నాడిరర్థి.

చ. ప్రియమునఁ దూఁగి యాడుభ్రమ।రీతతెసోఁకునఁ జక్రవాకికా
చయమున మందహంసికల।సందడి ముం జెలువొందుకంటె న
న్నియు నెడగాఁ దొలంగినను । నీరజషండము పొల్చె విన్నగా
క యువతు లాటమైఁ జెలఁగు।క్రందున నొందిన క్రొత్తసొంపునన్. 50

చ. తరఁగలతూలుచందమునఁ । దమ్ములకమ్మనితావి హంసికా
విరుతముల౯ సమీరణము । వీచునయంబున నీరియింపునం
జిరతరసౌఖ్యసంపదలు । సేకుఱఁ గైకొని తారతార య
త్తరుణులయింద్రియంబులు ము।దంబునఁ జొక్కుచు నుండె నత్తఱిన్. 51

ఉ. తుమ్మెదపిండు మెండుకొని । త్రొక్కిన తేకులసందుసందులం
గ్రమ్మి చలత్తరంగశిఖ।రంబులఁ దూలెడుతమ్మిపుప్పొడు
ల్గ్రొమ్ముడు లూడి క్రమ్ముపొడి।లోపల నొక్కొకచోటఁ గెంపుచం
దమ్మునఁ జెన్ను చేసె వసితల్ గమలాకర కేళి సల్పఁగన్. 52

సీ. కలయ నెల్లెడ నాడు।క్రందునఁ బడి నీరి మీఁదదాఁటెడుగండు।మీలతోడ
మక్కువఁ దేఁకువ । దక్కిలోఁ దవిలి యాడెడుచక్రవాకుల । గెడలతోడఁ
దిరుగుడుపడి తూఁగు।తరఁగలు దాఁకి యల్లాడెడునంభోరు।హములతోడఁ
ఘనజంబు లొల్లక । వచ్చి యూర్పులతావి యన్నునఁ జొక్కెడు । నళులతోడఁ

తే. క్రాలుకన్నులు వలిచన్నుఁ గవలుఁ దెలివి
మొగములుఁ గురులు బంధురముగను బెరసి
చూడఁ దడఁబాటుగా జలక్రీడ సలిపె
నెలమి మనముల నెలకొనఁ జెలువపిండు. 53

క. చేయిచ్చి యబల నధిపతి, తోయజషండంబు సొరఁగఁ దోకొని చనఁ జే
దోయి పులకించెఁ గనుఁగవ, దో యలరుచు బెరసెఁ గోర్కితోఁ నెదగూడెన్.

క పాలఁతుక లోఁతని చొరఁగా, నలుకుచుఁ బిజేఁది కడుగు లిడ సప్పటిదృగ్దీ
ప్తులక్రందు సెందుసందడి, పొలపంబును నధిపునుల్లమున కింపొసఁగెన్. 55

క. కొలను సనఁ జొచ్చి యిది లోఁ,తల యిది యని క్రమ్మఱంగ నరిగి విభుం డు
త్పలదళలోచనఁ దోకొని, మెలపున మగుడఁ జని లీలమెయి నాడునెడన్. 56

సీ. కరయంత్రధారలఁ గప్పక పొరిఁ బాఱి విభుమీఁదఁ జూడ్కులు వెల్లిగొలుపు
లీల నంబుజముఁ గెంగేలఁ దెమల్పక ధరణీరమణుపాణితలము వట్టుఁ
దను పారుసీటిపైఁ దను విడి నలిఁ గ్రీడ సలుపక రాగరసమునఁ దేలు
గొలఁకున నాడునారులపజ్జఁ బోవక శృంగారచేష్టలఁ జెంది క్రాలు

తే. సలిలకేలికి నొఁసియు నొలయ కిట్టు, ప్రాణవల్లభుమీఁదికిఁ బ్రాఁకి వేడ్క
నలమి యలమి మైఁ బెనఁగొనఁ నతనియండ, నిలిచి విహరించుచుండె నన్నలినవదన 57

చ. కలయఁ జరించు తేఁటిపొదిఁ గైకొనఁ డాధవళాయతాక్షి వే
నలిపయిఁ జూడ్కినిల్పు నళినంబులఁ జేకొనఁ డాలతాంగిచూ
డ్కులు మది మెచ్చు హంసికలకోమలనాదము లాలకింపఁ డా
వెలఁది మృదూక్తినిస్స్వనము వీనుల నించు విభుండు వేడుకన్. 58

తే. చెలువ చివురుఁగెంగేలఁ గాశ్మీరజలము, నతివసగు మోమునను జందనాంబువులును
నెలఁత వేనలిఁ గస్తూరినీరు నయ్యె, నయ్యెడల కాంతిఁ బతికరయంత్రవారి. 59

క. తడిసి మెఱుఁగుఁబోగ రెక్కిన, పడఁతుకలలితాంగయష్టి పదనికి రాఁ బుల్
గడిగినమరుఖడ్గలతిక, వడువున మోహనవిలాసవైభవ మొందెన్. 60

చ. వెలఁదికి మోవికెంపు నెఱివేనలికప్పును దంతపంక్తినుం
దెలుపును బేర్చి యొప్పెసఁగె నీళులపొందున నట్ల యెవ్వరిం
గలసిన వారివారి దెసఁ గల్గుగుణం బనుకూలవృత్తి ని
ర్మలమధురస్వభావులు సమగ్రవిలాసము వొందఁ జేయరే. 61

సీ. నెత్తమ్మిపుప్పొడి నెఱినీర నిడుపుగాఁ బాపట సిందూరభంగిఁ బోయుఁ
జెందొవఱేకు మఱియ్యందంబుగాఁ దీర్చి కమనీయముగఁ దిలకంబు వెట్టు
నిందీవరములబహిర్దళములు దుల్చి కర్ణావతంసముల్ గా నొనర్చుఁ
గుముదనాళము పుచ్చి కొని పేరుగా గిల్లి హారంబువడువున నలవరించుఁ

తే. గమలదళము మృణాళకాండమునఁ జేర్చి, యాలవట్టంబుగావించి లీల మెఱయ
విసరు నల్లన రామభూవిభుఁడు జనక,రాజనందనమన మనురాగ మొంద. 62

చ. తమతమయంత నెచ్చెలులుఁ దారును నెప్పటియట్ల యాటఁ జి
త్తము దనివోక వారిగెడఁ దామరసాక్షియు రామదేవుఁడున్
సముచితలీల మై వివిధచారువిహారము లర్థి సల్పి రం
గము లభిరామరేఖ నవకాంతివిలాసముఁ బొంది క్రాలఁగన్. 63

ఆ. ఇట్లు కమలషండ మిక్కడక్కడ వడ, నభిమతప్రకారహారిలీలఁ
గేలిసలిపి వేడ్కఁ జాలించి వెడలిరి, విభుఁడు జానకియును వెలఁదిపిండు. 64

క. జలసిక్తము లగునంగక,ములచెలు వొండొరులభావముల నత్యార్ద్రం
బులు సేయఁ బతియు నాతియు, నిలిచి పొలిచి రపుడు కమలినీతటభూమిన్. 65

క. కలిరుగతిఁ గాంతి మేనుల, జలకణములు గోరకముల చందంబునఁ జె
న్నలవఱుపఁ గొలనివెలి నిం,తులు నిలిచిరి తీరలతలతోఁ దడఁబడుచున్. 66

## సీతారాముల లీలావిహారవర్ణనము.

చ. వలయు తెఱంగునన్ విభుఁడు వస్త్రవిలేపనమాల్యభూషణం
బులు దగఁ దాల్చి వందిజనముల్ చతురంబుగ సంస్తుతింప వా
రల నభివాంఛితార్థముల రంజితచిత్తులఁ జేసె నెమ్మనం
బలర నలంకరించిరి వయస్యలు సీతయు రేఖవింతగాన్. 67

క. లలితకమనీయమహిమల, నెలనాఁగయు సఖులుఁ గలసి యేతేరఁగ ముం
గల నడచి కంచుకులునుం, దలతల మనఁ బతియుఁ జతురతరముగ నడచెన్. 68

క. ఇమ్మెయి నిష్టవినోదము, లమ్ముదితయుఁ దాను రఘుకులాధీశుఁడు చి
త్తమ్ములఁ జిగురొత్తఁగ ని,త్యమ్మును సలిపె ననురాగతత్పరవృత్తిన్. 69

సీ. కర్పూరధూపాదిగంధసంవాసితాభ్యంతరరమణీయహర్మ్యములను
వర్ణచిత్రితపటవర్గనిర్మితతిరస్కరిణీమనోహరాగారములను
గోకిలకలహంసకులమృదుమంజులారవరమ్యనవలతాభవనములను
గృతకమయూరలాజితనిజాంగణచిత్తరంజితలీలాద్రికుంజములను
ఆ. బహువిధాభిరామవిహరణస్థలములఁ, దత్తదంతరంగవృత్తితోడ
మనుజవిభుఁడు ప్రియకుమది ముద మెలరార,లోలుఁడై మనోజకేళి నోలయు.

చ. ప్రమదము మూర్త మైనటులు రాగము రూపు వహించినట్లు వి
భ్రమ మొడ లెత్తినట్లు రతిరాజవిహారకుతూహలంబు దే
హముఁ దగఁ దాల్చినట్లు హృదయంగమ యై విలసిల్లు చున్న యా
రమణిఁ బ్రమోదరూఢమదరంజితఁ జేయు విభుండు ధీరుఁడై. 71

సీ. చూడ్కికి సందడి సొరనీక యెందేనిఁ జూచు చాడ్పున నొప్పు చూఱవిడిచి
తగవుమైసోపాన మగునునుఁబల్కుల నెక్కనరసముల నెలమి వడసి

తనదు మైమీఁదఁ । దావలంబుగఁ జేసి పులకలచిత్తంబు । నెల వెలింగి
బెరసిన మేవడి । సఖులఁ గాయువు గని కన్నులచెన్ను । నన్నుఁ గాంచి

తే. సొగిసి కౌఁగిట సోలెడు । మగువ యంత, రంగ మావిష్ట మైనటు । లంద కలసి
తగులు నగిలించుటయును నిర్దళకు సరియ, కాఁగ నధిపతి లలితాంగిఁ । గవసె నర్థి.

చ. ఎడఁ బొలివోని వేడుకల । యే డ్తైఱసొంపున నంతకంత కె
క్కు డగుమదంబు పేర్మి । రతికోర్కులు గొమ్మలు వోవ నప్పుడ
ప్పుడ నలిఁ జేరినట్టులు । విభుండును వారిజపత్త్రనేత్రయుం
గడపల లేని కేలితమకంబున నుల్లము లుల్లసిల్లఁగాన్. 73

సీ. ఎలమి నొండొరులకుఁ । దలయంపులుగఁ జేయు బాహాలతలు జన్మ । ఫలము లొంద
నలి నొండొరుల మీఁదఁ । బొలుపారు కనుదోయి సుఖములఁ జుబ్బన । చూఱ లాడఁ
గాయవ్వ నొండొంటిఁ । గదిసిన తనువులు పులకాంకురంబులఁ । బ్రోది గాఁగ
నిచ్చమై నొండొంటఁ । జొచ్చిన మనములు నినుపారునింపుల । నెలకొనంగఁ

ఆ. గడఁక లొండొరువులఁ । గడవఁ గేలిచతుర, తలు వెలయఁ జూడ్కులతిశయిల్ల
సుఖము సొంపు నొక్కఁ । సూటిన నడవంగ, సతియుఁ బతియుఁ గ్రీడ । సల్పి రర్థి. 74

ఉ. లేని నెపంబు వెట్టి మదలీలకు నాఁక యొనర్చి మానముం
బూనినయట్లు సౌ రెదకుఁ । బుక్కిటబంటుగఁ జేసి యల్కవే
పో నొక కారణంబుపయిఁ । బూని వెసం బయిపాటు మున్నుగాఁ
దేనియ లుట్టఁ దేలు జగతీపతి కుర్మలి రాముఁ డింతికిన్. 75

సీ. అదరులు గదిరిన । నతిముఱి వర్తిల్లు చెయువులక్రందునఁ । జిక్కువడుచు
నేర్పులు గడఁగిన । నిరతంబులై చెల్లు కామతంత్రంబులఁ । గళుకు లగుచుఁ
గోర్కు లేచినఁ ద్రిప్పికొనునింద్రియంబుల యక్కఱ దీర్పంగ । నడరఁ బడుచు
మెచ్చులు వచ్చిన । మిగుల నానందించు మనములతలపోఁత । కనువుగొనుచుఁ

తే. దనివి వొందిన నల్లన । తలఁపు మగుడ, వేడుకలయెడఁ గొసరుల । వింతతమక
ములకు మొదలైనఁ బొదలుచు । నెలఁతుకయును, మనుజపతియు నొనర్చిరి । మదనకేలి.

క. ఒండొరువులమదనకళా, పాండిత్యము మెచ్చుమియు నెపం బిడ నెపమై
యొండొరులకు నానంద మ,ఖండము గావించు రతము । నైగొండ్రు తగన్. 77

సీ. తూలెడు నునుగురుల్ । వో తెంచు ఘర్మాంబువులఁ దోఁగి నుదుటిపై । మలఁగుచుండ
లలిసొంపు పెంపునఁ । బొలయక కనుదోయి నానుచు నెడ నెడ । మ్రానుపడఁగఁ
గుచములనడుమఁ దూఁగుచు నున్నహారము లల్లన చను మొనలందుఁ గ్రాల
బెడఁ గొంద నల్లాడు । తొడవుల మెఱుఁగులు వెడలక యచ్చోటఁ । గడలుకొనఁగఁ

తే. గేలికడఁక దొడ్డొ నడఁగించి యవయ,వములు సడలంగఁ జేయుచు । వచ్చుచొక్కు
లేఁతదమిఁ గ్రొత్త చెన్నొందు । లేమ చంద,మధిపు డెందమానంద । మయంబు సేసె. 78

# అష్టమాశ్వాసము.

క. మఱపు ముసుఁగువడ వేడ్కలు, దెఱపులుగొని నిగుడ రెండు దెఱఁగులచేతం
బొఱివోవు నెమ్మనంబుల, నెఱి నిరువురు నలవరింప నేరరు రతులన్. 79

సీ. మానవనాథుఁ డుగ్మలిఁ గౌఁగిలించుచో సడలు కేల్బిగియించు కడఁక లేమి
యతివ భూధవునధరామృతం బానుచో దొప్పవాతెఱ యంటుతో ట్రుపాటు
నృపతి లేమను గేలి నిపుణత నొరయుచో వెడఁగులై చెయ్వులు వీడుపాటు
వామాక్షి మేదినీవల్లభుఁ గొసరుచోఁ గొదలు పల్కుల క్రియఁ గూడ కునికి

తే. యొండొరులచిత్తములనాఁటి యొలయుచున్నఁ, జొక్కులెక్కుడు సేయంగ సోలమడరి
యిరువురును సౌఖ్యరసములఁ గరువు గట్టి, పోసిచేసినరూపుల పోల్కులైరి.

క. భూపాలుఁ డిట్లు మోదం, బే పారఁగ మోహములకు నెల్ల నివాసం
బై పాలించెను రాజ్య, శ్రీపెం పభిరామముగ నశేషధరిత్రిన్. 81

## సీతాదేవి గర్భము దాల్చుట.

ఉ. అత్తల కెల్ల భూరివినయంబునఁ బంపు దగంగఁ జేయుచుం
జిత్త మెలర్ప నాథుపని సేయుచు బాంధవతుష్టి సేయుచున్
విత్తములన్ మహీసురుల వేమఱుఁ దృప్తులఁ జేయుచున్ మహో
దాత్తగుణాలి నొప్పె వసుధాసుత నిత్యశుభంబు పెంపునన్. 82

క. సమ్మదమున భూచక్రము, తొమ్మిదివే లేఁడు లేలి తుది రాముఁడు దా
నెమ్మనమున నినకులము ధ్రువమ్ముగ సత్సుతులఁ బడయవలె నని తలఁచెన్.

ఆ. తొమ్మనూటిమీఁదఁ దొంబదితొమ్మిది, వర్షములకు నంత వసుధపట్టి
యతిథివిప్రదేవపితృతర్పణంబుల, గర్భమహిమఁ దాల్చెఁ గౌతుకమున. 84

క. అంత నొకనాఁడు లీలం, గాంతారత్నంబు నాథు కడ మెలఁగఁగ నే
కాంతంబునఁ గనుఁగొని య,త్యంతమనోమోద మడర నతఁ డిట్లనియెన్. 85

సీ. చంద్రికపైఁ బర్వు చారువల్లికవోలె వెలఁది నీయంగంబు వెలుకఁ బాఱె
హేమకుంభములపై నింద్రనీలములట్లు కాంత నీచను మొనల్ గప్పు మిగిలె
వెడవాడు లీలారవిందయుగ్మము మాడ్కి సుదతి నీకనుఁగవ సోల మందెఁ
బెన్నిధిఁ గాంచిన పేదచందంబునఁ బొలఁతుక నీకౌను పొదలుకొనియె

ఆ. లలన నీదుచెయ్వు లలసంబు లయ్యె, ల,తాంగి నీదుమందయానలీల
జడను దాల్చె గర్భసంపదకలిమి నీ,యందుఁ దేటపడియె నిందువదన. 86

ఉ. మొగ్గల మైనకోర్కె దుదిముట్టఁగ నుత్సవలీలఁ జూడ నా
కగ్గము గాఁగ వంశము సుధాంశుఁడు గల్గిన రాత్రివోలె నీ
విగ్గురుగర్భసంపద వహించియుఁ జెప్ప వదేమి నాపుడున్
సిగ్గును లేఁతనవ్వుఁ గదిసెం గమలాననముద్దుమోమునన్. 87

## రాముఁడు కోరిక యడుగఁగా సీత గంగాతీరవనములకుఁ బోఁగోరుట.

చ. తనమదిలజ్జ వాపి వసుధాపతి మేవడి దైనమాటపాం

దునఁ దగఁ జేరి కోరికలు । దోఁచు తెఱం గెఱుఁగం దలంచి య
ల్లన యడుగంగ సమ్మదవిలాసము నేర్తెఱ నెమ్మొగంబు నూ
తనరుచి నొప్పఁగా వికచతామరసానన వేడ్క నిట్లనున్. 83

శా. సింగంబుల్ మునిబాలకుల్ దిరుగుచోఁ । జెయ్యేవి మో మియ్య సా
రంగంబుల్ దిరుగం దపోధనసతుల్ । రాజీవముల్ గోయుటల్
రంగద్వీచులఁ బద్మముల్ మెఱయ ధర్మప్రీతి పైఁ జూడుచున్
గంగాతీరము కానలోనఁ దిరుగంగాఁ గౌతుకం బయ్యెడిన్. 89

ఆ. అనిన రఘువరేణ్యుఁ । డమ్మాటలకు నియ్య,కొని లతాంగి నీవు । కోరినట్ల
చేయు టెంత పెద్ద శ్రీఘ్రంబ యచటికిఁ, బుచ్చువాఁడ ననుచు । నిచ్చమెఱసి. 90

క. ఆసతికడ సరసంబుగఁ, బాసి నడిమికొలువునకు నృపాలుఁడు సనినన్
దాసి నిరంతరమును సే,వాసౌఖ్యముఁ బొందఁ బడయువారలు ప్రీతిన్. 91

రాముఁడు నర్మసచివులవలన లోకాపవాదము నెఱుంగుట.

క. పాడసూపి యుచితముగ నలు,గడ నల్లన చేరి కొలువఁగాఁ దగుమాటల్
వాడమినసమయంబునఁ బతి, పడుచుం బైదలను బోవఁ । బనిచి నయమునన్. 92

తే. ఫుల్ల రాజీవదళములఁ । బోల్ల నేయు, వెడఁదకన్నుల నునుఁగాంతి । వెల్లిగొనఁగ
నర్మసచివుల మొగములు నగుచుఁ జూచి । వారిలో భద్రుఁ డనియెడువానితోడ.

శా. పౌరశ్రేణియు భూజనంబు నను సంభావించి కీర్తించునో
నేరం బున్నదఁ టంచు లాఘవముగా । నిందించునో దీని నీ
వేరూపంబున వింటి విన్న తెఱఁ గొక్కింతేనిఁ బోనీక వి
స్తారం బొప్పఁగఁ జెప్పు మన్న నతఁ డువ్యత్ప్రీతిమై నిట్లనున్. 94

మ. జనకుం డానతియీఁ దపంబునకు నిష్ఠం గానకుం జన్న వెం
పును దుఃఖం బొకయింత లేక లవణాంభోధిం గళామాత్రఁ గ
ట్టినసామర్థ్యము దేవబృందములకున్ । డెందంబుపై రా యనం
జనునాపంక్తిముఖున్ వధించినమహోత్సాహంబుఁ గీర్తింపఁగన్. 95

క. కలయంగ నెల్ల యెడలం, బలుమాఱును వింద ననిసఁ । బ్రమదం బెసఁగం
గల దున్నరూప యిది నీ,పలుకులు మాకెక్క నని నృపాలుఁడు మఱియున్. 96

తే. తొలుత రాజ్యంబు సేయంగఁ । దొడఁగి మనము
వివిధవర్ణాశ్రమంబుల । వృత్త మరసి
యలవరించుచోఁ గొందఱ । కహిత మగుటఁ
గొన్ని మాటలు పుట్టక । యున్నె యనిన. 97

ఉ. ఈయనుమాన మేటికి నరేశ్వర మీపరిపాలనక్రియో
పాయము ధర్మనిష్ఠయుఁ గృపాగుణమున్ వినయంబు పెంపునున్

న్యాయవిశోధనంబును నియంత్రితసత్యవచోవిలాసముం
బాయక యిందు నెందు నరిభంజన సూరిజనానురంజనా. 98

చ. అనవుడు భద్రుఁ జూచి ముదమందుచు రామధరాధినాథుఁ డి
ట్లనియె మదీయసంస్తుతులు సన్నియుఁ జెప్పితి కీడుమాట సె
ప్ప నగునొ కాదొ నాక ననుఁ బాపము సుట్టక యుండ నేమి గ
ల్గినఁ గలయంతవట్టును సకిల్బిషమానస చెప్పు మేర్పడన్. 99

క. అనుటయు నతఁడు వెలవె, ల్ల నగుచు దెందంబు గొందలం బందఁగఁ జె
ప్పను జెప్పకుండ నేరక, యనుమానముతోడ నిక్కి దక్కడవడిసన్. 100

ఆ. అధిపుఁ డింగితజ్ఞుఁ డై యితఁ డొప్పని పలుకు వినఁగఁ జెప్ప నలికియున్న
వాఁడు గొంకుఁ బాపవలయుఁ బొమ్మని తన, యెదఁ దలంచి యతని కిట్టు లనియె.

క. లోకులమాటలు సెప్పిన, నా కెగ్గగునే ప్రియం బొనర్పు హితుఁడ వై
నీకింత వెఱవ నేటికి, నేకాంతం బయినచోట నే నడుగంగన్. 102

ఆ. కీడు గాంచి మనల నాడెడువారల, నోళు లుడుపఁగా మనోముదంబు
నొందుఁ గాన దీన నొండెగ్గు లే దని, తఱిమి యడుగుటయును వెఱపుఁ బాసి.

క. ఇతఁ డెటు సెప్పు నొకో నా, మతి గలఁగెడు జనులపనులు మఱవక యుచిత
స్థితి నడపుదు నని తలఁకెడు, పతి కాతం డెలుఁగు రాలుపడ ని ట్లనియెన్ 104

సీ. ఎల్లలోకంబులు నెఱుఁగ సత్యంతదురాచారుఁ డై సదశాసనుండు
చెఱఁ బట్టికొనిపోయి యతిముఖ్యఁ బెద్దకాలంబేనిఁ గేలివనంబులోన
నునిచిన నున్న యాజనకరాజాత్మజ నెడ నించుకేనియు నెగ్గు గొనక
ధైర్యంబు వాటించు తలఁపు వోవిడిచి మన్మథగోచరుం డయి మగుడఁ దెచ్చి
ఆ. యనుగలంబు నేసికొని యున్నవాఁ డని, యజ్ఞు లయినజనము లాడుచుండ
నెల్లచోట యిందు నింతనిక్కువ మని, పల్కుటయును రఘునృపాలకుండు.

క. సుఱసుఱ దెందము సూఁడిన, తెఱఁగున నొక్కింత స్రుక్కి ధీరుం డగుటం
గొఱఁతవడ కుండ వినుటకుఁ, జెఱువారల కిట్టు లనియెఁ బ్రియవదనుం డై.

క. మీరలు నాసత్కీర్తియ, కోరుదు రే ప్రాద్ధుఁ గాన గురుదురితపరి
హారము సేయం దగు నే, నీరూపమ యగుట నిశ్చయింపఁగ వలయున్. 107

చ. అనుడు విషాద మంది విజయాదులు దేవ భవచ్చరిత్ర మ
త్యనఘము దీనిఁ జూచి చెడనాడఁగ నాలుకయెట్టు లాడు దు
ర్జను లగువారు కొందఱు విచారవిహీనత నిట్లు వల్కఁగా
విని విని వారిమాటలకు వేసరి యుండుదు మెచ్చు నెల్లెడన్. 108

లోకాపవాదభీతుఁ డై రాముఁడు తమ్మునితో నాలోచించుట.

ఉ. నావుడు మూర్ఛవచ్చినమనంబునకుం ధృతి యూఁత యిచ్చి సం
భావన వారిఁ బోఁ బనిచి పార్థివముఖ్యుఁడు దల్లడంబునం

దాపుకొనంగ లేక తనతమ్ముల నప్పుడ పిల్వఁ బంచి నా
నావిధచింత ముట్టికొనిరన్ వెగ డందుచు నార్తమూర్తి యై. 109

ఆ. అధికవినయ మెసఁగ నాభరతాదులు, నగరి కేగుదెంచి నరవరేణ్యుఁ
డేకతంబ వీకు వీకాడువగలచే, వందుచుండఁ జేర వచ్చి వచ్చి. 110

సీ. తావలు లేనిసుధారోచియునుబోలె నొంటి యేలొకొ నృపుఁ డున్నవాఁడు
చిత్రరూపంబున చెలువున నేలొకో పతిమూర్తి నివ్వెఱపాటు నొందె
సాపరాధులఁ జూచు నట్లెల్లకో రాజు మనమీఁదిచూడ్కులు మగుడఁ బెట్టెఁ
గొముని పైఁ బర్వు కమలంబుచాడ్పున విభుముఖం బేలొకొ విన్న నయ్యె
తే. ననుచునల్లనిమాటల నక్కుమారు, లుత్తరము లేనియడుగుటలొండొరువుల
నడుగు చంతంత నిలుచుచు నగ్రజన్ము,పాలి కేతెంచి భక్తిమైఁ బ్రణతు లైరి.

చ. తగఁ బ్రణమిల్లినం దనదుతమ్ముల నందఱఁ జూచి వేఁడి పై
నెగయుకరంబులం గొని మహీపతి యల్లన యెత్తి బాష్పవా
రి గడలుకొన్న నాఁగుచు శరీరము నేలకు వ్రాల వచ్చినన్
మగుడఁగ నిల్పుచున్ వెగడుమాటలు గుత్తుకలోనఁ బట్టుచున్. 112

క. ఈరాజ్యసంపదున్నతి, మీ రిచ్చినయదియ నాకు మీర విపత్సం
తారకులును జుట్టంబులు, మీర చెలులు మీర ధనము మీర తలంపన్. 113

క. కావున నెయ్యది పుట్టిన, మీవలనన తెగువ యగుట మీ కెఱిఁగింపం
గావలయు లోకజననిం, దావాదము తెఱఁగు వినుఁడు తాత్పర్యమునన్. 114

క. అనుతనమాటకు మున్నే, మనుజపతికి నింత యేమి మాడ్కినొకో నేఁ
డనువగ డోలాందోళిత, మనస్కులై యున్నయక్కుమారులు వినఁగాన్.

ఉ. రావణునింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చినం
భావన సేఁత కష్ట మనిపల్కిరి చూచితె లక్ష్మణా మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁ డిచ్చె నాకు సతిఁ బాపపుమాటలు పుట్టె నియ్యెడన్. 116

ఉ. వేవుర నేల నేను బృథివీసుతచిత్తము పెంపెఱుంగ నే
భూవలయంబు సంచలతఁ బొందిన వారిధి మేర దప్పినన్
దేవనగంబుపాఁ తగలి త్రెళ్లిన సం దొకకీడు గల్గునే
యావనజాక్షి నిట్లు సెడ నాడిన నక్కట నోరు ప్రువ్వదే. 117

లోకాపవాదమునకై రాముఁడు సీతను విడనాడ నిశ్చయించుట.

ఉ. ఐనను మీకు నొక్క తెఱఁ గస్ఖలితంబుగ నేను జెప్పెదన్
దానికిఁ గాదు నాక భువనంబులకున్ నను శుద్ధుఁ జేయుఁ డ
జ్జానకి నెల్లభంగుల నిజంబుగ నిప్డు పరిత్యజించినం
గాని యకీర్తి వాయ దటుగాదని నోళ్లులు మూయవచ్చునే. 118

క. జడమతు లయినజనంబుల, వెడమాటలు మాన్ప నిదియ వెర వెబ్భంగిన్
సడికంటెఁ జావు మే లని, యెడిపలుకు దలంప వలదె యిలఁ బురుషులకున్.

ఆ. పూని జీవితంబు లైన మి మ్మైనను, వలయుచోట విడువ వచ్చుఁ గాని
వర్తనంబు గౌరవం బొకయించుక, యైన విడువ దుస్సహంబు నాకు 120

క. ఒకభంగిఁ బాపికొన రా, దొకొ మిథ్యానింద యనుచు నొండు దెఱఁగు మీ
రకుటిలచిత్తుల రై చూ, డకుఁడీ నామదికి సంకటం బిది యెల్లన్. 121

క. ఏ నెఱిఁగి యయిన నెఱుఁగక, యైనను నిత్తెఱఁగ నిశ్చయము సేసితి నా
యాన సుఁడీ నాకడ్డము, గా నొకపలు కైనఁ జెప్పఁ గడఁగితి రేనిన్. 122

చ. అనవుడు వార లొండొరులయాననముల్ గలయంగఁ జూచి య
జ్జనపతి తెంపు వా పెడువిచారము చిత్తములం దొకింత యై
నను మొలతేర కవ్విధము సం దమనిశ్చయ మైన లేక యే
మనియును బల్కరాక వెఱఁగందఁగ వెండియు నాతఁ డిట్లనున్. 123

ఉ. సూక్ష్మముగాఁ దలంచినవిశుద్ధచరిత్రము దుఃఖహేతువే
లక్ష్మియుఁ బ్రాణముల్ సరియె లజ్జకు రిత్తవిచార మేటికిన్
లక్ష్మణ యెల్లి నీవు చటులస్థిరవాజులఁ దేరఁ బూన్చి యా
పక్ష్మలనేత్రఁ గోరికనెపంబునఁ దోకొని పొమ్ము కానకున్. 124

క. ఇమ్ములఁ జని గంగాతీ, రమ్ముతపోవనములందు రమియింపఁగ నా
సమ్ముఖమునఁ గోరినయది, యమ్ముద్దియ నచటి కనుప నగు సుకరముగాన్. 125

క. కొని చని వాల్మీకితపో, వనపరిసరభూమిఁ ద్రోచి వచ్చెడి దయ్యం
గనకును నాకును నిదె విధి, యనుమానింపకుఁడు నిశ్చయం బైనయెడన్. 126

క. అని పలికి తనదు తెగువకు, ననుజన్ములు తలలు వాంచుటనుమతిగాఁ గై
కొని వారి నిండ్లకును బోఁ, బనిచి యచటు వాసి ధరణిపాలుం డరిగెన్. 127

క. ధాత్రీపతి కనుజులకును, నేత్రంబులబాష్పవారినిద్ర నుడుప నా
రాత్రి యొకభంగిఁ జనిన సు, మిత్రానందనుఁడు వంత మిగిలినమదితోన్. 128

రాముఁడు లక్ష్మణునివెంట సీత నడవులకుఁ బంపుట.

చ. దివసముఖోచితక్రియలు దిగ్గన సల్పి సుమంత్రుఁ జూచి దా
నవకులమర్దనుండు రఘునాయకుఁ డెక్కురథంబుఁ బూన్పు గా
రవమున దేవి నిర్జరతరంగిణిపొంతఁ దపోవనంబులన్
వివిధవినోదముల్ సలుపు వేడుక నాథుననుజ్ఞ నేగెడున్. 129

ఆ. అనుడు నతఁడు గడఁక నరదంబు సక్కఁగాఁ, బెట్టి ఘోటకములఁ గట్టి తెచ్చి
సవినయంబు గాఁగ సౌమిత్రిముందట, నిలిపె నంత మేదినీవిభుండు. 130

క. అడ లడఁచి నెమ్మనంబున, వెడ తెలి వొడఁగూర్చి మాట వేర్పడ కుండం
జిడిముడిపడక నయంబున, నెడమడు వొక్కింత లేక యిట్లను సతితోన్. 131

చ. పొలఁతుక గంగ చేరువతపోవనభూములు సూడ నీమదిన్
మొలచినకౌతుకంబు దుదిముట్టఁగ లక్ష్మణదేవు నిన్ను నం
దులకు మనోముదం బెసఁగఁ దోకొని పో నియమించితిన్ సము
జ్జ్వలమణికాంత మైనరథసత్తమ మెక్కుదు రమ్ము నావుడున్. 132

ఉ. అక్కట నాదువేడ్కకుచితానుచితంబులు సూడకే విభుం
డొక్కతలంపువాఁ డయి సముత్సుకతన్ నను దవ్వు పుచ్చఁగా
నిక్కమ యియ్యకోలయ నెయ్యము తియ్యము గాదె యంచు నిం
పెక్కఁగ రాముడెంద ముదు కెక్క రథంబు లతాంగి యెక్కినన్. 133

ఉ. అత్తటి నున్నధైర్యమున కచ్చెరువందుచు జీవితేశుహృ
ద్వృత్త మెఱుంగమిన్ మదిని వేనికి నమ్ముట కుమ్మలించుచుం
జిత్తముఖేద మానసముఁ జెందిన మాన్పఁగ లేక లక్ష్మణుం
డుత్తల మందు చున్న విభుఁ డుగ్మలి కాతనిఁ జూపి యిట్లనున్. 134

ఉ దూరము నాక ఘోరవనదుర్గతలంబులఁ గేలి సల్పఁగాఁ
గోరెడుభామలం బ్రియలఁ గోరినయట్టుల పుచ్చు రాజులన్
ధారుణి నెందుఁ గాన మని తా మును దీనికి నడ్డపెట్ట నే
బోరతమాడి యిట్లు నినుఁ బుచ్చుట కల్గినవాఁడు సూచితే. 135

క. అని తనమొగ మొప్పమి కమ్మనుజేంద్రుఁడు నెఱము దప్పి మా టాడినఁ దా
నును దనపురహఃపవచనములను సంభాషణ మొనర్చె లక్ష్మణుఁడు దగన్. 136

ఆ శ్వా సాం త ము.

ఉ పుణ్యుఁడు భారతీవిభవపూతవికాసముఖారవిందలా
వణ్యుఁడు దీవ్రకోపదవవహ్నినిరర్గళదగ్ధశాత్రవా
రణ్యుఁడు మానినీహృదయరంజననైపుణరూషరూపతా
రుణ్యుఁడు భీతివిహ్వలవిరోధిశరణ్యవరేణ్యుఁ డున్నతిన్. 137

క. దుర్జయవైరిధరాధిప, తర్జననిస్సాణగర్జితస్ఫురణుం డ
తూర్జితబాహాసంపదు, పార్జితవిఖ్యాతకలియుగార్జునుఁ డెలమిన్. 138

మాలిని. వితరణఖని యుద్యద్వీరశృంగారలక్ష్మీ
పతి రతివరలీలా షంగకృత్సంగతాంగుం
డతులితమతివిస్తారాప్త దేవేజ్యుఁడిజ్యా
ప్రతిదినపరితృప్తిప్రాప్తసప్తార్చి ధాత్రిన్. 139

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిధేయ తిక్కననామధేయప్రణీతం బైనయుత్తరరామాయణం బనుమహాకావ్యంబునం దష్టమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# నిర్వచనోత్తరరామాయణము

## నవమాశ్వాసము.



వాణీకీర్తిప్రత
తీవేష్టితమూర్తి వసుమతీదైవతమో
దావహుఁడు కల్పకస్ప
ర్ధావిజితుఁడు మనుమసిద్ధిధరణీశుఁ డొగిన్. 1

క. జననాథుఁ డుడుగరలు భూ,తనయమనం బలరఁ గట్టి తగ నొప్పించెన్
మునివరులపత్నులకు ని,మ్మని మణిమయభూషణాంబరాదులు ప్రీతిన్. 2

తే. ఇవ్విధంబునఁ దనతలం పించుకంత, యైన జానకి యెఱుఁగనియట్లు గాఁగ
బాలతోడ విషం బిడుపగిది ననిచి, పుచ్చి రాఘవుఁ డుల్లంబు నొచ్చి మరలె. 3

లక్ష్మణుఁడు గంగాతీరవనములకు సీతను దోడ్కొని పోవుట.

చ. లలితగతిన్ సతోయకమలస్ఫుటమార్గమునన్ శరీరర
క్షులు వినయంబుతో నడపి గౌరవ మొప్పఁగ భక్తిపెంపుమై
నలయక పంపు సేయుచు మహాశ్రమభూములు వీడుపట్టుగా
లలనఁ దగన్ సుమంత్రుఁడును లక్ష్మణుఁడుం గొని పోయి రిమ్ములన్. 4

క. చని చని జనకతనూభవ,తనతనువున దుర్నిమిత్తతతి గలయఁగఁ దోఁ
చిన నిట్లనియె సుమిత్రా,తనయునితో నెమ్మనంబు దలఁకుచు నుండన్. 5

ఉ. తప్పక మున్ను గన్గొనువిరోధంబ యమంగళసూచకంబు లే
నిప్పుడు నాశరీరమున నెన్నియొ కాంచితి సంతరంగముం
ద్రిప్పికొనం దొడంగెఁ బతిదిక్కున బంధులవెంట భృత్యులం
దొప్పమి యేమి పాటిలుట కో వెఱ పయ్యెడు నాకు లక్ష్మణా. 6

క. అనవుడు నమ్మాటలు గీ,టునఁ బుచ్చుచు నతఁడు లలితడోలాయతవీ
చినిచయసుభగాకృతి యగు, ననిమిషనదిఁ జేర నరిగె నత్యంతధృతిన్. 7

ఉ. అయ్యెడ రేవుబోయలఁ బ్రియంబు మెయిం బిలిపించి దేవికిం
జయ్యన నోడ వెట్టు మని శాంతతఁ బిల్చి సుమంత్రుఁ జూచి నీ
వియ్యెడ నున్న తే రనుచు నింతిని డించినఁ బోతపాత్రపై
నొయ్యన పోవఁ దాను కని యుత్తరణక్రియ నిర్వహించినన్. 8

ఉ. సంతస మందు చున్న రఘుసత్తముదేవికి లోకవాదవృ
త్తాంతము నన్న దర్ బిలిచి యన్న తెలుంగును దత్తపోవనో
పాంతము గావునం దెలియఁబల్కఁ దలంచుచు నల్లఁ జేరి య
త్యంతవిషాది యై రఘువరానుజుఁ డాత్మ చలించు చుండఁగన్. 9

శా. నా కింకర్ మరణంబ కార్య మిటు లన్యాయప్రవృత్తాత్ముఁ డై
కాకుత్స్థాన్వయదీపకుండు నను లోకత్యాజ్యుఁ గావించె నం
చాకాంతాతిలకంబుపాదముల పర్యంతంబుగాఁ బుణ్యగ
ణ్యాకారుం డిలఁ జాఁగి మ్రొక్కిన మనం బాకంపముం బొందఁగాన్. 10

ఉ. కారణ మేమి నన్ను దశకంఠకులాంతకుఁ డెగ్గు వల్కెనో
నేరమి గల్గెనో యకట నిక్కము నా కెఱిఁగింపు మిట్టిదు
ర్వారమనోవ్యథం బొరయువాఁడవు గావు వివేకవిశ్రుతా
చారుఁడ వైననీ వని విశాలవిలోచన గారవించినన్. 11

ఉ. ఇత్తెఱఁ గాచరించుటకు నే నిది యేటికి నియ్య కొంటి నీ
యుత్తమురాలి నోఁ బలుక నోపఁగ వచ్చునె యంచు వెండియుం
జిత్తము గూడఁ దెచ్చుకొని చెప్పక పో దని నిర్ణయించి డ
గ్గుత్తిక వెట్టి లక్ష్మణుఁడు కోమలిఁ జూచుచు నశ్రు లొల్కఁగాన్. 12

రాముఁడు లోకాపవాదభీతుఁ డై విడనాడినవృత్తాంతము సీతకు లక్ష్మణుఁ డెఱిఁగించుట.

శా. ఏ నిం కేమని చెప్పుదుర్ రఘుకులాధీశుర్ జగం బెల్ల నీ
కై నిందింపఁగఁ జాల నొచ్చి యది మిథ్యావాద మైనర్ సమా
ధానం బేర్పడఁ జేయ కున్న నిజవృత్తం బెంతయుర్ దూషితం
బై నీచత్వము రాక తక్కదని యూహాపోహసంవేది యై. 13

క. పురజనపలభూజనంబుల, పరివారం బొందుభంగి బాయమి జీవ
స్మరణం బగుచున్న భవ,ద్విరహంబున కియ్య కొనియె విభుఁ డధికధృతిన్. 14

ఉ. ఏకత ముండి నర్ బిలిచి యేర్పడ నింత యుఁ జెప్పి తేరిపై
వే కొనిపోయి నీవు పృథివీసుత కోరినయట్ల కాఁగ వా
ల్మీకులయాశ్రమంబునసమీపమునర్ మనకృత్యనిశ్చయం
బాకమలాక్షికిం దెలుపు మన్న నృపాలకు నాజ్ఞ నేసితిన్. 15

క. ఆశ్రమ మల్లదె మునిచర, ణాశ్రయవు నిరస్తశోకవై యుండు జగ
ద్విశ్రుతి యగు నీపతియును, నాశ్రమనిరహితుఁడ యింక నని పల్కుటయున్.

సీత తన్ను భర్త విడనాడినందులకై చింతించి లక్ష్మణునితో నయనిష్ఠురంబు లాడుట.

క. తాలిమికోలఁదుఁ బోవని, వాలాయపుదిగులు గుండె వ్రయ్యఁ గదిరినం
గీ లెడపినజంత్రముక్రియ, నేలపయిం బడియె మేదినీతనయ వెసన్. 17

క. పడి మూర్ఛిల్లి మగుడ నొక,వడికిం దెలివొంది బాష్ప।వారి గనుఁగవం
గడలుకొను చుండ వాతెఱఁ, దడుపుచు వెలవెల్ల నగుచుఁ । దల్లడపడుచున్.

క. పలు కుడిగి పెద్దప్రొద్దా,కులదృష్టి మఱందిఁ జూచుఁ । గొండొక నవ్వుం
దలయూఁచు ముక్కుపై నం,గుళమిడు వెఱఁగందు వగల।కుం గొలువిచ్చున్. 19

ఆ. సందియంబువడ వి।చారంబునకుఁ జొర,మాఱు వలుక నొందు । మాడ్కి సేయ
వెరవు గాక పిడుగు । వ్రేసినయ ట్లైన, మాట కియ్య।కొనుచు । బోటిపలుకు. 20

క. అగుఁ గాక యట్లు చేసెద, జగతీపతిపనుపు సేసి । చను నీవును నీ
తెగువ రఘుపతికి నీకుం, దగ వఁట యే ననెడి దేమి । తమ్ముఁడ చెపుమా. 21

సీ. అఖిలధర్మస్థితి । నపచారి యందునే యావనంబునఁ దప । మాచరించెఁ
గరుణాసముద్రుఁడుఁ । గాఁడందునే యట్టి యపరాధిఁ గృతకవా।యసముఁ గాచె
నాశ్రితరక్షమై । నర్థి లేఁ డందునే పగతుతమ్ముని రాజ్య।పదవి నిల్పెఁ
బాటించి నన్ను సం।భావింపఁ డందునే నాకుఁ గా నెన్ని యత్నములో చేసెఁ

తే. బతి జనించినకొలెను । బరహితైక,లోలమతి యొడల్ సిదిమినఁ । బొలు వచ్చు
నాతఁ డిది కార్య మని నిశ్చ।యంబుచేత, నాయభాగ్యంబ యొండొక।వేయునేల.

క. ఇడుమలు గుడువఁగ బుట్టిన,యొడ లిది యిటు లొప్పుఁ గాక । యొడ్డులు నాచేఁ
బడిరి తొలుభవమునం ది,ప్పుడు తత్ఫల మంద కున్నఁ । బోవునె నాకున్. 23

ఉ. ఉల్లము పొక్కనెవ్వగల।కోటఱి యే మరణంబు గోరినం
జెల్ల దె జాహ్నవీసలిల।సేచన మూర్ధ్వగతిప్రదంబు సం
ఫుల్లయశోభిరామ మగు।భూపతివంశము నిల్చునంతలో
నొల్ల దురంతదుఃఖముల । కోర్చుట మేలు దలంచి చూడఁగన్. 24

చ. అతులితపుణ్యమూర్తు లగు।నత్తల కెల్లను నేసు భక్తి మ్రొ
క్కితి నెఱిఁగింపు సూర్యకుల।కేతువు నా విలసిల్లు రాముసం
తతి భరియించి యున్న యది । దానికి శోభన మంచుఁ గచ్ఛప
స్థితి నయినం దలంపురయ।సేయుఁడు మీ రని యప్పగింపుమీ. 25

క. జనపతికి నింక నే నే, మని చెప్పిన నేమి యగును । నది గడచనె నై
నను నూసువోక వెండియు, ననియెద నొకమాట రఘువ।రానుజ నీతోన్. 26

చ. తనమది నొక్కయుమ్మలిక । దక్కిన మంచిది దానిఁ బాపఁగా
నని తలపోసి చేయుపని । కక్కట యేచును లోను గానె నా
కు నెఱుఁగఁ జెప్పి పొమ్మనుట।కుం దగనే మొగమాట లేక మ
న్ననయెడ నైన రాజుల మ।నంబులు ద్రిప్పఁగ బల్మి గల్గునే. 27

క. కానిమ్ము నాకుఁ జెప్పినఁ, గానియ కా దధిపుపనుపు । గడ తేర్పఁగ నేఁ
బూనినపని యిది నీవును, బూని యొనర్పు టది యొల్లఁ । బొచ్చెమె చెపుమా.

తే. పతియ చుట్టంబుఁ బక్కంబుఁ । బతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండ్రియుఁ । బతియ గురుఁడు
పతియ దైవంబుఁ గావున । నతనిఁ బా
సర్చుటయ కాదె ధర్మంబు । నాతి కరయ. 29

ఉ. మేనికి నంతవంతఁ బడ । మిక్కిలి కాఱియఁ బెట్టి నొంపఁగాఁ
బూనితి నోర్వ కున్న నది । వోవునె యట్లు జగంబువారలున్
మానము లేక యీ తులువ।మాటల నాదెస నాడ దుస్సహం
బైనది దీని మానుపు ను।పాయము చొప్పడ దేమి సేయుదున్. 30

మ. అను చుండన్ మఱుమాట వల్కక సము।ద్యద్బాష్పుఁడై లక్ష్మణుం
డినవంశాగ్రణిదేవిపాదయుగళం । బీక్షించి ధాత్రీతలం
బును ఫాలంబునఁ బొంద మ్రొక్కి వినయం।బుం దీవ్రశోకంబు నె
మ్మనముం జుట్టుకొనం బ్రదక్షిణముగా । మందప్రచారంబునన్. 31

క. వడి నంటఁ దాఁకుబలితపు,టడలున రూపఱినమనము।నం దొరిమి పాఁ
తెడలి వెసఁ బురికిఁ బోఁ దెగు, వడరిన వావిడిచి దిక్కు । లద్రువ నఱచుచున్.

లక్ష్మణుఁడు సీతను గంగ దాఁటించి పురమునకు మరలుట.

చ. అరిగి మరుత్తరంగిణి ను।పాంతము డాయుచు రోదనంబుతో
బెరయఁ గిరాతు నేనమతిఁ । బిల్చి తదాహితయానపాత్ర మా
తురగతి నెక్కి యద్దరికి । ధూతకళంకుఁడు వోయె మేదినిం
బొరలుచు నోడవి క్కరయు । భూతనయం బలుమాఱుఁ జూచుచున్. 33

క. చని యరద మెక్కి యల్లల్లన పోవుచు నిలిచి నిలిచి । లక్ష్మణుఁ డయ్యం
గనఁ బొరిఁ బొరి మరలి కనుం,గొనుచుండఁగఁ గోమలియును।గొందలపడుచున్.

సీ. ము న్నా తెఱంగున । నున్నట్టియే నిప్పు డిమ్మెయి వనమున । కెట్లు వోదు
నిఁక యేమి యొంటిమై । నే తెంచి తనిన నెప్పాట నే మఱుమాట । వలుక నేర్తు
నెవ్వారితోడ నే । నే మని యీదురవస్థ మాటికిఁ జెప్పి । వనరుదానఁ
బతి యిల్లు వాపిన । కతము న న్నడిగిన నేను ద ప్పేదిగా । నేర్పరింతు
ఆ. మునిసతీజనంబు । ముందటఁ గొంకక, యెవ్విధమున మెలఁగి । యిచట నిలిచి
కాల మెట్టిభంగిఁ । గడపుదు నేనని, యడలి యేడ్చుచున్న । యవసరమున. 35

వాల్మీకి సీతవృత్తాంతము మునిపుత్త్రులవలన విని వచ్చి తనయాశ్రమమునకుఁ దోడ్కొనిపోవుట.

క. మునిపుత్త్రకు లేటికిఁ జని, చని యయ్యెలుఁగునకుఁ జేరి । చంద్రాస్యఁ గనుం
గొని యటఁ బోవక యరిగిరి, మనములఁ గృప గదుర నాశ్రమమునకు మరలన్.

ఆ. సరభసముగ నేగి । సంయమిచరణార,విందములకు నధిక।వినయ మెసఁగ
మ్రొక్కి మోడ్పుఁగేలు । ముందట నిగిడించి, యిష్ట మెఱుఁగ నతని । కిట్టు లనిరి.

మ. ఒకనారీతిలకంబు గాననములో నుద్దామశోకార్తయై
వికలాలోకన మశ్రుధారలును బృథ్వీరేణులిప్తాంగముం
బ్రకటాక్రందనముల్ వికీర్ణకబరీభారంబు వక్త్రాబ్జశో
షకనిశ్వాసగమోష్ణముం గలయవస్థం బొందఁగా నయ్యెడన్. 38

తే. అరిగి యరిగి కనుంగొని యటఁ జనంగఁ, గాళ్లు లాడక మీఁ గెలుఁగంగఁ జెప్పఁ
బాలు తెంచితి మేమహాభాగుసతియొ, నిరుపమోదాత్తమూర్తి యన్నీరజాక్షి.

చ. అనవుడు నమ్మునిప్రవరుఁ డారఘువంశవరేణ్యుదేవిఁ గాఁ
దనమహనీయబుద్ధిఁ గని ధర్మవిధిన్ మహితార్ఘ్యపాత్రఁ జే
కొని రభసంబునం జనియె ఘోరదశాపరిపాకతప్తచే
తన యగుచున్ మహిం బొరలు తామరసానన యున్నచోటికిన్. 40

మ. చని సంతర్పణవాక్యపూర్వముగ నాశ్వాసంబు గావించినన్
వనితారత్నము భక్తి నమ్మునిపదద్వంద్వంబునం దశ్రులం
గొని పాద్యం బొనరించె నాతఁడు మనఃక్షోభంబు సంధిల్ల ని
ట్లనియెన్ గద్గదికానిరుద్ధవచనుం డై యాసరోజాక్షికిన్. 41

క. జనకుఁడు తండ్రియు దశరథజననాథుఁడు మామ యఁట విశాలయశశ్శ్రీ
ధనుఁ డగురాముఁడు పతి యఁట, వనితలతో నిన్ను నెన్నవచ్చునె సాధ్వీ 42

క. నీవచ్చిన తెఱఁ గెఱుఁగను, భావించి యెఱింగి నీదుపావనచరితం
బీవెడమాటల నాఱడి, పోవుట కత్యంత చింతఁ బొందితి నబలా. 43

తే. లోకముల నెద్ది యేనియు నాకు నెఱుఁగ, రానియట్టిది లేదు నిర్మలత నొప్పు
నీదుచరితంబు తెల్లంబు గాదె రామ, నేరమి నచూవె యింతయు నిక్కమరయ.

చ. ఇదె మనయాశ్రమం బిచట నీవు వసింపు తపస్వినుల్ ప్రియం
బొదవఁగ నీకు నెల్లపనియుం బరమాదరవృత్తి నాచరిం
చెద రిదె నీగృహంబునకుఁ జేరితి గావున నీదుగర్భ మ
భ్యుదయముఁ బొందు దుర్యశము వోవుఁ బదంపడి నమ్ము మెమ్మెయిన్. 45

క. కైకొను మర్చన మనవుడు, నాకోమలి దెలిసి యర్ఘ్య మందుకొనియె సు
శ్లోకుఁ డగునమ్మునీశ్వరు, సాకతమున శోకవహ్నిశాంతతఁ బొందన్. 46

తే. ఇత్తెఱంగున నూరార్చి యింతిఁ దఱిమి, యల్లనల్లన తోకొని యాశ్రమమున
కరుగుదేరంగ నమ్మునీశ్వరున కర్థి, నెదురువోయి తపస్విను లెఱఁగుటయును 47

చ. జనకునికూఁతు రార్యగుణశాలిని రామునిదేవి సీత యా
తనికొఱగామి నియ్యెడకుఁ దాపసవృత్తిఁ జరింప వచ్చె ని
వ్వనితకు నెల్లకృత్యము దివానిశముం బరికించి బాంధవం
బు నెఱయఁ జేయుఁడీ యని తపోధనసత్తముఁ డప్పగించినన్. 48

ఆ. ఆతపస్వినులు ప్రక్రియంబున జానకిఁ, బొదివి యాత్మవాసభూమి కర్థి
తోడ గారవించి తోకొని పోయిరి, మునియు నిజనివాసమునకుఁ జనియె. 49

క. మునినాథుఁ డింతిఁ దోకొని, తనయాశ్రమమునకు నేఁగు తడ వంతయుఁ దా
నును నిలిచి యాసుమిత్రాతనయుఁడు గనుఁగొనియె నశ్రుధారలు గవియన్.

{ పట్టణమునకుఁ బోవుచు సుమంత్రుఁడు లక్ష్మణునకు దుఃఖోపశమంబుగాఁ దొల్లిటికథ యెఱింగించుట. }

ఆ. ఇవ్విధమున రాఘవేశ్వరుదేవి న,య్యడవిఁ ద్రోచి మరలి యరిగి యరిగి
యడలు గదిరి యిట్టులనియె సుమంత్రుతో, నతఁడు మొగము దీనముగుచునుండ.

క. మనయింటిచేటు సూచితె, మనుకులసత్తముఁడు తొఱఁగె మైథిలిని భూ
జనవాదంబు మహాత్ముల, యనఘచరిత్రమునకంటు నధికం బగుటన్. 52

సీ. అభిషేకదినమున నడవికిఁ దపమున కరుగుము నీ వన్న నట్ల చనియె
నందును నతిశాంతుఁ డై యుండఁగాఁ దన కోమలి నతిమురిఁ గోలుపోయె
నమ్ముగ్ధ మగుడఁ దే నని చన్న చోట న నేకవిధం బగు నిడుమఁ బడియెఁ
దెచ్చియుఁ బ్రీతి లో నొచ్చి యొడంబడి మనపుణ్య మేది యిమ్మాడ్కిఁ జేసె
తే. నకట పుట్టినకోలెను నంతకంత, కగ్గలించినదుఃఖంబు ననుభవించు
చున్నవాఁ డన్న యే మని యుగ్గడింతు, నీమనోగ్లాని తెగుదలయెద్ది చెపుమ.

చ. అనిన సుమంత్రుఁ డి ట్లనియె నాతనిపుట్టిననాఁడ వచ్చి త
జ్జనకునితోడ భూమిసురసత్తము లెల్ల ననేకదుఃఖభా
జన మగు నల్పసౌఖ్యుఁ డగు శౌర్యము ధైర్యము దానశక్తియుఁ
వినయముఁ గల్గువాఁ డగుననింద్యుఁడు వీఁ డన వింటి నేర్పడన్. 54

ఆ. పితృవియోగజనితపీడయు ననుజవి,యోగజనితపీడయును సతీవి
యోగజనితపీడయును బొందు వీని న,నంగ వింటి నేను నరవరేణ్య. 55

క. కావున విధికృత్యము లగు, నీవృత్తాంతముల కింత యేటికి వగవం
జావును జేటును మనుజుల,కావిర్భావంబుతోన యైనవి గావే. 56

క. మఱియు నొకమాట యెవ్వరు, నెఱుఁగనియది దశరథునకు నేకాంతమునం
దఱపులు లేక దృఢంబుగ, నెఱుకపడం జెప్ప వింటి నే నొకరుండన్. 57

క. అది రాముఁడు భరతుండును, మొదలుగ నెవ్వరును వినరు మున్నైనను నీ
హృదయంబుకలఁక యుడుపఁగ, మదిఁ గోరుటఁ జెప్ప వలసె మనువంశనిధీ. 58

సీ. సర్వజ్ఞుఁ డనఁదగు దుర్వాసుఁ డనుమునీశ్వరుఁడు వసిష్ఠునాశ్రమమునందు
సాంవత్సరిక మైనసత్త్రంబు నడపంగ ధర్మప్రియుం డగుదశరథుండు
వేడుక జన్నంబుఁ జూడఁ బోయి మునిప్రవరు లిద్దఱకు నభివందనంబు
నేసి రహస్యగోష్ఠీవినోదంబునఁ దత్పరు లగువారుఁ దాను నచట

తే. నున్న యెడభూవరుఁడు దనకన్న ప్రజల, యాయురైశ్వర్యములుఁ దదనంతరంబ
హరిసంతతి తెలుఁగు దుర్వాసు నడుగ, నమ్మహీపతితోడ ని ట్లనియె నతఁడు.

క. నీకొడుకు లధికబలభ,ద్రాకృతులఁ బ్రవృద్ధిఁ బొంది యాయుశ్శ్రీల
స్తోకంబులు గాఁ బుణ్య,శ్లోకత నేలుదురు మధ్యలోకం బెల్లన్. 60

ఆ. వెలయఁ బదునొకండువేలవత్సరములు, రాజ్యమహిమఁ బొంది రామభద్రుఁ
డనుపమానకీర్తి యార్జించి పదపడి, బ్రహ్మలోకసుఖము బడయువాఁడు. 61

తే. అన్న రాజ్యంబు సేయంగ ననుజు లెల్ల, పనులు నడపుచు నీతియు బాహుబలము
మెఱయ వర్తిల్లి యతఁ డేగు తెఱియ తమకు, నవసరంబుగ సద్గతిఁ గరుగువారు.

క. చతురమతి రామునకు భూ,సుతయందు దయంబు నొంది సుతు లిరువురు వి
శ్రుతు లగుదు రందుఁ బూర్వజుఁ,డతులితసామ్రాజ్యమునకు నభిషిక్తుఁ డగున్.

క. భరతాదు లయినమువ్వురు, నిరువుర నిరువురఁ ద్రిలోకహితపూజ్యులఁ ద
త్పరులం బడయుదు రయ్యా,ర్గురు నొక్కొకభూమిపతు లగుదు రుజ్జ్వలులై.

క. అనియెం గావున రాముఁడు, జనకతనూజయు న సౌఖ్యచరితులు మనకుం
వనటకు నించుక యేనియుఁ, బని గా దనవుడును హృదయపద్మం బలరన్. 65

క. అలఘురఘువంశమునకుం, దల మాటించుకయు లేమి తథ్యముగా నీ
వలన సమస్తంబును నేఁ, దెలిసితి నామనము కలఁక దీఱె మహాత్మా. 66

క. అని సౌమిత్రి సుమంత్రుని, ఘనపరిరంభణము సేసి గౌరవమున నా
తనితో సంభాషించుచుఁ, జన నొకపుణ్యాశ్రమంబు చక్కటి యైనన్. 67

ఆ. అచటి కరిగి మునికృతాధికపూజనం,బులఁ బథిశ్రమంబు పుచ్చి నాఁటి
రాత్రి యచటఁ గడపి రామానుజుఁడు జన,శ్లాఘ్యమూర్తి యగుచుఁ జనియెఁ బురికి.

లక్ష్మణుఁడు పట్టణమునకుఁ బోయి యన్నతో సీత నడవిని విడిచి వచ్చితి నని చెప్పుట.

చ. నగరిసమీప మైన నరనాథునిసన్నిధి కోహటించి నె
మ్మొగము వివర్ణతం బొరయ మోసల నల్లన తేరు డిగ్గి నె
వ్వగ దలకొన్న బ్రేఁ గడరి వ్రాలుగతిం దలవాంచి యేగె సౌ
మ్యగుణవిభాసి లక్ష్మణకుమారకుఁ డానృపుఁ డున్న చోటికిన్. 69

మ. చని దీనాననుఁ డైనయజ్జనపతిం జక్కంగఁ దాఁ జూడ నో
పనివాఁ డయ్యును ధైర్య మూఁది విగళద్బాష్పాంబు లంతంత లో
నన యింకించుచుఁ దొట్రుపాటు చరణన్యాసంబులం జేర నీ
నినడం జేరి వినమ్రుఁ డయ్యెఁ బతిక న్నీ రాఁకకుం మీఱఁగాన్. 70

క. నేత్రములు దుడిచికొంచు సు,మిత్రాసుతుఁ డెఱుకరమున మెల్లన యెత్తెం
ధాత్రీవిభుఁడు విషాదా,మాత్రహృదయుఁ డయ్యుఁ దా సమాహితుఁడగుచున్.

చ. అతఁ డుపవిష్టుఁడై రఘుకులాగ్రణి కిట్లను దేవ దేవి నర్చితిని భవన్నిరూపితవిశిష్టతపోవనభూమికిం దగ
స్నతి మునియాజ్ఞ నాశ్రమముల నర్థి వసియించె జరత్తపస్వినీ
యుతనవపర్ణశాల నఖిలోపనతార్ఘ్య సగౌరవంబుగన్. 72

క. అని తననిర్వర్తించిన, పని విజ్ఞాపనము సేసి పతితో నతఁ డి
ట్లను మతియుఁ దన్మనోవ్యధ, నను మాన్పుతలంపునను హితము సత్యము గాన్. 73

లక్ష్మణుఁడు రాముని దుఃఖోపశమంబు సేయుట.

ఉ. ఇట్టివి దైవచేష్టితము లెవ్వరికిం గడవంగరాదు మీ
యట్టిమహాత్ము లుమ్మలిక లందినచో ధృతి గట్టి చేసి లో
గిట్టక యుండ గీడ్పఱచి కెల్వక తక్కిన నిర్వహించు పెం
పెట్టొకొ బుద్ధిమంతులకు నెక్కుడుభంగిఁ దలంచి చూడఁగన్. 74

క. పెరుఁగుట ప్రగ్గఁ జవులం, బొరయుట యవశంబు గాఁగ బుట్టుట చావర్
బెరయుట పాయఁ బదార్థో,త్కరముల నైజ మిది యెట్లు దప్పింప నగున్. 75

ఉ. కావున దారపుత్త్రసఖకామదముం బితృమాతృసోదరా
శావలనంబు గాఢముగ సల్పుదురే మిము బోఁటు లైనసం
భావితు లట్లు గాక నిరపాయము లై కడచన్నవానికిం
బోవునె పెద్దవారితలఁపుల్ మును వేడుక యెంత కల్గినన్. 76

మ. జనవాదంబునకుం బ్రియం దొఱఁగ నుత్సాహంబు సేయంగ వ
చ్చునె యి ట్లెవ్వరి కివ్విధంబు దలఁపం జోద్యంబు గాదే క్రమం
బున నిష్కల్మషవృత్తముల్ దెలియ నోపుర్ లోక మెబ్బంగి నీ
మనువంశంబు భవద్గుణంబుల జగన్మాన్యత్వముం బొందెడున్. 77

శా. తాపంబుం బెడఁబాపి దుర్దమవిషాదంబుం దిగం ద్రావి ని
ర్వ్యాపారత్వముఁ బోవఁ ద్రోచి వగ లుచ్ఛ్వాసించి వెల్వెల్లఁబా
టూపాంతర్ మెలఁగంగ నీకి మదిన దెల్లం దెగం బుచ్చఁగా
నీపెం పార్యజనంబు మెచ్చు ధృతి కుశ్లేషంబు గావింపవే. 78

క. అనవుడుఁ దమ్మునిమాటలు, విని సంభావించి యావివేకవచనముల్
సను నీకు నిట్లు సెప్పఁగ, నని విభుఁ డుల్లంబు కలఁక యంతయుఁ దీఱన్. 79

రాముఁడు దుఃఖము సడఁచుకొని ప్రజలం బాలించుట.

క. నీ పంచినట్ల చేసెద, భూపతులకు ననవధానమునఁ బుట్టు ననే
కాపదలు వినుము తొంటిమ,హాపురుషుల నని వినీతుఁ డగునాతనితోన్. 80

క. నృగుఁ డనఁగ నిమి యనం జను, జగతీపతు లనవధానజాడ్యంబున నిం
దగతిం బొందినతెఱఁ గా, సగరకులోద్వహుఁడు సెప్పెఁ జతురత మెఱయన్.

తే. ఇట్లు సల్లాప మొనరించి యెల్లపనులు, ననుదినంబును దలఁపింపు మఖిలజనులు
సంతసం బందునట్లుగాఁ జక్కఁబెట్టు, మని నియోగించి యతనిఁ బోఁ బనిచివిభుఁడు.

ఉ. అచ్చటు వాసి యల్లఁ జని యాహ్నికవర్తన మాచరించి రా
లచ్చి వికాస మందఁగ నలంకృతుఁడై మునిమాపు దర్శనం
బిచ్చిన మంత్రిభృత్యసుకవీశ్వరు లాదిగ నెల్లవారలుఁ
వచ్చి మహీశుఁ గొల్చి రనివారణఁ జిత్తము లంకురింపఁగన్. 83

ఆ. విభుఁడు నిఖిలజనుల విన్నపంబులు విను, వివిధసైన్యములకు సవరణముల
ననువుసేయు నభిమతార్థంబు లర్థుల, కిచ్చు వేఁట లాడు నిచ్చవెలయ. 84

క. ఇవ్విధమున నిత్యంబును, నవ్వసుధాధిపుఁడు ప్రజల ననురాగలతల్
నివ్వటిలఁ జేయుఁ దనమది, నొవ్వెఱఁగక యుండ బహువినోదపరుండై. 85

రాముఁ డేకాంతంబున సీతం దలంచి చింతిల్లుట.

క. మనమునఁ బాయని ధరణీతనయావలనివగల నేకతంబ పొగిలి య
మ్మనువంశదీపకుం డిట్లను ధైర్యము పల్లటిల్లి యలుగులపడుచున్. 86

సీ. నీకటా యకట పినాకిబాణాసనం బద్భుతంబుగ సభ నట్లు సేసి
జనకానుమతిఁ దపంబునకు నక్కట నీవు ననుగమనంబు సేయంగ నరిగి
పానియు మగుడ నిన్ బడయుదు ననునాస నక్కట ప్రాణంబు చిక్కఁబట్టి
యక్కడ సేతుబంధాద్యుపాయముల నానందనం బయిన నీ పొందు గాంచి
తే. యింపొసంగు నీయర్మిలి యెల్ల నమ్ము, గాఁగఁ దుది పోయి నిన్నిట్లు గానపాలు
సేసి యాఱడిఁ బుచ్చితిఁ జెప్పఁ జిట్టు, లయ్యొ నామను వే మనసంబుజాక్షి. 87

ఉ. అచ్చట లోకమంతయును నక్కటికంబున నుమ్మలింప నీ
చిచ్చు చొరంగఁ బోక మది చిక్కఁదనంబున నియ్యకొన్న నా
కిచ్చటఁ దెచ్చి నిన్ విడుచు టెంతటిపెద్ద జఘన్యవృత్తి కే
నచ్చట వచ్చు కెక్కుటకు నాఱడిపోకకు నోర్తు మైథిలీ. 88

ఆ. అని దురంతశోకమునఁ బొంది సెజ్జపై, మేను వైచి కన్నుఁగోనలందు
నిపుడు నశ్రువారి చెవులకొలంకుల, నిండ నిట్టు లను విభుండు మఱియు. 89

ఉ. వీట దురాత్ము లైనయవివేకులు గొంద ఱనింద్య మైనయ
జ్జోటిచరిత్ర మంగనల చొప్పుగ సంశయ మంది యాడు పె
న్మాటల కేల యీదురభిమానము పూనితి వాని నేల నే
గీటునఁ బుచ్చ నైతిఁ బరికింపక చేసితి నింతిఁ బాసితిన్. 90

ఉ. లోకమువారి మెచ్చునకు లోలవిలోచనఁ బాఱవైచితిం
బో కొఱగామి యంతటన పోయెనె దీనికి నింకఁ గొంద ఱో
హో కృప మాలి చేసె నిది యెప్పుడు పొ మ్మని దుర్నిరీతి గాఁ
క్షైకొని రేని వారిమది కందున కెయ్యది గందు దైవమా. 91

క. అని వందుచు నంగనదెస, వనటకు సామ్రాజ్యవివిధవర్తనమునకుం
దనచిత్తము పొక్కఁగ న,మ్మనుజేంద్రుఁ డుదాత్తవృత్తిమహి యేలునెడన్. 92

రాముఁడు మునుల మొఱ విని శత్రుఘ్నుని లవణుం జంపఁ బంపుట.

మ. వివిధాన్యాయపరాయణుండు రిపుదోర్వీర్యానివార్యుండు నా
హవసంక్రీడనలోలబుద్ధియు మహాహంకారుఁడుం గావునన్
లవణుం డడ్డము లేక దానవకులశ్లాఘ్యస్థితిన్ మేదినీ
దివిజవ్రాతము నెల్ల నాతురతఁ బొందించున్ సమిద్ధాత్ముఁడై. 93

ఉ. దానికి రోసి సంయమికదంబక మారఘువంశసత్తముం
గానఁగ వచ్చి సంతతమఖప్రతిఘాతముఁ బ్రాణిహింసయున్
లో నగుచున్నవాని యతిలోకదురాచరణంబు లన్నియున్
దీనత దోఁపఁ జెప్పిన మహీశుం గృప కోపముతోఁ బెనంగఁగన్. 94

ఉ. తమ్ములదిక్కు గన్గొనుచు దైత్యులపీఁచ మడంగ దయ్యెడుం
గ్రమ్మఱఁ దోఁచె వీఁ డొకఁడు గాసిగ విప్రుల నేఁప కుండ శీ
ఘ్రమ్ముగ నేగి యద్దనుజుఁ గాలునిప్రోలికి నంపి రాకకుం
గ్రమ్మన నొక్కఁ డియ్యకొనఁగా వలయున్ మనలోన నావుడున్. 95

క. భరతుండు లక్ష్మణుండును, బరవసమునఁ బలుకుచుండఁ బతికట్టెదురం
గరములు మోడ్చి వినయసుం,దరుఁ డగుశత్రుఘ్నుఁ డత్యుదాత్తవచనుఁడై.

క. వీరల కెదురఁగఁ జాలెడి, వా రచ్చో నెవ్వ రాలవణు మాత్రకు దు
ర్వారభవదాజ్ఞ నేఁ జని, వైరం బనుపేరు మాన్చి వచ్చెద ననుడున్. 97

క. అగుఁ గాక యితఁడు వోవుట, తగు నని పెఱవారి నుడిపి ధరణీవిభుఁ డొ
ప్పుగ లవణువీడు మధురకుఁ, దగఁ బట్టము గట్టెఁ జిన్నతమ్మునిఁ బ్రీతిన్. 98

ఉ. మంత్రసమేతమై భువనమాన్యత నొప్పనమోఘబాణ మా
మంత్రితుఁ జేసి యాతనికి మన్ననరెట్టిగ నిచ్చి వేడ్కమై
మంత్రుల భృత్యులన్ బుధసమాజము వైశ్యుల వారిజాక్షులం
దంత్రము రాజ్యచిహ్నముల ద్రవ్యసమూహము నిచ్చెఁ బెంపుతోన్. 99

శత్రుఘ్నుఁడు లవణుపై నెత్తిపోవుట.

ఆ. ఇట్టు లొసఁగి మునుల నెల్లను జూపి వీ, రెట్లు చెప్పి రట్ల యెల్లపనులుఁ
జేసి విజయలక్ష్మిఁ జేకొని రమ్మని, యధిపుఁ డనిచి పుచ్చ నతఁడు వోయి.

క. సురనదితీరంబునఁ గడుఁ, బర పగుతనదండు విడియఁ బనుచుచు భరతా
వరజుఁడు వాల్మీకిమునీ,శ్వరునాశ్రమమునకు నరిగి సద్భక్తిమెయిన్. 101

ఉ. ఆమ్మునిపాదపద్మముల కానతుఁడై యతఁ డిచ్చుపావనా
ర్ఘ్యమ్ము వినీతవృత్తిఁ దగఁ గైకొని మూలఫలాదివన్యభ

ఖ్యమ్ములఁ దుష్టి వొంది సరసప్రియభాషలఁ బ్రొద్దు పుచ్చి యం
దిమ్ముల నాఁటిరే నిలిచి యిచ్చ నిజాగ్రజులం దలంచుచున్. 103

క. ఆరాత్రియు రఘుకులనిస్తారకు లగుసుతులఁ దరుణతరణిప్రతిమా
కారులఁ గాంచె ధరాసుత, వారిజలోచనులఁ గవలవారలఁ బ్రీతిన్. 104

క. మునిజనపత్నులు శీఘ్రమ్మున నపుడే యరిగి యత్తపోనిధి కెఱిఁగిం
చిన నతఁడు సత్వరుం డయి, చని బాలురఁ జూచి పరమసంతోషమునన్. 105

క. విశదపరిమార్జనమునకుఁ, గుశయును లవనంబు నిచ్చి కులపతి ప్రీతిం
గుశలవు లనునామము లస,దృశముగ నిడి వారలను బ్రదీప్తులఁ జేసెన్. 106

ఆ. అట్టియవసరమున సమ్మునిపల్లెలోఁ, జరఁగు నుత్సవంబు పలుకు లెల్ల
మనము పల్లవింప వినుచు శత్రుఘ్నుఁ డం,గములఁ బులకసమితి గరముదాల్చె.

ఆశ్వాసాంతము.

మ. రమణీయాంగుఁ డభంగుఁ డుజ్జ్వలకృపాసారాధ్యుం డసాధ్యుండు దు
ర్ధమసంరంభుఁ డదంభుఁ డార్యవినుతోదార్యుం డవార్యుండు ధ
ర్మమయస్వాంతుఁడు దాంతుఁ డర్జితరమామాన్యుం డదైన్యుండు హ
వ్యశనాతాలాపుఁ డపాపుఁ డంచితకృపాయత్తుం డుదాత్తుం డిలన్. 108

క. ఉభయబలవీరుఁ డభిమత, విభవసుప్రభుఁడు దర్పవిశ్రుతరిపుభూ
పభయంకరసౌమ్యాకృతి, శుభచరితుండు సుభగతాభిశోభితుఁ డెలమిన్. 109

మాలిని. అనఘుఁ డమితసత్త్వుం డన్యభూభృత్కృతాంతుం
డనుపమధృతిసారుం డర్కతేజుం డజేయుం
డనితరసమపుణ్యుం డర్థిమిత్త్రుం డమేయుం
డనుకృతఫణిహారుం డన్వయోదారుఁ డుర్విన్. 110

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిధేయ
తిక్కననామధేయప్రణీతం బైనయుత్తరరామాయణం బనుమహాకావ్యంబు
నందు నవమాశ్వాసము.

శ్రీరస్తు.

# నిర్వచనోత్తరరామాయణము

## దశమాశ్వాసము.


సంపాదికటాక్షవి
లాసుఁడు బాహావధానలంపటుఁడు గళా
వాసమతి దేవజనర
క్షాసక్తుఁడు మనుమసిద్ధిజగతీశుఁ డొగిన్. 1

క. రేపకడ నక్కుమారుఁడు, దాపసవగు వీడుకొని ముఖంబున విప్ర
జ్ఞాపితపథమునఁ దత్పల్లాపరసాయత్తుఁడై బలంబును దానున్. 2

మునులు శత్రుఘ్నునకు లవణుని వధించునుపాయం బెఱిఁగించుట.

చ. చని చని విప్రు లక్కె లవణుజన్మము వానిభుజాబలంబు వాఁ
డనికిఁ గడంగుచందమును నద్దనుజాధముమర్మముం గ్రమం
బున నడుగంగ వారు మధుపుత్త్రుఁడు వాఁడు మహాబలాఢ్యుఁ డె
వ్వనికి రణంబునం జెనయ వచ్చునె యాతని నంచు వెండియున్. 3

ఆ. అద్దురాత్మజనకుఁ డగుమధు వెంతయు, నరిదితపము సేయ హరుఁడు మెచ్చి
యొక్కనిశితశూల మొసఁగి యద్దానవు, హృదయకమల మలర నిట్టు లనియె.

క. ఇది యొకవాటున నని నీ, కెదిరినవీరునిఁ గృతాంతునేనియు నాఁ డా
మదనునిఁ గోపించిననా, నుదుటికనుసలశిఖగతిం దనుపుపొడ వడఁచున్. 5

క. క్రమ్మఱ నప్పుడ నీహస్తమ్మున కేతెంచు నల్పశత్రునిపైఁ గో
పమ్మున వైవకు మీ లోకమ్ముల భస్మమ్ము సేయుఁ గావున దీనిన్. 6

చ. అనుడుఁ బ్రమోద మంది యతఁ డాగిరిజాహృదయేశుతోడ ని
ట్లనియె భవద్వరంబునఁ గృతార్థుఁడ నైతి మదీయవంశసం
జనితుల కెల్ల నీపరమసాధన మట్టుల చెల్ల నిమ్ము భ
క్తనికరకైరవాకరసుధాకర భూరిదయా ప్రియాకరా. 7

క. అనవుడు నటులే లగు నీ, మనోరథం బగ్గలంబు మానుము దానిం
దనయుఁడు గల్గినవానికి, బని సేయుం గాక యనియెను భవుఁ డాతనితోన్. 8

తే. అమ్మహాశూల మిప్పుడీ యసురయొద్ద, నునికి నెవ్వరు నెదురంగ నోప రతని
నయిన నీచేతఁ జచ్చు నన్యాయవర్తి, గాన దాని కుపాయంబు గలదు వినుము.

ఉ. ఎక్కడికేనియుం జని యనేకవిధంబుల జీవరాసులం
జెక్కిటిఁ గానలోఁ గడుపు ♦ చిక్కటిలం దిని మాపు వీటికిం
జక్కఁగ నేగుచోఁ దెరువు ♦ సయ్యన నీ వరికట్టుకొన్న వాఁ
డుక్కఱు శూల మింటికడ ♦ నుక్కు నిరాయుధవృత్తి నత్తఱిన్. 10

ఉ. నావుడు నక్కుమారుఁడు మనంబున నెంతయు రోసి యిట్లనం
భావితుఁ డైనవానితలఁపా టరయన్ నగుఁబాటు గాదె రా
మావనినాథుతమ్ములకు ♦ నట్టియపౌరుషవృత్తి మేలె మీ
రీవెర వాదరింపఁ దగునే యనినన్ మును లెల్ల నవ్వుచున్. 11

చ. తగినతెఱంగు సేసినను ♦ దాని నెఱుంగరు చెట్ట గాంచినం
దెగడుదు రెల్లభంగి జగతీజనముల్ విను మట్లు గాకయుం
బగతు ననాయతంపుటగపాటునఁ బైపడి గెల్వ నోపినన్
మగఁటిమి దూలుటే దొసఁగు ♦ మాలఁగ దానవుఁ జంపు మెమ్మెయిన్. 12

క. అనిన నతఁ డిదియె కర్జం, బని నిజసంరంభవృత్తియల్పంబు నెఱుం
గనియట్లుగ వీథికి దవ్వునఁ బ్రజ విడియించె దానవుఁడు వచ్చుతఱిన్. 13

చ. తెరువున కడ్డ మేగి దృఢదీప్తశరాసనబాణపాణి యై
పురములు నీఱు సేయుటకుఁ ♦ బూనినరుద్రుఁడుఁ బోలె లక్ష్మణా
వరజుఁడు నిల్చినన్ దనుజవర్గశిఖామణి గాంచి వీఁ డొకం
డెర యగుఁ బొమ్ము నా కనుచు ♦ నేర్పెఱ నాతనితోడ నిట్లనున్. 14

లవణశత్రుఘ్నులసంవాదము.

క. నీ వెవ్వఁడ వే కార్యము, గావింపఁగఁ జూచె దేమికారణ మిచ్చో
నావచ్చు టెఱిఁగి యెఱిఁగియుఁ, బోవక వేఱొండుతెరువుఁ బో నిల్చుటకున్. 15

మ. అనినన్ భూపకుమారుఁ డల్లన సముద్యత్కీర్తి యారామచం
ద్రున కేఁ దమ్ముఁడ నాదునామమును శత్రుఘ్నుండు విప్రప్రియం
బొనరింపం జను దెంచితిం దురభిమానోద్దామ ని న్నాజి మా
ర్కొని మర్దింపఁగ నున్నవాఁడ ననుడుం ♦ గోపోత్కటాకారుఁ డై. 16

శా. ఏమేమీ రఘురాముతమ్ముఁడవె మీ ♦ రేపారి పైనెత్తి మా
మామం బంక్తిముఖున్ వధించినను మీ ♦ మౌర్ఖ్యంబు సైరించి యే
నేమిం జేయక యున్నఁ గ్రొవ్వి యిట నీ ♦ వే తెంచితే మేలు మే
లీమై తోడన పోదు గాక యని దైత్యేశుండు దర్పంబునన్. 17

మ. నిలుమీ యాయుధపాణి నై రణములోని న్నిప్డు నిర్జింపఁగా
వలయున్ వచ్చెద నంచు వీటిదెసఁ బోవం జూచినన్ వీఁడు దో
శ్శ్రీల మొప్పం దనశూల మెత్తికొని నా ♦ పైరాక కార్యంబె యా
కులతం బొందినచోన యీ యసుర నాకుం జంపఁగాఁ జొప్పడున్. 18

క. కావున నీదనుజాధముఁ, బోవంగ నీ కాంగవలయుఁ బొమ్మని యడ్డం
బై వచ్చి మందహాసము, తో వానికి నిట్టు లనుఁ జాతురవచనములన్. 19

క. అగు నగుఁ బో నిత్తునె నా, పగ చేకుఱ నిపుడ యెన్నిభంగుల నయినం
దెగఁ జూతుఁ గాక విడుతునె, మగుడంగ దే పూఁట వెట్టి మా కిచ్చోటన్. 20

ఉ. ఎక్కడఁ బోవవచ్చు నిదె యేచి మదీయశరాంధకార మే
దిక్కును గానకుండ దివిఁ బేటుకొనన్ నినుఁ జుట్టుముట్టుచున్
మిక్కుట మయ్యెడున్ రణము మేకొని చేయఁగఁ బూని యెయ్యెడం
జక్కనిబంట వై నిలుము చచ్చుట తప్పునె యెందుఁ బోయినన్. 21

తే. తొల్లి రాముబాణాహతిఁ ద్రెళ్లియున్న, దశముఖునిఁ జూచుసురలచందమున నాడు
నిశితశరములఁ గూలిన నిన్ను భూమి, సురలు గన్నార నిప్పుడు చూచువారు.

క. అప్పలుకులు విని కన్నుల, నిప్పులు రాలంగ నసుర నృపనందనుతోఁ
జెప్పఁ బలు కొండు గానక, యప్పటియని కియ్యకొని తదనురూపముగన్. 23

శత్రుఘ్నుఁడు ద్వంద్వయుద్ధమున లవణాసురుం జంపుట.

శా. ఆటోపంబున నెక్కటెక్కటియ శౌర్యావేశ రయ్యై నిల్చి య
చ్చోటం గల్గు తరువ్రజంబును శిలాసంస్తోమంబునుం బూన్చి యా
స్ఫోటక్ష్వేళనదృష్టమూర్తి యగుచున్ భూపాత్మజుండుం బటు
జ్యాటంకారము మొనర్చె భూమితలముం బాకంపముం బొందఁగన్. 24

క. ఒకమ్రాను పెఱికికొని సు, భ్రుకుటితముఖుఁ డగుచు దనుజపుంగవుఁడు కుమా
రకు వైవఁ జూచుటయు నది, శకలములుగ నేసె నిశితశరసంఘములన్. 25

చ. నృపతనయుండు దైత్యవిభునిన్ రభసంబునఁ దద్రిబాణజా
లపరివృతాంగుఁ జేయఁగ శిలాతతి నమ్ముల నిల్వరించి గ
ర్వపుబలుకుల్ వెసం బలికి వారనికోపరసంబు పేర్మి వాఁ
డుపలమహోగ్రవర్షము సముద్ధతి మైఁ గురిసెం గుమారుపై. 26

చ. అతఁడు నిశాతసాయకము లద్దనుజుం గని తూఱ నేయఁ గో
పితుఁ డయి నింగితోఁ గదియఁ బెర్చినయొక్కమహామహీరుహం
బతులబలంబునం బెఱికి హస్తయుగంబున నొక్కలావు నా
సతిశయలీలఁ ద్రిప్పి కడునుంబడి దైత్యుఁడు పెట్టు వ్రేసినన్. 27

ఆ. ఆమ్మహీరుహంబు సదరంటఁ దాఁకిన, నొచ్చి పంక్తిరథతనూభవుండు
మూర్ఛ వచ్చి యంగములు శిథిలంబులై, మిడుకు లేక పుడమిమీఁదఁ బడియె.

క. పఱతెంచి కరి మదమునే, డ్డైఱఁ దొండం బెత్తిప్రియ దెప్పఱికమునం
గొఱసంది డాఁకి నేలకు, నొఱఁగినసింగంపుఁగొదమయో ప్పమరంగన్. 29

క. ఉన్న నది చావుగాఁ గొని, యన్నరభోజనుఁడు దుర్మదాంధుం డయి శౌ
ర్యోన్నతి నార్చి భ్రమరి గాఁ, జన్నయెడం దెలిసి రోషసంరంభమునన్. 30

మ. అవనీనాయకనందనోత్తముఁ డమోఘాస్త్రంబు సంధించి క
ర్ణవతంసప్రభ లంగుళీయకముపైఁ బ్రాకంగ నాకర్షణం
బవగాఢంబుగఁ జేసి తైజసముతో నాలక్షితోరస్కుఁ డై
లవణుం గూలఁగ నేసె రౌద్రరసలీలాస్ఫూర్తి శోభిల్లఁగాన్. 31

ఆ. అసురపాటు చూచి వసుమతీసురులు దీ,వనలు మున్నుగాఁగ వచ్చి యక్కు
మారుఁ బొదివి సంభ్రమంబును హర్షంబు, నెసక మెసఁగ నతని కిట్టు లనిరి.

శా. ఈతం డప్రతిమానబాహుబలుఁ డై యేపారి మాతాత మాం
ధాతం దొల్లి వధించె నాపగ భవద్వంశంబునం దెవ్వరుఁ
వే తీర్పంగఁ దలంప రైరి త్రిజగద్విఖ్యాతిగా నిప్డు నీ
చేతం జచ్చెఁ గులంబుఁ దేజముఁ బ్రతిష్ఠింపంగఁ దా నల్పమే. 33

క. అను చుండ నాకసంబున, ననిమిషు లేతెంచి రఘువరానుజ నీ చే
సినలోకహితపరాక్రమ,మున కెద మెచ్చితిమి వేఁడుము వరం బనినన్. 34

తే. నన్ను మధురాపురం బేలనన్నవనిచె,రాష్ట్రమునకు వృద్ధియుఁ బ్రజారంజనంబు
వినుతసద్వర్తనము మఱి,విప్రభక్తి,నాకు దయసేయుఁ డనియె నన్నరవరుండు.

క. వా రమ్మాటకు మెచ్చుచు, గారవ మెసఁగంగ నట్ల కావుత మని మం
దారప్రసూనవర్షము, బోరనఁ గురియించి దివికిఁ బోయిరి ప్రీతిన్. 36

లవణు వధించి మధుర నేలుచున్నశత్రుఘ్నుఁడు పంద్రెండేండ్లకు సన్నుం జూడవచ్చుట.

తే. ఇవ్విధంబున నద్దానవేంద్రుఁ జంపి, మునులచిత్తంబు దేవసమూహకృపయుఁ
బడసి మధురాపురం బేలెఁ బరమధర్మ, నిరతుఁ డై ప్రజ రాగిల్ల నృపవరుండు.

క. ఆదిమహీపతులక్రియఁ, వేదోచితనిఖిలమార్గవేదితముగ ని
త్యోదయమహనీయుం డై, ద్వాదశవర్షముల కన్నవలనితలఁపునన్. 38

క. కతిపయపరివారముతో, నతఁ డేగెడునెడఁ బ్రమోద మడర నరిగె నం
చితధర్మకర్మనిత్యో, ద్యత మగువాల్మీకిమునివరాశ్రమమునకున్. 39

క. అం దభ్యాగతపూజా,నందితుఁ డై యానరేంద్రనందనుఁ డమృత
స్యందముచందం బగుమునిబృందారకుచూడ్కి యెడఁదఁ బ్రీతి యొనర్పన్.

క. అతఁడు దను లవణయుద్ధ, స్థితి యడుగఁగ నల్ల నల్లఁ జెప్పుచు సంభా
వితుఁ డగుచు గాఢలజ్జా,నతిఁ బొందుచు నుండె మునిజనంబులలోనన్. 41

క. ఆశ్రమము నెల్లయెడలను, విశ్రుతమునిదారకులు ప్రవీణతమై మం
జుశ్రుతిమేళన మానం,దాశ్రులుఁ బులకలును దాల్చి నట్లుగఁ బాడన్. 42

తే. అభినవాకృతి యగుకృతి యగుటఁ జేసి, యాత్మఁ గౌతుక మంతంత కగ్గలింప
నమ్మునీశ్వరుచెప్పిన యాదికావ్య,మయినరామాయణము చెవులార వినుచు.

క. సరసం బగురఘుకులపతి, చరితం బొక్కొక్కచో నిజస్వాంతంబుం
గరఁగింపఁ దన్మయత్వముఁ, బొరయుచు నద్దినము నృపతిపుత్త్రుఁడు గడపెన్. 44

మ. మఱునాఁ డమ్మునినాథు వీడ్కొని జగన్మాన్యత్వవిఖ్యాతికిన్
గుఱి యై యుండెడిగంగ దాఁటి మదిఁ గోర్కుల్ ప్రోవుగా వీడు డ
గ్గఱఁ బోఁబోవఁగఁ జూడ్కి యారఘువరాగారంబుపై వేడుకం
బఱచెం గ్రమ్మెడుసమ్మదాశ్రువులతోఁ బల్మాఱుఁ ద్రోపాడుచున్. 45

ఆ. ఇట్టు లరిగి మేదినీశ్వరుఁ గని తత్పదాంబుజంబు లుత్తమాంగమునకు
భూషణముగ మేనుపులకలప్రోవుగాఁ, బ్రణతుఁ డయ్యె నాన్నృపాలసుతుఁడు.

చ. తిరిగి కవుంగిలించి నరదేవకులోత్తముఁ డక్కుమారు నె
మ్మొగము మొగంబుసంగదియ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరిం బొరి నపూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పుగుమృదుమౌళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్. 47

చ. తనుఁ గొనియాడునాతనికిఁ దమ్ముఁడు కేలు మొగిడ్చి యల్ల ని
ట్లను భవదాజ్ఞ మోచి చని యద్దనుజాధము సంగరాంగణం
బున వధియించి విప్రుల కపూర్వమహోత్సవ మాచరించి వా
రనికృప వారు పంప మధురాపురి రాజ్యము సేయు చుండితిన్. 48

క. మిముఁ గొలుచు సుఖమునకు రాజ్యము సౌఖ్యం బీడు గామి నం దునికికిఁ జి
త్తము గొలుపక నావచ్చుట, సముచిత మనుచితము నాకచన నిందు దయన్.

ఉ. నావుడు నల్ల నవ్వి నరనాథుల కిట్లనఁ జెల్లు నయ్య య
చ్చో వసియించినన్ సరిగఁ జుట్టముఁ బాసియు నిల్వఁ జాలి నా
నావిధదేహదుఃఖము మనంబున నోర్చినఁ గాక రాజ్యల
క్ష్మీవిభవంబు సొప్పడునె కేవలమే నృపతిత్వ మారయన్. 50

క. అని బోధించి మగుడ నే, డెనిమిదిదివసములలో నరేశ్వరుఁ డటఁ బోఁ
బనిచిన నాతఁడుఁ బ్రీతిం, జని మధురాపురము రాజ్యసంపదఁ బొందెన్. 51

క. భూనాథుఁ డిట్లు దమ్ములుఁ, దానును వివిధప్రకారధర్మనిరతులై
నానావిధసజ్జనసన్మానసదాదాననిపుణమతి నున్నయెడన్. 52

ఒకానొకబ్రాహ్మణుఁడు చచ్చినకొడుకుం దెచ్చి రామునినగరివాకిటఁ బెట్టి దుఃఖించుట.

ఉ. చచ్చినపుత్త్రు నెత్తుకొని జానపదుం డొకవిప్రుఁ డార్తుఁ డై
వచ్చి నరేంద్రమందిరము వాకిట నాలుసు దాసు నిల్పి వా
పుచ్చి మహోష్ణబాష్పములు బోరనఁ గ్రమ్మఁగ నేడ్చి యేడ్చి క
స్వచ్చుచు మోఁదుచుం గొడుకు వేఁడుచు నెవ్వరి నేనిఁ జూచుచున్. 53

మ. తనయుం డొక్కఁడ కాని నాకు మఱి సంతానంబు లే దేను భా
మినియుం బిమ్మటిసత్క్రియల్ పడయ లేమిం జూడఁ డయ్యెం గటా
చను నే వీనికి నిట్లు సేయ మరణోత్సాహంబు శోకాపనో
దన మంచుం బలుమాట లాడుచుఁ బరీతాపంబు దీపింపఁగన్. 54

క. కాలునకు నాతనూజు న,కాలంబునఁ దనవశంబు । గావింపంగాఁ
బోలునె దుష్పథవర్తులఁ, జాలఁడె శిక్షింప రామజనపతి యనుచున్. 55

ఉ. ఇట్టివి గల్గునే జనుల । కెవ్వరికిన్ నరనాథునెల్ల నే
పట్టున నైన నేల ననుఁ । బాపము చుట్టెనొ కాక దీని నే
నెట్టని నిర్ణయింతు నిది । యింతయు భూపతిచెట్ట గా మదిం
బుట్టెడు నొక్కశంక యిది । పోలుట పోలమి దోఁప దయ్యెడున్. 56

ఉ. ఎయ్యది యెట్టు వోయినను । నీతనికిం బ్రియ మెచ్చునట్లుగా
నియ్యెడ నగ్నివెట్టుకొని । యెల్లజనంబులు సూచుచుండఁ గాఁ
జయ్యన వ్రందిపోయెద విచారము లిన్నియు నేల యంతతో
దయ్యమునెత్తికోలు తుదిఁ । దాఁకెడు నంచు బహుప్రలాపుఁ డై. 57

క. పొరలుచు లేచుచు నలుదెసఁ, దిరుగుచు భూపాలవర్యుఁ । దిట్టుచుఁ దనయుం
బొరిఁబొరిఁ జూచుచుఁ బిలుచుచుఁ,బరిరంభము సేయుచుం డెబలు వేదనతోన్.

క. ఉన్నంత నంతయును విని, యన్నరనాయకుఁడు హృదయ । మాకులముగ నా
పన్నశరణ్యుఁడు గావున, విన్న నగుచుఁ జక్కఁ బెట్టు । వెర వారయుచున్. 59

వసిష్ఠాదిఋషులు విప్రకుమారునిమృతికారణము రాముని కెఱిఁగించుట.

ఉ ఖేదముఁ బొంది మంత్రుల నకిల్బిషవృత్తులఁ దమ్ములన్ వసి
ష్ఠాదిమునీంద్రముఖ్యుల రయంబునఁ బిల్వఁగఁ బుచ్చి వారితో
నాదురవస్థ యున్న తెఱఁ । గంతయుఁ జెప్పిన నమ్మునుల్ సుక
ర్మాదరవృత్తి ని ట్లనిరి । యాదట నర్కకులాగ్రగణ్యుతోన్. 60

చ. కృతయుగవర్తనంబున నఖిన్నమతిం బృథివీసురుల్ దపం
బతులముగా నొనర్తురు నియంత్రితవృత్తిఁ దగంగఁ ద్రేతఁ బూ
జితగుణు లైనరాజులును । జేయుదు రాపరిపాటితో నన
ర్హత గను నాయుగద్వయమునందును దక్కటి రెండుజాతులన్. 61

ఉ. ఇమ్మెయి దప్పి శూద్రుఁ డొకఁ । డిప్పుడు నీ దగుభూమిలోనఁ దీ
వ్రమ్ముగ నిష్ఠమైఁ దపము । వారక సేయుచు నున్నవాఁడుగాఁ
గొమ్మిది తప్పనేర దనఘుం డగు నీతఁడు బాలుఁ డేల తు
ర్యమ్మునఁ బొందు నీదురిత । మయ్యపచారము లేక పుట్టునే. 62

ఉ. కావున నెందు నారసి యకార్యము తెల్లముగాఁగఁ జూచి సం
భావిత మైనచిత్తమునఁ । బాయఁగఁ జేయఁగఁ గర్మసిద్ధి నా
శావలయంబునన్ యశము । సాంద్రముగాఁ గృపఁ గొంకు లేక నీ
వే వధియింప కున్న శిశువేదన క్రమ్మఱు టేల చొప్పడున్. 63

క. అనవుడు మోమలరఁగ న, జ్జనపతి లక్ష్మణునిఁ జూచి । చయ్యన జని వి
ప్రుని నూఱడింపు తత్పుతు, తనువు తగన్ సంగ్రహింపు । తైలద్రోణిన్. 64

క. అని చెప్పి భరతుఁ దగ నా,తనిఁ బురమున నిలువఁ బంచి । తనదుమనోవ
ర్తన ఘనపుష్పకమును న,మ్మనుజేంద్రుఁడు దలఁచె నదియు । మసలక వచ్చెన్.

రాముఁడు పుష్పకారూఢుఁ డై శూద్రతపస్విని వెదకి ఖండించుట.

శా. చాపంబుం బటుబాణతూణయుగముల్ । శాతాసియున్ వర్మముల్
భూపాలుండు విమానరత్నముపయిం । బూజాసమేతంబు ని
క్షేపింపం దగువారిఁ బుచ్చి మును లాశీర్వాదముల్ సేయఁ ద
చ్ఛ్రీపాదంబులు శేఖరద్యుతుల నర్చించెన్ వినీతాత్ముఁ డై. 66

తే. వారి వీడ్కొని యిక్ష్వాకువంశవరుఁడు, పుష్పకం బెక్కి ఖేచరపూజ్యుఁ డగుచు
మున్ను పశ్చిమదిగ్భాగమునకు నేగి, యందుఁ గలయఁ దపస్వుల నరసి యరసి.

క. చూచుచుఁ బలుకుచు వినుచు య,థోచితసంభాషణంబు । లొనరించుచు ని
ష్ఠాచారుల నెల్లను ధ,ర్మాచార్యుం డతివిదగ్ధుఁ । డయి శోధించెన్. 68

క. ఉత్తరమునందుఁ దూర్పున, నిత్తెఱఁగున మునులలోన । నెల్లను గలయం
జిత్తానురూప మగుస,ద్వృత్తంబునఁ జొచ్చి వారి । వెదకుచు వచ్చెన్. 69

క. అక్షయపుణ్యుం డిట్లు ప్ర,దక్షిణముగ భూమిలోనఁ । దడవుచు మునిసం
రక్షలు సేయుచు వచ్చెను, దక్షిణదిక్కునకు వగపు । దనమదిఁ గదురన్. 70

ఉ. అం దొకకొండచేరువ సితాబ్జవనంబులతీరభూమి మా
కందముకొమ్మునన్ బిగియఁ । గాళులు రెంటఁ దగిల్చి వ్రేలుచుం
గ్రింద హుతాశనార్చుల సఖేదమునం గబళించి మ్రింగుచు
న్నైందవము కాంతి నొంద మహానియతపం బొకఁ డాచరింపఁగన్. 71

క. కని యల్లల్లన యచటికిఁ, జనుచు నిరూపించి యతనిచందము దననె
మ్మనమున కెర వయి తోఁచిన, మనుజేంద్రుఁడు చేర నరిగి మధురోక్తిమెయిన్.

క. ఏమికులంబునఁ బుట్టితి, నామం బెయ్యది తపంబునకు ఫల మై నీ
కామించినతెఱఁ గెట్టిది, నీమది నున్నట్లు నాకు । నిక్కము సెపుమా. 73

చ. అనినఁ దపస్వి యిట్లను మహాత్మ జనించితి శూద్రయోనిఁ బే
రును విను శంబుకుండ గతరోషమదభ్రమచిత్తవృత్తి ని
ట్లనితరసాధ్య మైనతప । మర్థి నొనర్చెద మేనితో దివం
బునకు జగత్ప్రశస్తముగఁ । బోవుట కోర్కి నిజంబు సెప్పితిన్. 74

ఉ. నా విని భూవిభుండు మునినాయక సత్యహితోపదేశవా
ణీవిభవంబు చిత్తమున । నెక్కొన నచ్చెరు వంది గాఢసం
భావన చేసి శూద్రముని । పై సదయం బగుచూడ్కి నిల్పి చిం
తావివశత్వ మొందె నృపధర్మము నీచము గాఁ దలంచుచున్. 75

చ. తనయశవంబు మోచికొని । తన్వియుఁ దానును వచ్చి యేడ్చువి
ప్రునియెడ లంతరంగమునఁ । బోక పెనంగిన ఖడ్గముం గనుం

గొనుచు మునీశ్వరానుమతిఁ గ్రూరత కైనను నోర్చువాఁడఁ బో
ష్మని తలపోయుచుండెఁ గృపయం బెడ సేయుచుఁ జిన్నవోవుచున్. 76

క. కరుణాతిశయంబుఁ బ్రజా, పరిపాలనరతియుఁ బెనఁగు వడి యుల్లములోఁ
బిరిగొన నిశ్చయమునకుం, జొరఁ జాలక తలఁకు పాలసుండుసుబోలెన్. 77

క. వెడఁగుపడి యచటఁ బెద్దయు, వడి నిలిచి తలంచుకొని యవశ్యంబును ని
ష్పూ డితనిఁ దెగఁజూడక చొ,ప్పడునే యావిప్రశిశుప్రాణం బనుచున్. 78

క. తల కంటగించుచుండఁగ, బలిమిని నౌషధరసంబు పానము సేయం
దలకొనురోగార్తుని క్రియ, నలమటతో బెరయు తెగువ నలుగులపడుచున్. 79

మ. నరనాథుం డిటు లెట్టకేలకు విలీనం బైనచిత్తంబు సు
స్థిరభావంబునఁ బట్టుకొల్పికొని నిశ్చింతాత్ము నత్తాపసున్
శరణార్థిస్ఫుటరక్ష గోరి తునిమెన్ సంరంభశూన్యాంగుఁ డై
కరవాలంబు మృదుక్రియం బెఱికి రేఖాహీనదీనస్థితిన్. 80

ఆ. అపుడు కుసుమవర్ష మాకసం బెల్లను, బొదివె దేవదుందుభులు సెలంగె
హరిహరాదిదివిజు లంతరిక్షంబున, నిలిచి సంస్తుతించి రెలమి మిగుల. 81

శూద్రమునిని వధించినరాముని దేవతలు ప్రత్యక్షమై గారవించుట.

ఉ. వారలు రాముతోడ రఘువంశనృపోత్తమ యిత్తపోధనుం
డేరికిఁ బొందరానిగతి కేగె సుకర్మము మెచ్చి యేము నీ
కోరినయట్ల యిచ్చెదము కొమ్ము వరం బనినం బ్రమోద మే
పారఁగ విప్రబాలుబ్రదు కాధరణీరమణుండు వేఁడినన్. 82

క. ఏప్రొద్దు శూద్రముని విగ,తప్రాణునిఁ జేసి తీవు ధర్మనిరతి నా
విప్రశిశువుచైతన్యము, నాప్రొద్ద యనూనముగ సమాహిత మయ్యెన్. 83

చ. అని విభునెమ్మనంబు ప్రమదాతిశయంబును బొందఁ జేసి య
య్యనిమిషసంఘ మిట్లనియె నాతనితో మఱియున్ మహీశ యే
మనఘుఁడు కుంభసంభవుని యజ్ఞముతీఱుపలం దదీయద
ర్శనమున కర్థి నేగెదము రమ్మట నీవుఁ దగం దదర్థమై. 84

దేవతలు చెప్పినచొప్పున నగస్త్యునియజ్ఞము చూడ రాముఁ డరుగుట.

చ. అనుచు విమానముల్ నడప నన్నరనాథుఁడు పుష్పకంబుపై
ననుగమనంబు సేసె నమృతాశనులుం జని యమ్మునీంద్రుపూ
జనములఁ దృప్తిఁ బొంది రఘుసత్తము ధర్మవిధిప్రయత్న మా
తని కెఱిఁగించి యేగి రుచిరంబుగ సంయమిఁ గాంచె రాముఁడున్. 85

క. అతఁ డభ్యాగతపూజా, ప్రతిపాదనకౌశలమున రాఘవు సంతో
షితహృదయుఁ జేసి యిట్లను, గతిపయసల్లాపజనితకౌతూహలుఁ డై. 86

మ. అవనీదేవకుమారు చావునకు నీ వత్యంతఖేదంబుఁ బొం
ది వివేకంబున ధర్మనిర్ణయము సంశోధిల్లం బ్రతీకారక
ర్మవిధానంబున వానిమేన మగుడం బ్రాణంబు గల్పించుటల్
దివిజవ్రాతము సెప్పఁగా విని కృతార్థీభూతచిత్తుండ నై. 87

క. నీ కెదురుసూచుచుంటిమి, గాకుత్స్థాన్వయవరేణ్య కడు నద్భుత మీ
లోకమున నిట్టిచరితం, బేకందువ నైనఁ గలదె యెవ్వరి కయినన్. 88

క. అని యమ్మునిపతి లజ్జా,వనతుం డగు రామధరణీవల్లభునకు ని
చ్చె నతిప్రియపూర్వకముగ, ననర్ఘ్యమణిరుచుల వెలుఁగు నాభరణంబుల్. 89

ఆ. ఒసఁగి యిట్టు లనియె నుర్వీశ యొకదివ్య,పురుషుఁ డొక్కకాలమునఁ బొంత నన్నుఁ
గాంచి వినయ మొప్పఁ గాఁ దనదురితంబు, నాకు నెఱుఁగఁ జెప్పె నాకతమున.

క. ఆదురితము వాసిన స,మ్మోదమునన్ బ్రహ్మలోకమున కరుగునతం
డావరవృత్తి నొసంగం, గా దన కీభూషణములు గైకొంటిఁ దగన్. 91

తే. దేవ భరణీయ మిది నరదేవసేవ్య, నీక ధరియింపఁ దగు నని నెయ్య మొంద
దేవకార్యంబు మేదినీదేవహితముఁ, గేలి మైఁ జేయు మని విభుఁ గేలఁ దొడిగె.

క. పలుకుల నాదశరథుగా,ధిలిసుతుఁ దుష్టాత్ముఁ జేసి దీవనలఁ బొగ
డ్తల సముచితోపదేశం,బులఁ దాపసవరుఁడు ప్రొద్దు పుచ్చుచు నుండెన్. 93

రాముఁ డగస్త్యునిచే సమ్మానితుఁడై యయోధ్య కేతెంచుట

తే. అధిపుఁ డాదివసంబున నయ్యామినియును, గడపి మఱునాడు మునిపదకమలములకు
నెఱఁగి వీడ్కొని పుష్పకం బెక్కి సిద్ధ, సాధ్యపూజితుఁ డగుచు నయోధ్య కరిగె.

చ. తనుఁ గని భక్తి మ్రొక్కుటయుఁ దమ్ములఁ గౌఁగిటఁ జేర్చి యాత్మవ
ర్తన మెఱఁగించి తల్లులకు దండనమస్కృతు లాచరించి భృ
త్యనికరపౌరభూజనముదావహుఁ డై కొలు విచ్చి కొంతసే
పున కనుజాదిసేవకులఁ బొమ్మని భూపతి సమ్మదమ్మునన్. 95

క. సమయకరణీయకపిజన, సముదయగోష్ఠీవినోద సారస్యాసం
గమునఁ దగఁ బ్రొద్దు వుచ్చె, స్సముచితచతురాల్పపరిజనంబులతోడన్. 96

క. మనుజపతి తాను దమ్ములు, జనమానసరంజనార్య సమ్మదచరితం
బున నెల్లలోకములుఁ గీ,ర్తన సేయఁగ నిట్లు పూజ్యరాజ్యము నడపెన్. 97

ఆ. అంత నొక్కనాఁట ననుజుల రావించి, ధర్మసంగ్రహైకతత్పరాత్ముఁ
డగుటఁ బుణ్యకర్మ యత్నాదరమున వా,రలకు నిట్టు లనియె రామనృపతి. 98

చ. క్రతువులయందు మేటి యనఁ గా నుతి కెక్కినరాజసూయ మ
ప్రతిహతవృత్తిఁ జేయునృపభావము గౌరవ మొందఁ జేత యీ
ప్సిత మిది మీకుఁ జూడ సవిశేషసముద్యమ మేనిఁ దక్కి యా
రతమతి నుత్సహింపుఁ డభిరామముగా విభవాస్పదంబుగన్. 99

చ. అనుడు వినీతిమై భరతుఁ డారఘునందనుతోడ నల్ల ని
ట్లనుఁ గరుణావిధేయమతివై యిపొగడొందిననీకు విశ్వభూ
జనమనుజేశ్వరప్రకరసంక్షయమూలము నాఁ బ్రసిద్ధి కె
క్కిన క్రతు వేల యొండొకటికిం దొడఁగన్ మముఁ బంపు పెంపునన్. 100

ఆ. అనినపలుకు లియ్యకొనుచు రాఘవునకు సౌ,మిత్రి యిట్టు లనియె సత్త్రసమితి
యందు ముఖ్య మగుట నశ్వమేధంబు పూ,జ్యంబు దానిఁ జేయు మధిపనీవు.

రాముఁ డశ్వమేధయాగము సేయుట.

మ. అనినం దమ్మునిమాటఁ గైకొని మహీశాగ్రేసరుం డాతనిం
బనిచెన్ రాజుల విప్రకోటి మునులన్ బంధువ్రజంబుం గరం
బనురాగంబునఁ బిల్వఁ బంప నతఁడున్ యజ్ఞోచితామంత్రణం
బొనరించెన్ సకలావనీశజనచిత్తోల్లాససంపాది యై. 102

క. జనపతి వసిష్ఠముఖస,న్మునులయనుజ్ఞ గొని లక్ష్మణుని ఋత్విజులం
గనకాదివస్తుయుతముగ,వెనుకం బోఁ బనిచి హయము విడిచె నియతుఁ డై.

తే. పుణ్యతర మగు నైమిశారణ్యభూమి, భాగమున యజ్ఞవాట మపారవిభవ
భాసితంబును శుచియుఁ గాఁ జేసియున్న,నందులకుఁ జనిమంత్రతంత్రాన్వితముగ.

క. క్రతు వొనరింపఁ దొడఁగి భూ,పతి పత్నీకృత్యములకుఁ బసిఁడిని సీతా
ప్రతిమ నొడఁ గూర్చుకొని హృ,ద్గతఖేదము లోన నడఁచి ధైర్యము పేర్మిన్.

క. నానాదేశసమాగతు,లైన వివిధజనములం బ్రయత్నంబున స
న్మానించి తత్తదుచితా,నూననిఖిలసంవిధాప్రయోజకుఁ డగుచున్. 106

క. అన్నంబు వస్త్రములు సం,పన్నహిరణ్యంబు రుచిరబహుమణులును శ
శ్వన్నిరతి నొసఁగుఁ బ్రియమున, నన్నరపతి విప్రకోటి కచ్చెరు వారన్. 107

క. సరసఫలకందమూలో,త్కరములు వేర్వేఱ బహుల కటములుఁ దెప్పిం
చి రఘువరేణ్యుఁడు సంయమి,వరులకు నొప్పించె శిష్యవర్గము లలరన్. 108

కుశలవులు యాగశాలకు వచ్చి రామాయణగానము సేయుట.

ఉ. ప్రీతి జగంబుచిత్తములఁ బెంపు వహింపఁగ నిట్లు చెల్లఁ బ్రా
చేతసుఁ డమ్మఖంబునకు శిష్యయుతంబుగ వచ్చి దారచిం
తాతురుఁ డైన రాముని యథార్హవిధానము శాతకుంభసీ
తాతనుసంవిధానచరితం బగు టెల్ల నెఱింగి హృష్టుఁ డై. 109

క. సీతాతనయులఁ బ్రీతిస,మేతుం డై పిలిచి వారి కిట్లనియె జఘ
న్యేతరుఁ డగు రఘునందను, చేతోగతిఁ దెలియఁ గోరు చిత్తముతోడన్. 110

ఉ. గేయరసంబు నింపు నవకిల్బిషవర్ణములందు మాగధ
శ్రీ యలవడ్డకోవిదుల చిత్తము లార్ద్రతఁ బొందునట్లుగా

నీయెడ నధ్వరాగతము।నీంద్రనరేంద్రులపాలి కేఁగి రా
మాయణ మర్థిఁ బాడుఁడు సమాహితమానసవృత్తి నిత్యమున్. 111

తే. యాగశాలోపకంఠంబు।నందుఁబోయి, వెరవుమైమీరలొక్కొక్క।సరిక్రమమున
రాముచెవి సోఁకునట్లుగా।నేమిభంగి, నైనఁ బాడుఁడు తగుసమ।యంబులెఱిఁగి.

క. జను లెవ్వ రేని మిమ్మా, మనుజేంద్రుం డున్నయెడకు। మన్ననమైఁ దో
డ్కొని చనినను నాకర్ణన,మునఁ బతి పిల్పించె నేని। ముదమునఁ జనుఁడీ. 113

క. మనుజేశ్వరుసభ నే నున్నను లేకున్నను మనంబు।నం గొంకక పా
వన మగునానృపుచరితము, వినిపింపుఁడు చొచ్చి యతని। వేడుకకుఁ దగన్.

చ. అని ముని చెప్పి వేడ్క హృదయంబులఁ బట్టుకొనంగ మైథిలీ
తనయులు దాని కియ్యకొని। దండనమస్కృతు లాచరించి వీ
డ్కొని పరిషత్ప్రదేశములకుం జని పాడుచు నల్లనల్ల నే
ర్పున మఖశాలచేరువకుఁ। బోయి నృపశ్రుతిగోచరంబుగాన్. 115

క. సరసధ్వనిఁ బాడఁగ న, న్నరపతి యాలించి నిజగుణ।స్తవనకథా
విరచన యగు టెఱిఁగి తదీ,యరసానుగుణప్రకర్ష। మభినందింపన్. 116

చ. తలఁచి మహీశులన్ మునులఁ। దమ్ముల బంధుల సత్కవీంద్రులం
గలల విదగ్ధులై ననట।గాయకవైణికవాంశికాదులం
బిలువఁగఁ బంచి వైభవము।పెం పెసలారఁగ వార లెల్లఁ దన్
గొలువఁగ నాకుశీలవుల।కుం దగ దర్శన మిచ్చె నిచ్చినన్. 117

క. చొత్తెంచి రామువడు వ, చ్చొత్తినచందమునఁ దనువు। లొప్పఁగ రూపా
యత్తంబులైనజనముల, చిత్తములు వికాస మొంద। సీతాతనయుల్. 118

తే. రాముచరితంబు గేయాభి।రామమధుర,పదవిలాసమనోహర। భావభంగిఁ
జతురవాక్యార్థసుస్యక్త। సరసలీల, వివిధగతిఁ బాడుచున్నయ।య్యవసరమున.

క. వీరలముని వేషంబుల, కారణమునఁ గాక యొడలి। కట్టడయు ముఖ
శ్రీరామణీయకంబు మ,హీరమణునియట్ల కాదె। యిరువుర కరయన్. 120

రాముఁడు కుశలవగానము విని సమ్మానించుట.

క. అని యెల్లజనంబులు నె, మ్మనములఁ దలపోయుచుండ। మనుజేశ్వరుఁ డ
మ్మునిబాలకులకు నొసఁగెను, గనకము నాభరణములును। గారవ మెసఁగన్.

చ. ఒసఁగిన నిక్కుమారు లవి। యొల్లక పల్కిరి మాకుఁ గాయలుం
గసురులు వేళ్లు వెల్లఁకులుఁ। గాక సముజ్జ్వలభూషణంబులుం
బసిఁడియు నేల యుక్తమె త।పస్విజనంబులకుం బరిగ్రహం
బసమభవద్గుణస్తుతిక।థైకపరత్వవిభూతి చాలదే 122

చ. అన విని గారవంబు హృద।యంబునఁ బుట్టఁగ వారిఁ జూచి య
య్యినకులముఖ్యుఁ డుత్సుకత। నెవ్వరివారల రీప్రబంధ మే

మునికృత మన్న నాదికవి । మోము గనుంగొని యక్కుమారు లం
దనుమతి గాంచి యి ట్లనిరి । యానృపచంద్రునకుం బ్రియంబుగన్. 123

క. ఈసందర్భము వీరలు, నేసినయది మేము వీరి । శిష్యులము రసో
ల్లాసమధుర మగుదీని ను,పాసింతుము ప్రీతి నేత । దనుమతి నెందున్. 124

చ. అనుడు వికాస మంది విభుఁ । డమ్మునినాథుముఖారవిందముం
గనుఁగొని మీకృపామహిమ । గావ్యమయోజ్జ్వలమూర్తిఁ దాల్చి పా
వనముగఁ జేసె నాదులఘు।వర్తనముం భువనంబు లాదరం
బునఁ గొనియాడు నింక ననుఁ । బుణ్యుఁడ నైతిఁ ద్రిలోకపూజితా. 125

క. ఈవాత్సల్య మధికసం,భావనమై మీర లెఱుక । పలుప కునికి యే
మో వీర లెవ్వరో విన,గావలయుం గూఢపథము । గాఁ దగు నేనిన్. 126

వాల్మీకి రామునికి సీతావృత్తాంతము చెప్పి కుశలవుల నతని కొప్పించుట.

క. అనురఘునాయకుపలుకులు, విని మునిపతి జనకతనయ।వృత్తాంతం బీ
తని కెఱిఁగింపఁగ నిది తఱి, యని యతనికి నిట్టు లనియె । నందఱు వినఁగన్. 127

చ. వినయముఁ బెంపు నేర్పును వి।వేకమునుం గలసీవు మేదినీ
తనయఁ దొలంగు టెట్టు లుచి।తంబుగఁ జూచితి వట్లు వోలు నే
యనలవిశుద్ధ యైనసతి । నక్కట యెక్కడ నేనిఁ బొమ్ము నీ
వని వెడలంగఁ ద్రోచిన ద।యాగుణ కీర్తికి హాని పుట్టదే. 128

క. నాఁ డగ్నిలోనఁ ద్రోచిన,వాఁడ వకట యంతఁ బోక । వల్లభ నిమ్మై
నేఁ డడవిఁ ద్రోచి తేదఁ గడు, వాఁడి గదే నీకు రాఘు।వకులప్రవరా. 129

తే. అంతనుండియు నీతోడ । సలిగి యున్న,వార మే మది యట్టుండె । వారిజాక్షి
తెఱఁగు వినుమనియిట్లను।మఱియుముని వి,నీతజాతోత్సుకుండగు।నృపవరునకు.

ఉ. క్షత్త్రియపుత్త్రికాభరణ।గౌరవలీల వెలుంగు మేదినీ
పుత్త్రి మదాశ్రమస్థలము । పొంత వనంబునఁ ద్రోచి వచ్చె సౌ
మిత్త్రి తపస్విబాలకులు । మెల్లుకఁ గన్గొని వచ్చి నాకుఁ ద
న్మాత్త్ర నెఱుంగఁ జెప్పుటయు । మానిని యున్నెడ కేను గ్రక్కునన్. 131

క. చని యనునయించి యాశ్రమ,మునకుం గొని పోయి యచటి । మునివరపత్నీ
జనములభంగి నుటజవ,ర్తినిఁ జేసియంతఁ గొన్ని । దినములు సనినన్. 132

క. చకితాత్ము లగుమహీసురు,లరుఁ బ్రీతి యొసర్ప నాఁడు । లవణునివధ నేఁ
తకు నీ వనుపఁగ శత్రు,ఘ్నుకుమారుం డందుఁ బోవు । కందువఁ బ్రీతిన్. 133

క. జనకసుత కవలవారిం, గనుడు ననుష్ఠితసమస్తకరణీయుఁడ నై
మనువంశముఖ్య కుశలవు, లనియెడునామంబు లిడితి । నయ్యిరువురకున్. 134

శా. కాలౌచిత్యము మీఱఁ బెక్కువలమైఁ । గల్యాణసౌమ్యాంగులై
కేలీలోలతపస్విదారకసహా।క్రీడం బ్రవర్తిల్లుచుం

బాలేందుద్యుతిలీల నజ్జ్వలకళాప్రౌఢత్వముం బొందుచుఁ
శీలంబాకృతు లొందినట్లగుచు నాత్సేనం బ్రియం బందుచున్. 135

తే. సకలవిద్యాలయంబుఁ బ్రశస్తి కెక్క, యక్కుమారులు రామాయణాఖ్యమైన
మత్ప్రణీతప్రబంధంబు మధురగేయ, సహితముగ నభ్యసించిరి సచ్చరిత్ర.

క. అని తెలియఁ బలుకుతఁ దదుపవచనపద్ధతిమై నెఱిఁగియు సంశయమతిఁ ద
న్మును సుతులఁ జూడ నమ్ముని, మనుజేంద్రున కిట్టు లనియె మఱియుం బ్రీతిన్.

క. వారల నివ్విధమున సంస్కారవిశేషాభిమతులఁ గావించితి నా
చారవిజితసంయము లగు, వీరలు వారక ప్రతర్క్యవిభవైకనిధీ. 138

తే. ఎంతకాలంబు వోయిన నెరవ కాదె, యొరులసొమ్మని తలఁచియాగోత్సవమున
కిపుడు కానుకగా వీరి నిట్లు తెచ్చి, నిన్నుఁ జేర్చితి రఘుకులనృపవరేణ్య. 139

క. అనవుడు జనపతి నెమ్మనమున నచ్చెరువాటు ముదము ముప్పిరిగొనఁగాఁ
గనుదోయి సమ్మదాశ్రుల, మునుఁగఁగఁ బులకములు మేనముసుఁగువడంగన్.

క. ఆనందము గదిరిన నభి,మానియగుట నయ్యవస్థ మది నిడుకొని య
త్నేనిం గర్తవ్యము దగ, నానతి యిం డనిన మునిజనాగ్రణి ప్రీతిన్. 141

సీత నిజపాతివ్రత్యప్రభావంబున భూమిం గ్రుంగుట.

సీ. జనకతనూజఁ గైకొను మిది మామతం బనిన విసీతుఁడై యవ్విభుండు
మునినాథ యవిచారముఖ్యంబు గాన లోకంబు మెచ్చించుట కడిఁది గాదె
ముద్దియ మీచిత్తమునకుఁ బోలినభంగి నీయెడ శపథంబు సేయుఁ గాక
యనవుడు నిది వోలు నని ముని శాసింపఁ దాపసీజనసహితంబు గాఁగ

తే. సీత యచ్చటి కేతెంచి మాతయయిన, భూమిదెసఁ జూచియెమ్మెయి రామనృపతి
కేను దప్పనిదాననయేని నన్నుఁ, జేర్చికొను మని తడవ నచ్చెరువు గాఁగ. 142

మ. అవనీదేవత సింహపీఠగతయై యచ్చోటఁ దోతెంచి రా
ఘవుదేవిం దొడదోయిపై నునిచి లోకం బద్భుతం బంద నే
ల వెసం జొచ్చిన ధాత్రి కల్లునృపురోశల్యంబు మునీంద్రుండు యో
గ్యవచోయుక్తులఁ బాపి పుత్త్రయుగ యోగానంద మగ్గించుచున్. 143

క. ఇహపరసౌఖ్యనిదానము, మహితాపత్యంబ యనుచు మనుజేంద్రు మనో
విహరణముఁ బుత్రలాభ, ప్రహర్షవిషయంబుఁ జేసెఁ బరమప్రీతిన్. 144

తే. అక్కుమారులు రాముపాదాంబుజముల, కెరఁగి భూదేవి తప్పు సహింపవలయు
దేవ యని ముద్దుపుట్టఁ బ్రార్థించునట్లు, గాఁగ సత్తతి వాల్మీకి గఱపుటయును.

రామచంద్రుండు పుత్త్రసహితుం డై నిజపురంబుఁ జొచ్చుట.

క. వారలు నవ్విధమున నా, భూరమణుని మదికి నింపు పుట్టింపఁగ మం
దారకుసుమములు దొరఁగెను, బోరన దివి దేవదుందుభులు గర్జిల్లెన్. 146

చ. జయజయశబ్దముల్ సెలఁగ ॥ సర్వజనంబు నెలర్ప నర్మిలిం
బ్రియసుతయుగ్మముం దిగిచి ॥ పెద్దయుఁ బ్రొద్దొగిఁ గౌఁగిలించి మో
దయుతమనస్కుఁడై నృపతి ॥ దమ్ముల సమ్మద మొందఁ జేసి య
న్వయపరివృద్ధి తల్లులమనం బలరం బ్రకటించి వేడుకన్. 147

క. నగరం బుత్సవరమ్యం,బుగ నప్పు డలంకరింపఁ ॥ బుచ్చి సముచితం
బుగ సకలజనముఁ బొమ్మని, తగువారును మునివరుండు ॥ దమ్ములుఁ దానున్.

క. కొడుకులతపస్వివేషము, లుడిపి నరేశ్వరకుమార ॥ యోగ్యపరికరం
బొడఁగూర్చి వార లుచితపు, నడవడి వర్తిల్లఁ గ్రతునిశనంబులు సనినన్. 149

క. ధరణీసురగణము మునీ,శ్వరులను భూపతుల నర్థి ॥ వర్గము నమ్యో
న్వెరవున సంభావించుచుఁ, బరువడి వీడ్కొలిపె రఘునృపాలుం డెలమిన్. 150

తే. వినయ మొప్పంగ వాల్మీకిమునికి నర్చ, లిచ్చి మీకృపపెంపున ॥ నెల్లవగలుఁ
బాపె నాహ్లాద మొనఁగూడె ॥ భవదనుగ్ర,హంబ మాకెడుగడయనుచు ॥ ననుచునతని.

క అనుచుటకును బెద్దయుద,వ్వనుగమనము సేసి భక్తి ॥ నడుగులఁ బడి వీ
డ్కొని యమ్మునిసత్తముడీ,వనలం బ్రీతాత్ముఁ డగుచు ॥ వచ్చెం బురికిన్. 152

తే. ఇట్లు కృతకృత్యుఁ డగు రాఘవేంద్రు నెల్ల,వారు నమ్యోన్యవిధంబుల ॥ వచ్చి కాంచి
మన్ననలుమున్న గాఁదమ ॥ విన్నపములు, సఫలములు సేయఁదోషిత ॥ స్వాంతులైరి.

క. తనకన్న ప్రజయ కాఁగ్రై,కొని భూప్రజ నెల్ల నొక్క ॥ కొఱఁతయు లేకుం
డ నడపి పాలించుచు నమ్మనుజేంద్రుఁడు పూజ్య రాజ్య ॥ మహిమాన్వితుఁడై.

కుశలవులకు రాముఁడు రాజవిద్యల నేర్పించుట.

క. మునులకడఁ దత్ప్రకారం,బున సునికిం జేసి ము న్ను ॥ పూర్వం బని నం
దనులకు నుచితపరిశ్రమ, మొనరించువిధంబునకు సముత్సుకుఁ డగుచున్. 155

సీ. భరతవాత్స్యాయన ॥ ప్రభృతినాగరికశాస్త్రంబులదెస నైపుణంబు వడయ
హయగజస్యందనారోహణక్రియాదక్షతవలన వైదగ్ధ్య మొందఁ
గోదండకరవాలకుంతముఖ్యాయుధశ్రమములయందుఁ బ్రశస్తి నొంద
వేణువీణాప్రౌఢ ॥ వివిధకళాభ్యాసములయెడఁ బ్రాశస్త్యములు వహింపఁ

తే. జేసి తజ్జ్ఞులమనము లచ్చెరువడంగ, నక్కుమారుల నొక్కొక్క ॥ యవసరమున
నేర్పు మెఱయించిముదముద ॥ లిర్ప శిక్ష,కులకుఁబసదన మొసఁగునిట్టలముగాఁగ.

క. ఇత్తెఱఁగునఁ గుశలవుల ను,దాత్తపరిశ్రములఁ జేసి ॥ తద్విమలగుణా
యత్తమతిఁ జేసి శస్త్రా,ద్యుత్తమబాణములవిధము ॥ లుపదేశించెన్. 157

ఆ. సర్వకార్యములను ॥ శత్రుఘ్నలక్ష్మణ, భరతు లరసి తీర్ప ॥ ధరణియెల్లఁ
బొగడుతోడియాజ్ఞ ॥ నెగడి ప్రవర్తిల్ల, నతఁడు సద్వినోదరతిఁ జరించు. 158

క. సుతులఁ గొనియాడు విద్వత్తతి నుపాసించు భూమి । ప్రజ నరయు మహా
క్రతువు లొనరించు గురుదైవతపూజలు సేయు సాధువర్గముఁ బ్రోచున్. 159

తరలము. ధరణి నెందును గాలవర్షము । దైవయోగసమగ్రమై
కురియ మోదముఁ బొంద సస్యము । కోటికొండలు పండ ధ
ర్మరతి సర్వజనంబు నుత్తమ । మార్గవర్తనశీలతం
బొరయ ధారుణి యేలె రాఘవపుంగవుండు మహోన్నతిన్. 160

ఆ శ్వా సాం త ము.

మ. మురజిత్కల్పుఁడు కల్పవృక్షకుసుమామోదప్రతీకాశకీ
ర్తిరమాధాముఁడు ధామమాలితులనాశ్రీపాత్రతేజోనిరం
తరదిక్చక్రుఁడు చక్రభృత్పదయుగధ్యానక్రియాభ్యాసత
త్పరతానిత్యుఁడు భవ్యకృత్యుఁ డసమౌదార్యుండు సౌమ్యుం డిలన్. 161

క. మనుజాబ్జాకరసవితృఁడు, వినయస్తవనీయవిభవ । విశ్రుతనిజవ
ర్తనుఁడు పరివాహసన్నాహనబిరుదాంకుండు శస్త్రవిదభివిజయుఁ డిలన్. 162

మాలిని. ధరణిభరణదృప్యత్పార్థివార్థప్రకాండా
హరణపరిణతుం డుద్యద్గుణాఢ్యక్షితీంద్రా
భరణకరణగాథాపండితోద్యత్సదావి
స్ఫురణవరణనిత్యస్తుత్యలక్ష్మీశుఁ డుర్విన్. 163

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిధేయ తిక్కననామధేయ ప్రణీతం బయినయుత్తరరామాయణం బనుమహాకావ్యంబునందు సర్వంబును దశమాశ్వాసము.

నిర్వచనోత్తరరామాయణము

సం పూ ర్ణ ము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# ఆంధ్ర గ్రంథములు

## వచన గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 3 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 3 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 3 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 4 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు (అచ్చు) | | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| అరేబియన్‌నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారము, ప్రహసనం | 0 | 4 |
| తులసీదాసు రామాయణము | 8 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, వచనం | 3 | 8 |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 6 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 8 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 0 |
| నీతిరత్నాకరము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 0 | 12 |
| సంగ్రహభారతము | 1 | 4 |
| సంగ్రహభాగవతము | 1 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 | 12 |
| పతివ్రతలచరిత్రలు | 2 | 0 |
| దక్కనుపూర్వకథలు | 2 | 0 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 1 | 8 |
| దశకుమారచరిత్రము | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | 0 | 14 |

| | రూ. | అ. |
|---|---|---|
| [illegible], గోపాలుడు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| వైద్యులకథలు | 0 | 4 |
| భేతాళునికథలు | 0 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | 0 | 8 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| రేచుక్క పగటిచుక్క కథ | 0 | 3 |
| సత్యసేనవిజయము | 0 | 4 |
| ఋషులచరిత్ర | 0 | 8 |
| పురాణగాథలు I | 0 | 12 |
| ,, II | 0 | 12 |
| కాజీరాయని చరిత్ర | 0 | 14 |
| రఘువంశకథ | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర | 1 | 0 |
| వివేకానందవిజయము | 2 | 0 |
| బరిష్యావినోదకథలు | 0 | 12 |
| ఈసబునీతికథలు, 1-వ భా॥ | 0 | 6 |
| డిటో 2-వ భా॥ | 0 | 8 |
| పంజాబుఅల్లరి | 0 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 |
| మర్యాదరామన్నకథలు | 0 | 3 |
| మైరావణచరిత్ర | 0 | 1 |
| షేక్స్పియర్ నాటకకథలు | 1 | 8 |
| అనంతసాగరము, బుక్కరాయ సముద్రచరిత్ర | 0 | 12 |
| ప్రహ్లాదచరిత్ర, ప్రతిమలతో | 0 | 6 |
| శకుంతల ,, | 0 | 6 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| నల | ,, | [illegible] | 8 |
| సావిత్రి | ,, | [illegible] | [illegible] |
| హరిశ్చంద్ర | ,, | 0 | 8 |

— నవలలు —

| | | రూ. | అ. |
|---|---|---|---|
| సీతారామము | | 1 | 4 |
| ఐవన్హో, | నవల | 0 | 8 |
| మదాలస | ,, | (అచ్చు) | |
| సుజనరంజని | ,, | 0 | 8 |
| విజ్జలదేవి | ,, | 1 | 8 |
| ఉన్మాదిని, | నవల | 0 | 4 |
| రాధారాణి | ,, | 0 | 4 |
| అస్తమయము | ,, | 1 | 8 |
| దుర్గేశనందని | ,, | 0 | 12 |
| కపాలకుండల | ,, | 0 | 12 |
| లక్షణ | ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ,, | 1 | 8 |
| లీల | ,, | 0 | 6 |
| రాజర్షి | ,, | 1 | 0 |
| తారాబాయి | ,, | 0 | 14 |
| దిల్లారామ | ,, | 1 | 4 |
| కోవలన్ కన్నకి | | 0 | 12 |
| మనోహరి | ,, | 0 | 14 |
| వీరబాల | ,, | 0 | 8 |
| ఆనందమఠ | ,, | 0 | 12 |
| లాలాబాయి | ,, | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము | ,, | 1 | 8 |
| రోషినార | ,, | 0 | 12 |
| బాలాదిత్య | ,, | 2 | 0 |
| దేశభక్తుడు | | 1 | 0 |
| [illegible] | | | [illegible] |
| చంద్రగుప్తుడు, నవల | | 2 | [illegible] |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నీతిసింధువు | ,, | 0 | 10 |
| వనజాక్షి | ,, | 0 | 12 |
| స్వప్నయాత్ర | ,, | 0 | 12 |
| ముగ్గురుమూర్తులు | | 1 | 4 |

### వివిధగ్రంథములు.

| | రూ. | అ. |
|---|---|---|
| హిందీ ఇంగ్లీషుబాలశిక్ష | 0 | 4 |
| హిందీ తెనుఁగుబాలబోధ | 0 | 4 |
| పెద్దబాలశిక్ష బజారుప్రతి | 1 | 0 |
| డిటో అట్టబైండు | 1 | 8 |
| చిన్నబాలశిక్ష | 0 | 3 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష | 0 | 4 |
| ఆంధ్రద్రావిడబాలశిక్ష | 0 | 4 |
| ఆంధ్రద్రావిడ మొదటివాచకం | 0 | 6 |
| ,, రెండవవాచకము | 0 | 6 |
| నేరములుచేయుజాతులచరిత్ర, ప్రతిమతో | 1 | 0 |
| పాకశాస్త్రము, కంది సుబ్బరావుగారిది | 1 | 12 |
| చిత్రలేఖనము (Drawing) | 1 | 4 |
| జంత్రి, భూమిశిస్తు, అధికపన్నుల విభజనలు విశదముగనున్నవి | 0 | 8 |
| గాంధిమహాత్ముని హైందవస్వరాజ్యము | 1 | 0 |
| ఆకాశవిమానములు, ప్రతిమలతో సహా | 0 | 8 |
| భావలహరి | 0 | 8 |
| వ్యవసాయబోధిని | 0 | 8 |

### నిఘంటువులు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీవేంకటేశాంధ్రము,పద్యశా॥ | 0 | 6 |
| బాలచంద్రోదయము | 0 | 8 |
| షడ్భాషామంజరి (ఆరుభాషల ఒకేబ్యులరి) | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీక, అకారాద్యనుక్రమణికతో | 1 | 4 |
| డిటో క్యాలికోబైండు | 1 | 8 |
| శబ్దార్థచంద్రిక | 6 | 0 |
| తెనుగుసామెతలు with English-Translation by Capton-Carr | 1 | 4 |
| Translation Guide - English ot Telugu & Vice Versa. | 2 | 8 |
| Sankaranarayana's English-Telugu Dictionary. శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెనుఁగు అర్థముగలది) | 12 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టుడిక్షనరి | 3 | 0 |
| సంస్కృతాంధ్రనిఘంటువు | 3 | 8 |

### ఆంధ్రవ్యాకరణాలంకారములు.

| | రూ. | అ. |
|---|---|---|
| అథర్వణకారికావళి | 1 | 8 |
| అనంతునిఛందము | 1 | 0 |
| అప్పకవీయము | 3 | 0 |

**వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,**

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.